## గ్రంథకర్త యితర రచనలు

ఇండియాలో విప్లవం
ఇండియా భవిష్యత్తు
యం. యన్. రాయ్ జీవితం
జవహర్‌లాల్ నెహ్రూ
ప్రపంచ కథలు
ప్రపంచ నాటికలు
మల్లెపూలు (కథలు)
యం. యన్. రాయ్ వ్యాసాలు 2వ భాగం



వెల రూపాయి

# పరిచయం

యం. యన్. రాయ్ సిద్ధాంతాలను క్లుప్తంలో ఒక్కొక్క విషయంమీద ఒక్కొక్క భాగంగా ముద్రించటం మా అభిప్రాయం. రాయ్ రచించిన 'మెటీరియలిజమ్' అనే గ్రంథంలోనుంచి తెలుగు పాఠకులు అర్థం చేసుకోగలిగిన కొన్ని ప్రకరణాలే యీ భాగంలో అనువాదం చేయబడ్డవి.

'మనది ఆధ్యాత్మిక దేశం—పాశ్చాత్య దేశాలనుంచి మనం నేర్చుకోవలసింది యేమీలేదు' అనే వాదనలోని— ఆధ్యాత్మిక వాదమంటే యేంటి? భౌతికవాద ఆదర్శం యేంటి? ఇవి రెండూ యే యేవర్గాలకు, యే యేకాలాల్లో సాధనగా వుపకరిస్తవి? జాతీయవాదం, ఆధ్యాత్మిక వాదాలకున్న సంబంధం యేంటి? భారత దేశంలో భౌతికవాదం లేదా? అనే విషయాలు యిందులో విపులంగా చర్చించ బడ్డవి. పాఠకులు విమర్శనా దృష్టితో ఈపుస్తకాన్ని పరిశీలించాలని మా ప్రార్థన.

ఇట్లు
సంపాదకుడు

# విషయ సూచిక



# జాతీయ వాదం

"పాశ్చాత్య నాగరికత" అనగానే యేవగించుకోటం దేశభక్తిలో ఒక భాగంగాయెంచబడుతుంది సనాతనిస్టులు, ఆర్యసమాజం, హిందూమహాసభ మొదలైన సంస్థల్లో యీయేవగింపు నూటికి నూరుపాళ్ళు వ్యాప్తి చెందింది

మన రాజకీయ స్వాతంత్ర్య వుద్యమం సక్రమ పంథాలో నడిస్తే పెట్టుబడిదారీ విధానంప్రకారం దేశం అభివృద్ధిచెంది పాశ్చాత్య దేశాల్లో మాదిరిగా యిక్కడకూడా అదేవిధంగా 'నాగరికత' వస్తుంది ప్రజాస్వామిక సూత్రాల ప్రకారం జరిగితే నేడు యిండియాలో జరగవలసినవిప్లవం యిది. కాని పెట్టుబడిదారులు అధికారానికి రాకుండా చెయ్యాలంటే రాజకీయ కార్యక్రమం కేవలం శుద్ధజాతీయవాద దృక్పథంతో వుండకూడదు. అలాంటి స్థితిలోనే భారత ప్రజానీకం అధికారాన్ని హస్తగతం చేసుకొని పెట్టుబడిదారీ పద్ధతిలోవున్న లోట్లు దోపిడీ విధానం లేకుండా 'పాశ్చాత్య నాగరికత' నాధారం చేసుకొని సమాజాన్ని అభివృద్ధి మార్గంలో నడపటానికి అవకాశం వుంటుంది. అలాంటి పరిస్థితి యేర్పడ్డప్పుడు 'పాశ్చాత్య నాగరికత' లోని లోటు పాట్లను, మంచిచెడ్డలను విమర్శనా దృష్టితో పరిశీలించి మంచిని స్వీకరించి చెడును త్యజించవచ్చు. అలా కాకుండా ఒకప్రక్క సంఘంలో నూతన వ్యవస్థ కావాలంటూ మరొకప్రక్క ఆవ్యవస్థ పనికి రాదనటం కేవలం వెర్రితనం. నేడు మనదేశ నాయకత్వం యిదేస్థితిలోవుంది.

కాంగ్రెసులో నేడు యీ విభిన్న దృక్పథాలు రెండు కనబడుతున్నవి. ఒకపక్షం సంఘసంస్కారం కావాలంటే మరొకపక్షం పెట్టుబడిదారీ విధానానికి త్రోవతీస్తుంది కాని యీరెండు పక్షాలకూ గాంధీ సిద్ధాంతాలే ఆవశ్యం. కాంగ్రెసులో అంగనిర్మాణం, దృక్పథం ఆచరణలో పరస్పర విరుద్ధమైన యెన్ని లోటులున్నా గాంధీతత్వమే పూర్తిగా వ్యాపించివుంది. కాగా 'గాంధీ సిద్ధాంతాలు పాశ్చాత్య నాగరికతకు విరుగుడు' అని కూడా పూర్తిగా విశ్వసింపబడుతున్నవి

నేడు యే గాంధీవాది కూడా రైల్వే మార్గాలు, మోటారుకార్లు, ఆధునిక వైద్యాలయాలు చూచి వాటిని 'పాశ్చాత్య నాగరికత' అని హేయంగా చూడనక్కర్లేదు. అసలు గాంధీగారే చాలా వరకు తన మొదటి మతాన్ని మార్చుకున్నాడు. గుజరాతు షావుకార్లతోను, వాణిజ్య సంఘాలతోనూ స్నేహం పెరుగుతున్న కొద్దీ మహాత్ముని మనసు మారక తప్పదు. అదికాక బిర్లాలు, బజాజీలు అలమీద గాంధీ టోపి ధరించి కాంగ్రెసు మీద యెక్కడలేని భక్తి, విశ్వాసాలు కనపరుస్తున్నా పెట్టుబడి దారీ విధానం అక్కర్లేదంటే యెదుర్కొనే వారిలో మొట్టమొదటివారు. కాని సాధారణ జాతీయవాది మాత్రం 'పాశ్చాత్య నాగరికత పనికిరాదు. మనది ప్రత్యేక నాగరికత' అని మహాత్ముని కంటె మిన్నగా యెలుగెత్తి చాటుతున్నాడు. నిజంగా అతని కోర్కె ఫలిస్తే యేం జరుగుతుందో అత నికి తెలియదు. కాని చరిత్ర గమనం అతనికి తెలిసినా, తెలియకపోయినా, యిష్టంవున్నా, లేకపోయినా ముందుకు సాగుతూనేవుంది.

ప్రస్తుత సాంఘిక పరిస్థితులను పనికిరావంటూ పాశ్చాత్య నాగరితను దుమ్మెత్తిపట్టటంలో అర్థంలేదు ఇదే నేడు మనదేశంలోని జాతీయవాది చేసే పని పాశ్చాత్య నాగరికత కనుకూలమైన సాంఘిక, రాజకీయ హక్కులు కావాలని ప్రచారం చేస్తాడు. కాని 'పాశ్చాత్య నాగరికత' అనే పేరు మాత్రం అతని చెవులకు వినపడకూడదు. ఐరోపా, అమెరికా దేశాల్లో మాదిరిగా స్త్రీలకు హక్కులు, స్వాతంత్ర్యం కావాలి. కాని భారతనారీ మణి వారిలాగా తన ఆదర్శాన్ని (?) మరచిపోకూడదు. వర్ణవ్యవస్థ, కుల విభేదాలు పోవాలి కాని పాశ్చాత్య దేశాల మాదిరిగా వర్ణసంక్రమం (?) జరగకూడదు పారిశ్రామిక యుగం, పెట్టుబడిదారీ విధానం కావాలి. కాని ఆతత్వం (భౌతికవాదం) పనికిరాదు. సంఘంలో మూఢాచారాలు, మత వ్యామోహం పోవాలి. కాని విజ్ఞానం (సైన్సు) పనికిరాదు. యీ విధంగా మన సంఘంలో లోట్లువున్నవని వొప్పుకుంటూ సరియైన మార్గం చూపించలేక, జాతీయవాదులు చిలక పలుకులు పలుకుతూ ఉంటారు. పాశ్చాత్య నాగరికతను పూర్తిగా పనికిరాదని కాని, లేక అదే విధంగా మనంకూడ నూతన వ్యవస్థను నిర్మించాలని కాని చెప్పే తాహతు వారిలో లేదు.

వారి సిద్ధాంతాలప్రకారం చూస్తే వారు కోరేది కేవలం రాజీమార్గం-సంఘసంస్కరణ ఆసంస్కరణలు ప్రాచీన భారతదేశ ప్రత్యేక సంస్కృతి నాధారం చేసుకుని జరగాలి. అంటే శంఖంలో ఉదకం తీర్థం అయినట్లు ఆమార్పులను దేశ్యాధారంగా తీసుకున్నా ముందు మన ప్రాచీన సంస్కృతి ద్వారా ప్రాయశ్చిత్తం జరిగితే స్వీకరించవచ్చునని వీరివాదన. వీరు యేం మాట్లాడుతున్నారో వీరికి తెలియదు యిది వీరు బుర్రలు బద్దలు చేసుకొని తపస్సుచేసి-చేసి కనిపెట్టిన సంజీవి అని వీరి అభిప్రాయం కాని మానవుని విభిన్న దశల్లోని విభిన్న వ్యవస్థలను ఒక కాడిక్రిందకు చేర్చి సాక్షిగా బండి లాగించటం అసంభవమని వారికి తెలియదు.

పాశ్చాత్య నాగరికత (పెట్టుబడిదారీవిధానం) లో లోట్లువున్న మాట నిజం. ఆలోట్లు లేకుండా వుండాలంటే ఆనాగరికతలోని మంచి గుణాలు తీసుకొని అంతకంటె వున్నతమైన సాంఘిక వ్యవస్తను నిర్మించవలసివుంటుంది. కాని జాతీయవాదులు చెప్పేది దీనికి విరుద్ధంగావుంది. పాశ్చాత్య నాగరికతలోని 'మంచిగుణాలను' ప్రాచీన భారత సంస్కృతికి సహాయభూతంగా స్వీకరించాలని వారి వాదన.

ఇక్కడ 'మంచి గుణాలు' అనే పదాన్ని మానవ అభివృద్ధి లేక మానవాభివృద్ధికి అనుకూల మైనవి అని అర్థంచేసుకుంటే పాశ్చాత్య నాగరికతలోని 'మంచిగుణాలను' రెండుగా విభజించవలసివుంటుంది ఒకటి— నిర్మూలనం. పెట్టుబడిదారీ విధానంవల్ల అంతకు ముందువున్న జమీందారీ సాంఘిక వ్యవస్త, ఆచార, వ్యవహారాలు, మత సాంప్రదాయాలు నిర్మూలింపబడ్డై. దీనివల్ల సంఘానికి శ్రేయస్సు కలుగుతుంది. ఇక రెండోది నిర్మాణం అంటే పెట్టుబడిదారీ విధానం వల్ల పారిశ్రామికాభివృద్ధి జరిగి సంఘం యింకా ముందుదశకు చేరటానికి అవకాశం లభిస్తుంది. కాబట్టి మనం ప్రాచీన సంస్కృతి కావాలంటున్నామంటే పాశ్చాత్య నాగరికత లోని మొదటి 'మంచిగుణాన్ని' విసర్జిస్తున్నాం. ఇది పునాది లేకుండా భవనం నిర్మించటం అవుతుంది.

కాబట్టి పెట్టుబడిదారీ విధానంలోని యీ ప్రథమ దశ ఆవశ్యకతను గుర్తించలేనివారు రెండో దశను కూడా సంఘాభివృద్ధికి సరిగ్గా వినియోగించుకోలేరు. దీనివల్ల సంఘం యింకా ముందుకు పోయే అవకాశాలు లభి

స్తవి. కాని వెనకటి దశతో (ప్రాచీన సంస్కృతి) దీన్ని జోడిస్తే సంఘం తిరుగుముఖం పట్టుతుంది కాని ముందు చూపువుండదు.

కాగా జాతీయవాదులు పెట్టుబడిదారీ విధానంలో వున్న చెడ్డ గుణాల్ని అంతం అయ్యే పరిస్థితుల్లో నిలబడటానికి చేసే యత్నాన్ని, అభివృద్ధి నిరోధక తత్వాన్ని గూర్చి యేమీ ఆలోచించరు. అలాంటి పరిస్థితుల్లో వారు అసలు పెట్టుబడిదారీ విధానమే పనికిరాదని అంటారు. కాని ఆ విధానం వల్ల అభివృద్ధి చెందిన విజ్ఞానం ద్వారా సంఘాన్ని ఆ ప్రమాదం నుంచి తప్పించి యింకా ముందుకు తీసుకొని వెళ్ళాలనే అభిప్రాయం వారికి వుండదు.

"పెట్టుబడిదారీ విధానంలో ప్రధానమైన లోటు—ఆ దశలో మానవుడు మానసికంగా అభివృద్ధి చెందటానికి అవకాశాలు లభించినా, ఆవిధానం మానవుని అభివృద్ధిని స్తంభింప చేయుటానికి ప్రయత్నిస్తుంది. దీనికి మతం (నూతన స్వరూపంలో) వొక సాధనంగా వినియోగించబడుతుంది విజ్ఞానం అతని అందుబాటులో లేకుండా చేయబడుతుంది. యిదేవిజ్ఞానాన్ని (భౌతిక వాదాన్ని) యిచ్చటి జాతీయవాది పాశ్చాత్య నాగరికతలోని ప్రధాన దుర్గుణం అని చూపెస్తున్నాడు."

అసలు విషయమేమంటే పాశ్చాత్యదేశాల్లో అధికారంలోవున్న వర్గం యీ భౌతికవాదాన్ని యిక్కడి జాతీయవాది కంటె మిను మిక్కిలిగా ద్వేషిస్తూవుంటుంది ఆ వాదం ఆ వర్గానికి గిట్టదు. కారణం? మానవ సమాజం అభివృద్ధి చెందటానికి అది వొక బలవత్తరమైన శక్తి ప్రాచీన కాలంలో తత్వశాస్త్రజ్ఞుల మనస్సులో అస్పష్టంగా వున్న యీ ఆలోచనా శక్తి (యిందులో హిందూదేశం కూడ ప్రధాన పాత్ర వహించింది) రాను, రాను పెట్టుబడిదారీ విధానంలో ఒక స్పష్టమైన సిద్ధాంతాన్ని యేర్పాటు చేసుకొంది. కాబట్టి స్వేచ్ఛా, స్వాతంత్ర్యవాదులందరు పాశ్చాత్య నాగరికతను యీ దృష్టితో విప్లవ దశగా అంగీకరించవలసివుంటుంది. అలా కాకుండా ఆ దశను గతించిన ప్రాచీన సంస్కృతితో పోల్చి విమర్శించటం సంకుచిత దృష్టిని, అభివృద్ధి నిరోధక తత్వాన్ని ప్రకటించటం అవుతుంది. నేడు జాతీయవాదులు యిదే పనిచేస్తున్నారు.

"పాశ్చాత్య నాగరికతకు భౌతికవాదం—భారతదేశ నాగరికతకు ఆధ్యాత్మికవాదం పునాదు లని" సాధారణంగా ప్రతి జాతీయవాది మాట్లాడటం అలవాటైపోయింది. యీవిధంగా మాట్లాడటం తప్ప వీటిలో సత్యాసత్యాలను లోతుకు దిగి రుజువుచేయగల పట్టుదలగానీ, సమర్థతగానీ వారిలో లేదు. యీవాదం కేవలం వొక మూఢవిశ్వాసంతో అంగీకరించబడుతూ వస్తుంది. కాని భారతదేశ ప్రత్యేకత అనుకున్న 'ఆధ్యాత్మికవాదం' కేవలం భారతదేశానికే సంబంధించి వుండలేదు. యిది మతానికి సంబంధించిన సిద్ధాంతం. యీదశను తక్కిన మానవసంఘంకూడ పరిణామదశలో యెప్పుడో వొకప్పుడు అనుభవించియే తీరింది. కాగా యీ'ప్రత్యేక సిద్ధాంతం' శాశ్వతమైనది కాదని కూడ రుజువుచేయవచ్చు. సాంఘిక పరిస్థితులనుబట్టి భావపరిణామం కలుగుతూ వుంటుంది. కాబట్టి ప్రత్యేక భావాలను, సిద్ధాంతాలను చూపి యివి శాశ్వతంగా నిలిచిపోతై అని చెప్పటం మూర్ఖ్యం.

నేడు మనంకోరే 'ప్రాచీన భారత సంస్కృతి' వొకప్పుడు పాశ్చాత్యదేశాల్లోకూడ (మానవుడు అజ్ఞానదశలో వున్నప్పుడు) ప్రచారంలో వుంది. రాను, రాను ఆసమాజాలు అభివృద్ధి చెందుతున్నకొద్దీ, పరిస్థితులను మూఢవిశ్వాసంతో కాక హేతువాదంతో, విజ్ఞానంతో అర్థంచేసుకొంటూ పాతసంస్కృతి పనికిరాదని వదలిపెట్టి నూతన సంస్కృతిని సృష్టించుకున్నవి. కాబట్టి సంఘంలో కలిగిన మార్పులు సిద్ధాంతాల్లో తప్పక ప్రతిబింబిస్తవి. యిక్కడ యింకా పాత సిద్ధాంతాలే ఆచరణలో వున్నవంటే మన సంఘంలో అనాదినుంచీ నేటివరకు పరిస్థితుల్లో మార్పులు లేకపోటమే దానికి కారణం. సంఘం మారినట్లయితే మనంకూడా నేడు అదేధోరణిలో అభిప్రాయాలు కల్గివుండేవాళ్ళం.

గత మూడు, నాలుగు వందల సంవత్సరాల క్రితంవరకు మనం నేడుయే అభిప్రాయాల్లో వున్నామో అదే గృష్టిలో పాశ్చాత్య దేశాలు కూడా వున్నవి. యీ మధ్యకాలంలో ఆసంఘాల్లో కలిగిన మార్పులే నేడుమనకూ వారికీ సిద్ధాంతాల్లో అంత వ్యత్యాసాన్ని కనబరుస్తూవున్నవి. ఇండియాలో కూడా అలాంటి పరిస్థితులు కల్పించితే యీవ్యత్యాసం లేకుండాపోతుంది.

కాని జాతీయవాది దీనికి వొప్పుకోడు. కాగా అది జరక్కుండా చేయటమే మనకర్తవ్యం అని గొంతెత్తి అరుస్తూ ప్రత్యామ్నాయంగా

ప్రాచీన భారత సంస్కృతిని గూర్చి పొగడుతూ దాన్ని పైకెత్తటానికి ప్రయత్నిస్తాడు. ఇలా ప్రయత్నించటానికి కారణం యేంటి? సహజంగా అతనిలో ప్రాచీన సంస్కారం జీర్ణించుకుపోయింది. నూతన పరిస్థితులవల్ల కలిగే నూతన భావపరంపర అతనిలో లోపించింది. లేకపోతే నూతన పరిస్థితులను అడ్డటానికి యేమరీత యీాదమ. ఒకవేళ భారతదేశంలోనే యీ 'ప్రత్యేకత'వుందని అతడు వాదించవచ్చు. కాని చరిత్ర గమనం నేడు భారతదేశంలో వ్యాపించిన అత్యాచారాలు, బానిసత్వం, దారిద్ర్యం, అజ్ఞానం మొదలైనవి సహేతుకంగా పరిశీలిస్తే యీ 'ప్రత్యేకత'కు ప్రత్యేకత లేదనే తేలుతుంది మనం తక్కిన ప్రపంచంతో పాటు ముందుకు పోలేక పోవటం మనలోటు. యీ లోటుకు ప్రత్యేకత కల్పించి ప్రాచీన సంస్కృతి అని ఆత్మవంచన చేసుకుంటున్నాము ద్రాక్షపండ్లు అందని నక్క వాటిని పులుపు అనే నెపంతో దూరంగా వెళ్ళుతూ వాటివంక నోరకలేదనే చింతతో ప్రక్క చూపు చూస్తూనే వెళ్ళుతుంది. కాని అలాంటి ఆత్మవంచన సంఘం మీద రుద్దటానికి ప్రయత్నిస్తే అంతకంటె విద్రోహకరమైన చర్య మంొకటి వుండదు.

'భారతదేశానికి పాశ్చాత్య నాగరకత పనికిరాదనే' కేకలోనే రెండు విషయాలు అంతర్గతంగా యిమిడి వున్నవి. వొకటి—మనం కూడా సంఘంలో అవే పరిస్థితులు కల్పించుకుంటే భావాల్లో కూడా పాశ్చాత్య దేశాలతో యేకీభవిస్తామనేది. దీనివల్ల భారతదేశానికి తక్కిన ప్రపంచానికి భిన్నంగా 'ప్రత్యేకత' లేదని, మనం అలాంటి పరిస్థితులు కల్పించుకోలేక పోబట్టే యీ 'ప్రత్యేకత' యేర్పడిందని తేలిపోతుంది. ఇక రెండోది— మనం కోరే రాజకీయ స్వాతంత్ర్యం, అందుకు జరిపే వుద్యమం కేవలం మిథ్య అని తేలుతుంది నిజంగా మనం రాజకీయ స్వాతంత్ర్యం కోరుతున్నామంటే మనం కూడా తక్కిన మానవ ప్రపంచం లాగా సుఖంగా జీవించటానికే. ఇది జరగనప్పుడు మన పోరాటం సంఘాన్ని మోసపుచ్చి, నాశనం చేయటం తప్ప మరొకటి జరగదు.

రాజకీయ స్వాతంత్ర్య ఫలితంగా మనకూ—పాశ్చాత్య దేశాలకూ యేర్పడిన వ్యత్యాసాన్ని పూడ్చుకోటానికి అవకాశం లభిస్తుంది. కాని జాతీయవాదం దీన్ని అంగీకరించటంలేదు. మనలో ప్రత్యేకమైన ఆధ్యాత్మిక

సంపత్తు వుందని నమ్మినప్పుడు జీవితంకోసం మనంచేసే యితర ప్రయత్నాల వల్ల ఆసంపత్తు నశిస్తుందని భయపడనక్కరలేదు. నిజంగా వొకవేళ అలాంటి భయంవుంటే అది నిజమైన 'ప్రత్యేక ఆధ్యాత్మిక సంపత్తు' అని పించుకోదు. కాగా నీవుచేసే రాజకీయపోరాటం నీ ఆదర్శానికే భిన్నం. కేవలం 'ఆధ్యాత్మిక సంపత్తు' కావాలనుకుంటే యీ రాజకీయపోరాటం అనవసరం. సంఘాన్ని రాజకీయంగా, ఆర్థికంగా యిప్పుడున్నట్లే హీనస్థితి లోనే అట్టిపెట్టు, అప్పుడు 'ఆధ్యాత్మిక సంపత్తు' బాగా విరాజిల్లుతుంది. అలాకాకుండా రెండూ జరగాలంటే సంఘం యీ వొరపిడికి నాశనం కావ టం తప్ప నీ ఆధ్యాత్మిక సంపత్తు నిలవదు, నీ పోరాటం ఫలించదు.

కాబట్టి కేవలం వెనకచూపుతో పురాణాలమీద ఆధారపడినందువల్ల ప్రయోజనం లేకపోగా ప్రమాదంకూడావుంది పాశ్చాత్యదేశాల్లో కూడా భౌతిక వాదం పనికిరాదు, ఆధ్యాత్మికవాదం కావాలని కోరేవారు యిప్పటి కూడా చాలామంది వున్నారు. మనకు పురాణాల్లో జనకమహారాజు లుంటే వారికి నేడు రాక్ ఫెల్లరు, కార్నీజి లాంటి వారన్నారు. ధనం మంచి కార్యాలకోసం వినియోగిస్తే అది మంచిదేననే సిద్ధాంతాన్ని వొప్పు కుంటే వారుకూడా క్రైస్తవ మతప్రచారంకోసం, ప్రపంచ శాంతికోసం అనేకకోట్లు వెచ్చించారు.యీవిధంగా లెక్కతీస్తేఅమెరికాలోనూపాశ్చాత్య దేశాల్లోనూ కోటీశ్వర్లందరూ యిదే విధంగా దాన, ధర్మాలు చేస్తున్నారు. ఆవ్యక్తులే మనం నిరసించే 'పాశ్చాత్య భౌతికవాదాన్ని' వారకూడా నిర సిస్తున్నారు. కాబట్టి యిది ప్రత్యేకంగా పాశ్చాత్య నాగరికతకు సంబంధిం చినదని అనుకోటం పొరపాటు

మనం మానవసమాజంలోని దైనందినపరిస్థితులను నిష్పాక్షికంగా ఆలో చిస్తే ప్రపంచంలో అన్నిజాతుల లోనూ ఒకవిధమైన సమానత్వం కనపడు తుంది విభిన్న దృక్పథాలు ఒక్కొక్కదశకు చెందినా ఆ సమానత్వం కనబడు తూనేవుంటుంది .తక్కిన మానవసంఘం జీవించటానికి కావలసిన పరిస్థితులే మనకూడాకావలసివుంటవి. ఇది నేటిసంగతికాదు. అనాదినుంచి యిదిజరుగు తూనే వస్తుంది. సంఘ పరిస్థితులను బట్టి సంఘ సంస్కారం పెరుగుతూ వుంటుంది. కాని యెక్కడో వూహా ప్రపంచంలో నిర్మించే ఆదర్శ శిఖరాలు సంఘానికి కొలతబద్ద కాజాలవు. ఆ వూహా ప్రపంచాన్ని నిర్మించే 'విజ్ఞాన

వంతులు' కూడా ఆచరణలో క్రిందకు దిగివచ్చి సాంఘిక పరిస్థితుల కను కూలంగా నడవవలసిందే. భారతదేశంలో విద్యాధికుల్లో హెచ్చుమంది తమ జాతి 'ఆర్యజాతి' అని తక్కిన జాతుల కంటె గొప్పజాతి అని తమకు త్యాగం, ధర్మం, సేవ, పవిత్రత మొదలైన ప్రత్యేక గుణాలున్నవని గాఢంగా విశ్వసిస్తున్నారు. భౌతికవాదం అనే 'పెనుభూతం' నుంచి ప్రపంచాన్ని రక్షించే బాధ్యత భారతదేశం మీద వుందని వారి నమ్మిక ఇది వినటానికి చాల ఆదర్శప్రాయంగా వుత్కృష్టమైన ఆశయంగా వుంటుంది కాని యథార్థంగా ఆలోచిస్తే దాని విలువ యెంత వుంటుంది? నిజంగా వీరు మానవ సంఘాన్ని వున్నత దశకు తీసుకొనిపెళ్ళగలిగితే దాన్ని యెవరూ కాదనరు. పాశ్చాత్య భౌతికవాదులు కూడా మానవసంఘాన్ని వున్నత పథానికి తీసుకొని వెళ్ళటానికే ప్రయత్నిస్తున్నారు.

మానవుడు జీవించటానికి 'భౌతిక అవసరాలు' ముఖ్యం అనుకున్నప్పుడు పాశ్చాత్యులను కాని, పాశ్చాత్య నాగరికతను కాని నిందించ నక్కర్లేదు. ప్రతి జీవికి ముందు బ్రతకటం తరువాత సంతానాన్నుత్పత్తి చేయటం తప్పనిసరి అని జ్ఞానం వున్న ప్రతి వ్యక్తి అంగీకరించక తప్పదు. మానవుడు తక్కిన జీవుల కంటె యీ ధర్మాన్ని తేలిగ్గా నెరవేర్చటానికి కావలసిన అవకాశాలకోసం ప్రయత్నిస్తాడు. యీ తేడాయే రాను, రాను మానవుని తక్కిన జంతువులనుంచి వేరు చేస్తుంది అంటే సుఖంకోసం ప్రయత్నించటం మానవుని సహజ కాంక్ష దీన్ని కాదనేవాడు కొండల్లో నివసించే మానవుడే నిజమైన ఆదర్శప్రాయుడని వొప్పుకోవలసివస్తుంది.

ఆధ్యాత్మిక వాదులు దీన్ని అంగీకరించక పోవచ్చు కాని వారి వాదన యిందుకే దారితీస్తుంది. మానవ సమాజం ఫలానా దశతో ఆగి పోవాలని యెవరూ నిర్ణయించలేరు. మానవుడు జీవించటం అవసరం అని ఒకసారి అంగీకరిస్తే అందుకు కావలసిన పరికరాలను ఫలానా అని నిర్ణయించటం కేవలం నిరంకుశత్వం అవుతుంది. ఆధ్యాత్మిక వాదులు వారి వాదనకోసం యెంత ప్రాకులాడినా వారికి ఆదర్శ ప్రాయమైన ధర్మ గ్రంథాల్లోనే మానవులు జీవించటం, సంతానం పొందటం. ప్రాపంచిక సుఖాన్ని అనుభవించటం (ఇదే భౌతికవాదం) ఆర్య సంస్కృతికి విరుద్ధం కాదని చెప్పబడి వుంది. వేదాల ప్రకారం మానవ జీవితాదర్శం ధర్మ అర్థ, కామ, మోక్షం

అనినాలుగుగా విభజించ బడ్డది. దీన్నిబట్టి కామేచ్ఛ, ప్రాపంచిక సౌఖ్యం జీవితావసరాలని ధర్మ గ్రంథాలే ఘోషిస్తున్నట్లు తేలిపోతుంది. 'కామం' అంటే సర్వసాధారణంగా ప్రాపంచిక సౌఖ్యం అని ప్రతి భాష్యకారుని చేత అంగీకరించ బడ్డది.

మహాభారతంలో 'ధర్మాన్ని' గూర్చి బాగా వివరించబడ్డది. మహాభారతం చివరి భాగంలో "అర్థం, కామం—ధర్మంద్వారా పొందబడతవని" స్పష్టంగా చెప్పబడివుంది ఇది వ్యాసమహాముని నోటినుంచే వెలువడిన వాక్యం. వ్యాసమహర్షి ప్రాచీన భారతసంస్కృతికి ఆదర్శప్రాయుడని వొప్పుకోక తప్పదు ఇక్కడ దీని భావం—'మతానికి కట్టుబడి వుండు. ప్రాపంచిక సౌఖ్యాన్ని పొందగలుగుతావు' అని. కాబట్టి ప్రాచీన భారత ఆధ్యాత్మికవాదంలోనే భౌతికవాదం వుందని తేలుతుంది ఇంతకంటెయింకాఆశ్చర్యకరమైనవిషయమేమంటే యీమహర్షి "కాని నామాట యెవరూ వింటంలేదని" పైవాక్యానికి జోడించాడు అంటే ఆకాలంలోనే అర్థం, కామం మతానికి (ధర్మం) కట్టుబడి వుండలేదని తేలుతుంది. అందుకనే వ్యాసుడు 'నామాట యెవరూ వింటంలేదని' వాపోయి వుంటాడు.

పాశ్చాత్య నాగరికతను గూర్చి సాధారణంగా విమర్శించేటప్పుడు కామేచ్ఛనుగూర్చి దుర్గుణంగా యెంచబడుతూ వుంటుంది. దీనికికూడా తిరిగి ప్రాచీన గ్రంథాలను తిరగవేయండి దీన్నిగూర్చి భారతగ్రంథాల్లో వున్నంత విపరీతంగా మరేదేశ గ్రంథాల్లోకూడ కనబడదు చివరకు బ్రహ్మసూత్రాల్లోకూడా "బిడ్డ పుట్టినప్పుడే కామ వాంఛకూడా అతనిలో సహజంగా వుంటుంది యుక్తవయస్సు వచ్చేటప్పటికి యీవాంఛ కూడా పెరుగుతుంది" అని చెప్పబడ్డది. 'కామం' సహజం కాబట్టి దాన్ని అనుభవించటానికి అధికారంవుంది. 'ధర్మం' దాన్ని వొప్పుకుంటుంది. భగవద్గీత ప్రకారం కూడా భగవంతుడు అన్ని ప్రాణుల్లోకూడ 'సరియైన' కోర్కె (కామం) గా పనిచేస్తూవుంటాడని చెప్పబడివుంది. యిక్కడ 'సరియైన' అంటే 'ధర్మా'నికి కట్టుబడివుంటం యీవిధంగా ప్రాచీన గ్రంథాలన్నింటిలోనూ ధర్మం (మతం) అనే పేరుతో భౌతిక వాసనలన్నీ అంగీకరించబడ్డవి అయినప్పటికి ఆకాలంలోకూడా ధర్మానికి సంఘం కట్టుబడకుండా తక్కిన వాటికోసం యెక్కువగా ప్రయత్నించినట్లు కనబడుతుంది.

మహాభారతం చివరిలో వ్యాసుడే 'ధర్మం' నిరసించబడుతుందని చెప్పుతాడు. ఇక్కడ 'ధర్మం' అంటే అప్పటి సంఘాన్ని అదుపు-ఆజ్ఞల్లో అట్టిపెట్టటానికి భగవంతునిపేరిట సృష్టించిన, చట్టబద్ధమైన వ్యవస్థ భౌతిక అవసరాలను కామేచ్ఛను, ప్రాపంచిక సౌఖ్యాన్ని పొందవచ్చు కాని చట్టం ఆదేశించినట్లు వీటినిపొందాలి. యిదే వారిధర్మం. చట్టప్రకారం సంఘం నడవకపోవటంచేత వ్యాసుడు 'ధర్మం' నాలుగు పాదాల నడవటం లేదని చెప్పవలసివచ్చింది

పాశ్చాత్య సంఘంకూడా దైనందిన వ్యవహారాల్లో యింతకంటె విపరీతావస్థలోలేదు. దీన్ని కాదని వాదించటం మూర్ఖ్యం తప్ప మరొకటి వుండదు. 'అర్థం, కామం' కోసం జరిపిన దోపిడీ విధానాలుకాని, దారుణ కృత్యాలు కాని భారతదేశంలో జరిగినంతగా పాశ్చాత్యదేశాల్లో జరగలేదు. అక్కడి సంఘంకూడా మనలాగానే ధర్మానికి కట్టుబడి 'అర్థం, కామం' వుండాలని ప్రచారం చేస్తుంది. మనకు పురాణాలు, ధర్మశాస్త్రాలు, న్యాయ శాస్త్రాలు ఆదర్శం అయితే వారిక వారి క్రైస్తవమతం చూపించిన దరవిధా నాలు ప్రమాణం. అంతే తేడా.

ఇక 'మోక్షం' సంగతి ఆలోచిస్తే మనం మన మతాన్ని యేవిధంగా నమ్మివున్నామో వారు వారి మతమైన క్రైస్తవ మతాన్ని నమ్ముకొని వున్నారు. మనం మనసార మతాన్ని విశ్వసిస్తున్నామని, వారు విశ్వసించటం లేదని చెప్పటం పొరపాటు. మామూలుగా యీ ప్రచారం మనలో బాగా వ్యాపించి పోయింది క్రైస్తవ మతంలో కూడా 'మోక్షం' ఒక ప్రధాన సూత్రంగా యెంచబడుతుంది. కాగా మన కంటె విద్యావిధానంలో ఘనులు అయిన పాశ్చాత్యవాసులు యీ విషయంలో యింకా మనకంటె మిన్నగా ప్రయత్నించే అవకాశాలున్నవి. ఇంకా మనల్లోనే యీ ప్రయత్నం తగ్గటా నికి అవకాశంవుంది. జీవితాన్ని సుఖవంతం చేసుకోలేక నానా యాతనలు పడుతూ అజ్ఞానాంధకారంలో వున్న మనల్ని మోక్షసాధన కంటె కామం మనకు తెలియకుండానే హెచ్చుగా ఆవరించివుంది.

కాబట్టి పైన సూచించిన ప్రకారం మనం సంఘాన్ని పునఃపరిశీలిస్తే సంఘం హీనస్థితిలో నిలిచి పోటమే కాకుండా మనం కోరే ఆధ్యాత్మిక వాదం కూడా యెంత హీనస్థితిలో వుంటుందో తేటపడుతుంది. దాన్నే

జాతీయవాదులు భారతదేశానికే కాకుండా తక్కిన ప్రపంచానికి కూడా చాటాలని ప్రయత్నిస్తున్నారు.

వీరు మన ధర్మం (మతం) యింత హీనస్థితికి రావటానికి కారణం పాశ్చాత్య నాగరికతేనని, (భౌతికవాదం) మన సాంఘిక వ్యవస్థలోవున్న లోటుపాట్లు కావని మరొక విధంగా సమాధానం చెప్పటానికి ప్రయత్నిస్తారు. చరిత్రాత్మకంగా చూస్తే యిది కూడ అబద్ధం అని తేలుతుంది. ధర్మం నాలుగుపాదాలనడుస్తుందను కున్నప్పుడే బ్రాహ్మణవర్ణం కల్లు సారాయిలు త్రాగుతూ మాంసం భుజిస్తూవుండేదని, క్షత్రియవర్ణం వైభవోపేతంగా రాజ్యభోగాలు అనుభవిస్తూ వుండేదని మన ధర్మగ్రంథాలే చాటుతున్నవి. కాబట్టి ఆ కాలంలో కూడ 'ధర్మ, మోక్ష' సాధనల కంటె 'అర్థ కామములే' యెక్కువ వ్యాప్తిలోవున్నవని తేలుతుంది. ఒక వస్తువు పనికి రాదంటూ అనుభవించటం కంటె అనుభవించే వస్తువుని కావాలని కోరు కోటంలో తప్పులేదు, మహాభారతంలోని శాంతిపర్వంలో 'ధర్మ' సాధన గూర్చి చర్చించబడ్డది. ఇందులోనే బ్రాహ్మణవర్ణం ప్రాపంచికసౌఖ్యం కోసం యెంత మమకారం చూపిస్తుందో కనబడుతుంది.

యేకొద్దిమంది వాదన నాధారంగా తీసుకొని, అదిమొత్తం సంఘాభిప్రాయం అని చెప్పటానికి సాహసిస్తే యిందులో పాశ్చాత్య దేశాలే, ముఖ్యంగా అమెరికా మనకంటె చాలా ముందంజ వేసిందని చెప్పవచ్చును. వారు వారి మతప్రచారకుల ద్వారా వారిమతాన్ని యెంతో దూర, దూర దేశాలవరకు ప్రచారం చేస్తున్నారు. వారి ఆదర్శాలు చూస్తే మన ప్రాచీన ఆదర్శాలకు యేమాత్రం తీసిపోవు. భగవంతుడు, ఆత్మ, పరమాత్మ, ధర్మం మోక్షం మొదలైనవి హిందూ ధర్మ శాస్త్రాల ప్రకారమే సత్యబద్ధమని, వాటినిగూర్చి యితర మతస్థులు చెప్పినప్పుడు సత్యదూరములని అనుకోటం తెలివి తక్కువ తనాన్ని ప్రకటించుకోటం అవుతుంది అదేవిధంగా క్రైస్తవ మతం భౌతికవాదానికి సంబంధించినదని,కేవలం హిందూ మతమే ఆధ్యాత్మిక సంపత్తని అనుకోటం పొరపాటు. ఆధ్యాత్మిక సంపత్తు అనేది వొకటి వుంటే అది అన్నిచోట్ల, అన్నివేళల వొకే విధంగా వుంటుంది. ఒకచోట వొక పరిస్థితివల్ల దానిబలం తగ్గిపోయిందంటే తక్కిన చోట్లకూడా అదే

పరిస్థితులు యేర్పడితే దానిబలం తప్పని సరిగా తగ్గిపోతుందని రుజువు చేయవచ్చు.

'ప్రపంచాన్నంతటినీ జయించినా ఆత్మను జయించ లేనప్పుడు మానవుడు పొందేలాభంలేదు' ఇది సాధారణంగా క్రైస్తవమతంలో నమ్మకం వున్న ప్రతివ్యక్తీ చెప్పుతూనే వుంటాడు. మనం హిందూ ధర్మశాస్త్రాల ప్రకారం యేవి ఆదర్శ ప్రాయమని అనుకుంటున్నామో అవిఅన్నీ క్రైస్తవ మతంలో కూడా ఆదర్శ ప్రాయంగా యెంచబడుతూ వున్నవి. క్రైస్తవమత సంస్థాపకుడైన క్రీస్తు 'భగవంతుని రాజ్యం నీలోనేవుందని' బోధించాడు అంటే ఆత్మపరిశోధన వలననే మోక్షం పొందటానికి అవకాశం వుంది. హిందువులు బోధించే "ఆత్మ దర్శనానికీ" దీనికీ తేడాలేదు. ఇదేవిధంగా తరువాత జన్మించిన క్రైస్తవ మతోద్ధారకుల యే వొక్కరిని గాఢ పరిశీలించినా వాటికీ హిందూ ధర్మ శాస్త్రాలకూ తేడా కనబడదు.

కాబట్టి పాశ్చాత్యదేశాల్లో వ్యాప్తిచెందిందనే దృష్టితో క్రైస్తవ మతాన్నిగాని, ఆమత ప్రచారకులనుగాని చిన్న చూపుతో చూడటం పొరపాటు. ఒకవిధంగా ఆలోచిస్తే మన స్వాములు సన్యాసులకంటె వారే మిన్న అని చెప్పవచ్చు. వారికి వారు నమ్మినదాంట్లో పూర్తి విశ్వాసం వుంటుంది. కాని మన స్వాములకు అంధ విశ్వాసం మెండు. కాబట్టి యెవరైనా తెలిసినా, తెలియకపోయినా యేదో ఒకధర్మగ్రంథంనుంచి శ్లోకాన్ని వల్లిస్తే వానిని చాలా గొప్పవానిగా, పూజ్యునిగా భావిస్తూ, అదే విధంగా క్రైస్తవ మతస్థుడు క్రైస్తు సిద్ధాంతాలను బోధిస్తూ వుంటే అతన్ని శంకించటంలో అర్థంవుండదు.

కొంతమంది పెట్టుబడిదారీ విధానాన్ని, భౌతిక వాదాన్ని ఒకటేనని చెప్పుతూ రెంటినీ నిరసించటం ప్రారంభించారు భౌతికవాదం పాశ్చాత్యం కాదని తేలిపోయింది. (యీవిషయం యింకా ముందువ్యాసాల్లో చర్చించబడుతుంది) పెట్టుబడిదారీ విధానం కేవలం వొక్క పాశ్చాత్య దేశాలకు సంబంధించినదికాదు. అది యే స్వర్గలోకంనుంచో, లేక నరకకూపం నుంచో బయటపడలేదు. చరిత్రలో కొన్నివందల సంవత్సరాలనుంచి సంఘంలో జరుగుతున్న మార్పులే దీనికి కారణం కొన్ని ప్రత్యేక కారణాలవల్ల పాశ్చాత్య ఖండాల్లో ఆ విధానం త్వరగా అభివృద్ధిచెందింది.

అంతే లేదా. 'పాశ్చాత్యవాసులు అనాగరికులుగా వున్నప్పుడు మనదేశం నాగరికతలో వుండి యితర దేశాలతో మనం వర్తకం జరుపుతూ వుండేవార మని' మన జాతీయవాదులు సగర్వంగా చెప్పతూవుంటారు. ఇందులో వారి భావన యెలావున్నా పాశ్చాత్య దేశాలకంటె భౌతికవాదంలో మనమే ముందంజ వేసామనే సంగతి దృఢపడుతుంది. కాగా వ్యాపారం అభివృద్ధి చెంది చివరకు యంత్రయుగం రావటమే పెట్టుబడిదారీ విధానం. కాబట్టి ప్రస్తుత పరిస్థితు లేవిధంగావున్నా, పాశ్చాత్య ఖండాల్లో కంటె యెంతో ముందుగానే మనదేశంలో ఒకప్పుడు పెట్టుబడిదారీ విధానానికి కావలసిన పరిస్థితులు యేర్పడినవని తెలుతుంది. కనుక దీన్నిబట్టి తేలిన విష యాలేమంటే వొకటి—మనం నిరసించే యీ పెట్టుబడిదారీ విధానం ప్రత్యే కంగా పాశ్చాత్య దేశాలకు సంబంధించినది కాదని, రెండోది వెనకటి కాలంలో ఆ దేశాలకంటె ముందుగానే ఇక్కడ ఒకప్పుడు బాగా వర్తకం పెరిగి పెట్టుబడిదారీ విధానానికి పునాదు లేర్పడ్డవని తెలుస్తుంది.

ఇలా సహేతుకంగా రుజువు చేస్తే దీన్ని కాదనలేక చివరకు జాతీయ వాది పెట్టుబడిదారీ విధానాన్ని—పెట్టుబడి—శ్రమకు రాజీ కుదిర్చి దానికి ఆధ్యాత్మికతత్వం బోధించి నూతన స్వరూపం యివ్వాలని సమాధానం చెప్పతాడు ఇది కేవలం పెట్టుబడిదారీ విధానంలోని ప్రధాన సూత్రాలు కూడా అర్థంచేసుకోలేని వ్యక్తి చెప్పవలసిన సమాధానం. శ్రమను దోపిడి చేయటం పెట్టుబడిదారీ విధానంలో ప్రధానసూత్రం. ఇది 'తృష్ణ' అని 'పిపాస' అని నిరసించ బడ్డది. ఇక్కడ గాంధీగారు దాన్ని నిరసించటం ప్రారంభించక ముందే చాలాకాలం క్రిందట పాశ్చాత్య దేశాల్లోనే దీన్ని గురించి వ్యతిరేక సిద్ధాంతం బయలుదేరింది. కాబట్టి పెట్టుబడిదారీ విధానం పెరుగుతున్న రోజుల్లోని పాశ్చాత్య చరిత్ర గమనించకుండా పాశ్చాత్య నాగరికతలోని లోట్లు మేమే కనుక్కున్నామని నిరసించట్టం పనికిరాదు. ఇంగ్లండు చరిత్ర తిరగవేస్తే పెట్టుబడిదారీ విధానానికి ప్రధాన దేశం అయిన అక్కడే ఆ విధానంలోవున్న లోట్లు తొలగించుటానికి అప్పుడప్పుడూ కొన్ని అశాస్త్రీయమైన సిద్ధాంతాలు చూపబడుతూ వచ్చినవని తెలుస్తుంది.

క్రిస్టియన్ సోషలిజానికి సంస్థాపకుడైన చార్లెస్ కింగ్స్లే నేడు గాంధీ చెప్పే సిద్ధాంతాలే ఇంగ్లండులో ఒకప్పుడు బోధించాడు. పెట్టుబడి

దాతుల దోపిడీ విధానానికి సరియై అసంతృప్తితో, దారిద్ర్యంతో అప్పు డప్పుడూ తిరుగుబాటు చేస్తున్న శ్రామికవర్గానికి కింగ్స్లే 'స్వాతంత్ర్యం పొందటానికి అర్హులు కండి. ఇందుకు భగవంతుడే వున్నాడు ..సోదర మానవులను ప్రేమించండి భగవంతుని ప్రార్థించండి,' అని వుపదేశిస్తూ వుండేవాడు. బ్రిటిషు సామ్రాజ్యనిర్మాతల్లో వొకరైన డిజ్రేలీ కూడా యీసిద్ధాంతాన్ని అంగీకరించి స్వేచ్ఛావ్యాపారాన్ని, సాంఘిక దురా చారంగా తనపుస్తకంలో చూపించి శ్రామికులను దయా—దాక్షిణ్యాలతో చూడాలని వ్రాసాడు. నేడు గాంధీ చెప్పే ఆధ్యాత్మికవాదం కూడా యింతకంటె ప్రత్యేకించి యేమీ చెప్పటం లేదు. ఇది నిజంగా ఆధ్యాత్మిక సంపత్తుకు సంబంధించిన సిద్ధాంతం కూడాకాదు. విప్లవం రాకుండా చేయుటమే యీసిద్ధాంత ఫలితం. పాశ్చాత్య దేశాల్లో అధికారంలో వున్న వర్గం తమఅధికారం సుస్థిరం చేసుకోటానికి యేసిద్ధాంతాల్ని ప్రచారం చేస్తున్నదో అదే సిద్ధాంతాల్ని యిక్కడ గాంధీ బోధిస్తున్నాడు. గాంధీ బోధించే అహింసా వాదంలో సంఘంలో విప్లవానికి ఆస్కారమే లేదు. పెట్టుబడిదారులు, శ్రామికులు రాజీమార్గాలు ఆలోచించాలని, తిరుగుబాటు హింసావాదాన్ని ప్రకోపిస్తుందని నిరసించినంత కాలం విప్లవం జరగటానికే ఆస్కారం వుండదు. కాగా ఆవర్గం అధికారంలోనే వుండిపోతుంది. కాబట్టి గాంధీ సిద్ధాంతాలప్రకారం గాంధీగారు పెట్టుబడిదారీ వర్గానికి శత్రువుకంటె మిత్రుడేనని చెప్పవలసివస్తుంది.

పెట్టుబడిదారీ విధానాన్ని గాంధీగారు తన ఆధ్యాత్మికవాదంతో మార్చివేసి నూతన స్వరూపం యిస్తాడని వివేచనాశక్తిగల యేవ్యక్తి నమ్మ టానికి వీల్లేదు. ఇందులో ఆధ్యాత్మికవాద ప్రత్యేకత యేమీవుండదు. మానవుడు ముందు దరి దాపు కనపడక నిస్సహాయస్థితిలో వున్నప్పుడు అత నికి ఆత్మ సంతృప్తికోసం యిది వూతకర్రగా పనికివస్తుంది. కాగా శత్రువు నకు యిదే రక్షణగాకూడా పనికివస్తుంది.

యీ నిస్సహాయస్థితినుంచి మానవుని, సంఘాన్ని రక్షించాలంటే మనకు కావలసింది ఆధ్యాత్మికవాదంకాదు, భౌతికవాదం. భౌతికవాదం అంటే కేవలం తింటం, సుఖంగా జీవించటం కాదు. భౌతికవాదం అంటే పెట్టుబడిదారీ విధానం కాని, పాశ్చాత్యనాగరికతగాని కాదు. మానవ

సంఘాన్ని అభివృద్ధిదశకు, వున్నత పథానికి తీసుకొని వెళ్ళగల సిద్ధాంతమే భౌతికవాదం.

మన దేశంలో యిది ప్రచారం కానంతవరకు సంఘాన్ని నూతన మార్గంలో త్రిప్పలేము. విద్యాధికులు, విజ్ఞానవంతులు కేవలం మూఢంగా మతదృష్టితో పరిస్థితులను ఆలోచించుచున్నంతకాలం సంఘానికి యీ దుస్థితి తప్పదు సంఘంలో కొన్నిలోట్లు వున్నట్లు గ్రహించినప్పుడు ఆలోటుపాట్లకు కారణం వెదకి ఆకారణం తొలగించే ధైర్య సాహసాలు, శక్తి-సామర్థ్యాలు కలిగివుండాలి. అప్పుడే సంఘానికి మోక్షంకలుగుతుంది.

---

# ఆధ్యాత్మిక వాదం

మానవుడు అజ్ఞాన దశలో వున్నప్పుడు చుట్టూవున్న ప్రకృతిని, వాతావరణాన్ని చూచి అర్థం చేసుకోలేక వాటిని కొన్నిశక్తులు గాభావించి ఆ శక్తులను పూజించటానికి, తృప్తిపరచటానికి కొన్ని ఆచార వ్యవహారాలు సృష్టించుకున్నాడు మొట్టమొదటగా మతం యీరూపంలో బయలు దేరింది. మనదేశంలో వేదయుగం యీ కాలానికి చెందినది.

రాను, రాను మానవుడు విజ్ఞానాన్ని పొందసాగాడు. దాంతో తక్కిన దేశాలమాదిరిగా యిక్కడకూడా మొదట నిర్మించుకున్న మతంతో మానవుడు తృప్తిచెందలేదు. ఇంకా లోతుకి దిగి ప్రకృతిని అర్థంచేసుకోటానికి ప్రయత్నించాడు. మనదేశంలో వుపనిషత్తుల్లో కొంతవరకు యీ ప్రయత్నం కనబడుతుంది. తక్కిన దేశాల్లో మానవుడు పూర్తిగా తన వెనుకటి మతాన్ని త్రోసివేసి నూతన పథాన్ని చేపట్టాడు కాని యిండియాలో ఆవిధంగా జరగలేదు. వేద గ్రంథాలు రచించిన బ్రాహ్మణవర్ణమే వుపనిషత్తులు కూడ రచించడంచేత వేదయుగంలో పూజా, పునస్కారాల ద్వారా జీవితాన్ని గడుపుకుంటూవున్న బ్రాహ్మణవర్ణం ఆమతాన్నిపూర్తిగా కాదనలేక పోయింది. దీని ఫలితంగా మన దేశంలో భావపరిణామం హేతు వాదంలో కాక వేదాంత మార్గంలో నడిచింది.

అయినప్పటికీ వుపనిషత్తులను పరిశీలిస్తే అప్పటి వేద మతంమీద కొంతవరకు అసంతృప్తి బయలు దేరిందని, మానవుడు ప్రకృతిని అర్థంచేసుకోటానికి ప్రయత్నించాడని తెలక మానదు. యీ జిజ్ఞాసలో క్షత్రియవర్ణం హెచ్చుగాపాల్గొనలేదు ఒకవేళ బ్రాహ్మణమతం, అధికారంతో అసంతృప్తిచెంది క్షత్రియవర్ణం నూతనమార్గం త్రొక్కటానికి ప్రయత్నించినా ఆప్రయత్నాలన్నీ అధికారంలోవున్న బ్రాహ్మణవర్ణం నాశనంచేసి వుండవచ్చు

అంతవరకూ అధికారంలో వుంటూవున్న బ్రాహ్మణవర్ణమే (మతాధిపతులు) వుపనిషత్తులనుకూడ వ్రాయటంచేత యీవుపనిషత్తులు అప్పటి అధికారం, ఆచార, వ్యవహారాలు, సాంఘిక వ్యవస్థమీద తిరుగుబాటుకు మారుగా వాటిని సుస్థిరం చేసుకోటానికే అనుకూలంగా రచించబడ్డవి. యీవుపనిషత్తులను రచించిన వారే తిరిగి వేదాలను ప్రమాణ గ్రంథాలుగా తీసుకొని వాటిని కాదన్న వారిని త్రోసిపుచ్చి వేశారు. యీవిధంగా వుపనిషత్తులు వేదాలకు అనుకూలంగా రచించబడ్డంచేత మన దేశంలో మతం అనేక దేవుళ్ళనుంచి ఒకేదేవుడనే సిద్ధాంతానికి రాలేకపోయింది [మొట్ట మొదట మానవుడు ప్రకృతిలోని అన్నిశక్తులను అన్నిదేవుళ్ళగా పూజించ సాగాడు. అతని విజ్ఞానం అభివృద్ధి చెందినకొద్దీ యీశక్తులన్నిటికి వెనుక మహాశక్తి వుందని వూహించి ఆశక్తిని ఒకేదేవుడుగా భావించి పూజించ సాగాడు. ఇతర దేశాల్లో మతాధిపతులమీద క్రిందివర్గం తిరుగుబాటుతో యీనూతన మతం సృష్టించబడ్డది. మన దేశంలో యీతిరుగుబాటు అంతవరకు అధికారంలోవున్న బ్రాహ్మణవర్గమే (మతాధిపతులు) చేయటంచేత అది తిరుగుబాటుకు మారుగా అనుకూలంగా పరిణమించి ఒకే దేవుడనే యీనూతన మతం స్థాపించటానికి వీల్లేకపోయింది ] అందుకనే వుపనిషత్తుల్లో దేవుని (బ్రహ్మ) అస్థిత్వాన్ని స్పష్టంగా నిరూపించబడలేదు.

ఉపనిషత్తుల్లో చూపబడ్డ 'బ్రహ్మ' (దేవుడు) కేవలం వూహాప్రపంచంలో తప్ప సిద్ధాంత రీత్యా వచ్చిన అభిప్రాయంకాదు. దీని ఫలితంగా మానవుని హేతువాదం దెబ్బ తిన్నది. అతడు యింకా ముందుకు పోయి యింకా ప్రకృతి రహస్యాలను కనుక్కోటానికి వీల్లేకపోయింది ప్రకృతిని ప్రకృతి అనే భావం అతనిలో నశించినది. తరువాత కణాద, కపిల, గౌతమ,

చార్వాక మొదలైన కొంతమంది తత్వశాస్త్రజ్ఞులు ప్రకృతిని అర్ధంచేసుకోటానికి ప్రయత్నించారు. కాని వారిలో కూడా చాలమంది యేదో వొకటి తమకు తెలియని శక్తివుందని మూఢ విశ్వాసంలో వుంటంచేత తమ ప్రయత్నంలో సఫలం పొందలేకపొయ్యారు. దాని ఫలితంగా మన ప్రాచీన తత్వశాస్త్రం తత్వశాస్త్రంగా అభివృద్ధి చెందక వేదాంత రూపంలోనూ, మూఢ మతంగానూ అభివృద్ధి చెందుతూ వచ్చింది.

దీనికి తగ్గట్టుగా మానవుని మనస్సుని బంధించి స్వతంత్ర బుద్ధి, ఆలోచన లేకుండా చేయటానికి కావలసిన తర్కశాస్త్రం కూడ సృష్టించబడ్డది. బ్రాహ్మణవర్ణం తమ అధికారాన్ని బలవత్తరం చేసుకొని రెండోవర్ణం తిరుగుబాటు చేయటానికి వీల్లేకుండా చేసింది.

తరువాత కొంతవరకుమహాభారతకాలమందు క్షత్రియవర్ణం, బ్రాహ్మణవర్ణంమీద తిరుగుబాటు జరిపింది కానిఫలించలేదు కురుక్షేత్రసంగ్రామంలో శక్తి వంతమైన క్షత్రియ జాతులన్నీ నాశనం చెందటం చేత క్షత్రియుల తిరుగుబాటు దెబ్బతిని తిరిగి బ్రాహ్మణవర్ణం అధికారంలోనే వుంటానికి అవకాశం లభించింది. వేదమతం పునరుద్ధరించబడ్డది. ధర్మరాజు చేసిన అశ్వమేధయాగం పాండవుల విజయ చిహ్నంకాదు, బ్రాహ్మణవర్ణ అధికారాన్ని అంగీకరించటం. యీ యజ్ఞ, యాగాదుల ద్వారా సంఘం మీద బ్రాహ్మణ వర్ణానికి అధికారం వుందని, సంఘం సృష్టించిన వస్తువాహన, పరికరాలు బహుమాన రూపంలో బ్రాహ్మణవర్ణం పొందటానికి హక్కు వుందని తిరిగి రుజువు చేయబడ్డది.

అంపశయ్యమీద వున్న భీష్ముడు యుధిష్టరునకు గరపిన నీతులవల్ల యీ విషయం యింకా స్పష్టపడుతుంది. జయంపొందిన ధర్మరాజుకి భీష్ముడు యీవిధంగా సలహాయిస్తాడు.—"రాజు సద్ధర్ముడనిపించుకోవాలంటే బ్రాహ్మణులను పూజచేసి సన్మానిస్తూ వుండాలి. అశ్వమేధ యాగాలకంటె బ్రాహ్మణులకిచ్చే బహుమానాలు యెక్కువ లాభప్రదమైనవి. వీటి ఫలితంగా క్షత్రియుడు స్వర్గపథం చేరుకుంటాడు. భూమిని బ్రాహ్మణునకు దానంచెయ్యాలి. యిచ్చిన భూమిని తిరిగి తీసుకొన్నందువల్ల వచ్చేపాపం దేనివలనా హరించదు. పొరపాటుపడికూడ బ్రాహ్మణులను శిక్షించరాదు. వారు అందరికంటె పూజ్యులు, గొప్పవారు. ఉదకం నుంచి అగ్ని, బ్రాహ్మణుని నుంచి క్షత్రియుడు, రాతినుంచి యినుము

వుద్భవిస్తవి. ఇనుముద్వారా రాయి, అగ్ని వలన ఉదకం, క్షత్రియునివలన బ్రాహ్మణుడు నాశనం చెందితే వీరితోబాటు వారుకూడ నాశనం కాక తప్పదు. బ్రాహ్మణునితో సమానం అని చెప్పుకునే వారిని శిక్షించటం రాజు కర్తవ్యం''

కురుక్షేత్ర సంగ్రామంవల్ల క్షత్రియ జాతి తమలోతాము పోట్లాడుకొని నశించిపోటంచేత చాలాకాలంవరకు బ్రాహ్మణ అధికారాన్నెదుర్కొనే జాతి లేకపోయింది. యీ యుగంలో కలిగిన భావపరంపర, రచించిన గ్రంథాలన్నీ బ్రాహ్మణవర్ణానికి అనుకూలంగానే చిత్రించబడ్డవి. వైశేషిక సాంఖ్య శాస్త్రాలుకూడా భౌతికవాదం బోధించినా దీన్నుంచి విముక్తి పొందలేకపోయినై. వీటిని రచించిన శాస్త్రజ్ఞులు చాలావరకు విప్లవదృష్టితోనే పరిస్థితులను అర్థంచేసుకోటానికి ప్రయత్నించారు. కాని అప్పటి పరిస్థితులు, సాంఘిక వ్యవస్థ అన్నీ బ్రాహ్మణ మతాన్ని, అధికారాన్ని సుస్థిరం చేయటానికే యెక్కువ అనుకూలంగా వుండటంచేత వాటిని యెదుర్కొనే తాహతు వీరికి లేకపోయింది. దానివలన వీరి తత్వశాస్త్రానికి అప్పుడు తగిన బలం చిక్కలేదు

యీ విధంగా బ్రాహ్మణ అధికారం నిజమైన తత్వశాస్త్రానికి అవకాశం యివ్వకుండా ప్రాధాన్యంవహిస్తూ నిలిచిపోయింది. మొట్టమొదటిగా, తాత్కాలికంఅయినా బ్రాహ్మణవర్ణం మీద తిరుగుబాటు బౌద్ధమతం వలన జరిగింది. అప్పటి పరిస్థితులను సరిగ్గా అర్థంచేసుకుంటే ప్రచారంలో వున్న సాంప్రదాయాలు, యీ తిరుగుబాటుకు కారణం తెలుస్తుంది.

బ్రాహ్మణవర్ణం వేదాంత విచారములోనే కాకుండా రాజకీయంగా కూడా అధికారాన్ని సంపాదించుకోగల్గింది. అంతవరకూ క్షత్రియవర్ణం చేస్తూ వున్న కార్యకలాపాలన్నీ బ్రాహ్మణవర్ణం చూడసాగింది. మతసంబంధమైన వ్యవహారాలన్నీ పూర్తిగా బ్రాహ్మణ హస్తగతమైనవి. వీటిని సుస్థిరం చేసుకోటానికి బ్రాహ్మణవర్ణం అనేకమైన ఆచార వ్యవహారాలను, మూఢ విశ్వాసాలను సృష్టించినది. వేదకాలంలో వున్న 'పశుప్రదానం' మంత్ర రూపంలో అభివృద్ధి చెందింది. 'మంత్రం ద్వారా రాజ్యాలు జయించవచ్చు వోడించవచ్చు, దేశాభివృద్ధి కలిగించవచ్చు, యెదుట వానిని వాదనలో వోడించవచ్చు. సర్వరోగాలను క్షణంలో నివారించవచ్చు. దాని వలన కాని పనివుండదు,'' కాని బ్రాహ్మణ సిద్ధాంతం ప్రకారం మంత్ర ప్రభావం

ఉచ్చరించేవాడు యెంత అజ్ఞాని, దుర్మార్గుడు అయినా ఆ శక్తి యితరులకే వుపయోగపడుతుంది కాని వుచ్చరించేవాడు తనకు తానుగా ప్రయోగించుకుంటే అది విఫలం కావటమేకాక అతనికి అపకారం కూడా జరుగుతుంది. యీ విధంగా మూర్ఖులు, దుర్మార్గులు మంత్రంపేరిట సంఘంలో వుచ్చస్థానాన్ని పొందగలిగినంతకాలం సంఘంలో మూఢాచారాలు, పిచ్చి నమ్మకాలు ప్రబలటమే కాకుండా నాగరికత అభివృద్ధి చెందటానికి అవకాశం వుండదు మంత్రంతో పాటు సంఘాన్ని పీల్చుకుతింటానికి 'త్యాగం' అనే పదం కూడా వేదకాలం నుంచి ప్రచారంలోవుంది దీన్నే బ్రాహ్మణ వర్గం సంఘంనుంచి తమకు కావలసినవన్నీ పొందటానికి 'దక్షిణ' రూపంలో ప్రచారం చేసింది. యీ విధంగా 'మంత్రం, దక్షిణ' పేరిట బ్రాహ్మణ వర్గం సంఘం మీద పెత్తనం చేయటమే కాకుండా సంఘాన్ని తమ జీవితాధారంగా చేసుకోటానికి పిచ్చినమ్మకాలు, మతవ్యామోహం కలిగించి సంఘం ముందుకు వెళ్ళటానికి వీల్లేకుండా చేసింది.

వైశేషిక, సాంఖ్యశాస్త్రాలు మినహాయిస్తే హిందూతత్వశాస్త్రమంతా కేవలం మతదృష్టిలోనే నడిచింది. భగవత్ప్రేరేపణ లేకుండా యేశాస్త్రంలో గూడ ప్రకృతియొక్క అనాది, పరిణామం, గూర్చి చర్చించబడలేదు. యీవిధంగా లేనిదాన్ని వున్నదనే మూఢవిశ్వాసంతో బయలుదేరిన శాస్త్రం నిరుపయోగం కాక తప్పదు. హిందూశాస్త్రాలను, వేదాంత తత్వ విచారాన్ని బాగా పరిశీలిస్తే ఒకదానికొకటి పరస్పర విరుద్ధంగానూ, అస్పష్టంగానూ గోచరిస్తవి హిందూ ధర్మశాస్త్రాల్లో భగవద్గీత ప్రమాణ గ్రంథంగా తీసుకోన బడుతుంది. ఇందులో వొకచోట యీవిధంగా చెప్పబడివుంది. ''జడ చేతనములకు వ్యత్యాసంలేదు. నిరాకారం, అగోచరం, అస్తిత్వంలేని చేతనం నీరు, మంచుగడ్డగా మారినట్లు జడ పదార్థంగా మారుతుంది.''

''బాగా పాలిష్ చేయబడ్డ వస్తువు (అద్దము) యొక్క కాంతి లేక సూర్యకిరణమువల్ల యేర్పడ్డ యెండమావుల్లాగా యీప్రపంచం మిథ్య. కాని యెవరూ భూత, వర్తమాన, భవిష్యత్కాలాల్లో యెప్పుడూ దీన్నుంచి తప్పించుకోలేరు.''

ఇక్కడ యేది అనిత్యం అని చూపబడిందో అది నిత్యంగా అంగీకరించబడింది. భూత, వర్తమాన, భవిష్యత్కాలాల్లోఅస్తిత్వాన్ని పొందకలిగిన

వస్తువు స్థిరత్వాన్ని పొందుతుంది. ఆవిధంగా 'మిథ్య' అని చెప్పబడ్డ ప్రపంచం స్థిరమైనదని అంగీకరించి నప్పుడు భగవంతుడు 'ఒకటేవొక స్వరూపం' 'సర్వాంతర్యామి' అనేవాదనకు ఆస్కారం వుండదు, అప్పుడు హిందూ తత్వశాస్త్ర పునాదులే కదలిపోతున్నవి.

చేతనం నిజంగా చేతనమైతే దానినుంచి జడం బయలుదేరటానికి వీల్లేదు. రెండువస్తువులు ఒకదానికొకటి సంబంధంలేనప్పుడు కారణ-కార్యములుగా సంభవించటానికి వీల్లేదు. జడం చేతనంనుంచి వచ్చిందంటే చేతనం కేవలంచేతనంకాదు. అదికూడా తప్పనిసరిగాజడంఅయితీరాలి. అంటే వస్తువు వొకటేనని తేలుతుంది. ఇక్కడ చూపబడ్డ ద్వైత్వం కేవలం వూహా కల్పితం తప్ప సిద్ధాంతీకరణకాదు. చేతనం వస్తువుయొక్క పుట్టుకకు (జడం) కారణంగా భావిస్తే చేతనంయొక్క అస్థిత్వాన్నే కాదనవలసివస్తుంది. అస్థిత్వం అనగానే కొంతవోటును ఆక్రమించుకున్నదని తేలుతుంది. అలాంటప్పుడు అది చేతనంయొక్క గుణం అని చెప్పటానికి వీల్లేదు. నీరు జడపదార్థం కాబట్టి దీన్ని మరొక జడపదార్థమైన మంచుగడ్డగా మార్చటానికి అవకాశంవుంది. నీరు జడపదార్థం కానప్పుడు జడపదార్థమైన మంచు గడ్డ యేర్పడటానికే వీల్లేదు. కాబట్టి జడం వొక్కటే స్థిరమైనది. దీనికి నాశనం లేదు—పైన చూపబడ్డ శ్లోకాన్ని తర్కబుద్ధితో ఆలోచిస్తే తేలిన సారాంశం యిది. కాని యీ సారాంశం వొప్పుకుంటే హిందూవేదాంతం అంగీకరించటానికే వీలుండదు గుడు, గుడు గుంజం లాగా వున్న హిందూ వేదాంతాన్ని యిది సూటిగా బ్రద్దలుచేస్తుంది దీనివల్ల సృష్టికర్త అనే పదానికి యేమీ ఆస్కారంలేదు.

వూహాప్రపంచంలో వున్న భగవత్స్వరూపమును, (చేతనం) దాని పరస్పర విరుద్ధగుణాలే లేదని నిరూపిస్తున్నవి. కాని దాన్నే నిత్యమని, స్థిరత్వమును కాదని రుజువుచేయటానికి వీలులేని జడం అనిత్యం, మిథ్య అని చెప్పబడుచున్నవి. 'జడం చేతనం. యీరెంటికి భేదం లేదని' చూపబడుచున్నది. కాని హిందూతత్వశాస్త్రం ప్రకారం యీ రెంటికీ భేదాన్ని చూపించటమే మానవుని నిజమైన జ్ఞానం అని వాదించబడుతుంది. యీ విధంగా విరుద్ధ భావాల్ని చూపించే వాదం మూఢమతంగా, అభివృద్ధి చెందక తప్పదు.

క్లుప్తంలో హిందూ వేదాంత తత్వవిచారాన్ని యీ విధంగా చెప్ప వచ్చు.

వాదన:—జడం చేతనం రెండూ వొకటి కాదు.

ప్రశ్న:—జడం చేతనాన్ని యెలా తెలుసుకో గలుగుతుంది?

సమా:—జడం చేతనం కావాలి.

శంకరాచార్యునిభాష్యం ప్రకారం వేదాంత సూత్రాలు ఫక్తు హిందూ తత్వశాస్త్రాన్ని ప్రతిబింబిస్తవి. కాని ఆ సూత్రాలు కూడా అనేక విధాలుగా నిర్వచింపబడ్డవి. రామానుజుడు వ్రాసిన 'శ్రీభాష్యం' 'శంకరుని భాష్యం'తో అనేక ప్రధాన విషయాల్లో యేకీభవించదు. శంకరభాష్యం వాదనలో తర్కశాస్త్ర బద్ధంతో నడిచినా యిందులో పరస్పర వైరుధ్యాలు చాలా వున్నవి. ఉదా:—''చేతనం(బ్రహ్మ)తోపాటు అనాదినుంచీ మరొకటి వున్న ట్లయితే చేతనం రెండోదాన్ని కలిగివుందని చెప్పవలసి వస్తుంది.''

యీ ద్వైత్వం అంగీకరిస్తే 'పరమాత్మను తెలుసుకుంటే సర్వం తెలుసు కున్నట్లే' అనే వాదనకు అర్థంవుండదు. కాబట్టి చేతనంతోపాటు అదే మరొక రూపంలో అనాదినుంచీ వస్తున్నదని శంకరుడు వీటి రెంటికీ సమ న్వయం కుదర్చటానికి ప్రయత్నించాడు. కాని దీనివల్ల అసలు విషయం తేలదు. శంకరుడు అద్వైత సిద్ధాంతం ద్వారా హెగెల్ భావవాదాన్ని సృష్టించినట్లుగా అతడు స్వచ్ఛమైన 'ఏకత్వ'వాదాన్ని సృష్టించినట్లు సాధా రణంగా నమ్మబడుతూవుంది కాని శంకర భాష్యం చూస్తే దానికి తగిన ఆధారం కనబడదు. శంకరభాష్యం యీ విధంగా ప్రారంభం అవుతుంది. "వస్తువు, వస్తుస్వరూపం రెండూ వొకటికాదు. చేతనం జడం ఒక దాని కొకటి పగలు—రాత్రి అంత భేదం.కలిగి వున్నప్పుడు వీటిరెంటినీ ఒకటి అన టానికి వీల్లేదు"

ఇందులో రెండు వైరుధ్యాలు కనబడుతున్నవి. వొకటి — యీ వాదన కేవలం మూఢంగా నమ్మటం తప్ప యీ సిద్ధాంతం యిందులో రుజువు చేయబడలేదు. రెండోది — ఏకత్వం నిరూపించటానికి ద్వైత్వం కారణంగా చూపబడింది. యీ ద్వైత్వంనుంచి తప్పించుకోటానికే శంకరుడు 'మాయావాదాన్ని' (ఇది అసలు వేదసూత్రాల్లో లేదు) సృష్టించాడు.

యీ మాయావాదం యీవిధంగా చెప్పబడింది "పరమాత్మ (భగవంతుడు) మాయలేక అవిద్య అనే మరొకశక్తితో కలిసివున్నది. ఆశక్తి ప్రతిబింబమే యీప్రకృతి. యీశక్తిని చేతనం అనటానికి వీల్లేదు. యెందుకంటె చేతనంఅంటే పరమాత్మ వొక్కడికే చెందుతుంది. కాని దీన్ని జడం (అచేతనం) అని చెప్పటానికి కూడా వీల్లేదు. కారణం? అచేతనంవల్ల యీప్రకృతి సృష్టించబడ టానికి వీల్లేదు. కాబట్టి యిది యదార్ధంగా మాయ అయినా దీనివల్లనే యీప్రకృతి ప్రతిబింబిస్తుంది. కాబట్టి యీ ప్రకృతికి మాయ 'ఉపాదన'గా వుంది. మాయ పరమాత్ముని శక్తిగా చెందియున్నది. మాయ పరమాత్మతో కలిసివుంది కాబట్టి యీప్రకృతికంతటికీ కారణం పరమాత్మే (భగవంతుడు) అవుతుంది" యీసిద్ధాంతంవల్ల 'పరమాత్మ వొక్కటే నిత్యం' అనే వాదన దెబ్బతింటుంది భగవంతుడు నిర్గుణుడు. అయినా మాయ అనేశక్తి యితనికి ఆపాదించ బడ్డది. కాగా పరమాత్మునితో పాటు మాయకూడ అస్తిత్వం కలిగి వుందని చెప్పబడుతుంది. యీ 'కలయిక' 'చెందియుండుట'లోనే ద్వైత్వం గోచరిస్తుంది

ముఖ్యంగా యీ ఏకత్వ (అద్వైత) సిద్ధాంతంలో పరమాత్ముని ఏకత్వం నిరూపించటానికి తర్కశాస్త్రం వాడబడ్డది. ఉపనిషత్తులలోని సిద్ధాంతాలన్నీ సమీకరించి వాటి కన్నింటికీ వొకే ఆకారంయిచ్చి కణాద, కపిల, గౌతమ మొదలైన వారి హేతువాద సిద్ధాంతాలను అందులో నుంచి మారం చేయటమే వేదాంత సూత్రాల ఆదర్శం కాని వొకే భావంగా సిద్ధాంతీకరించటానికి వీల్లేని.భావాలు ఉపనిషత్తుల్లో గోచరిస్తవి. ఉదాహరణకు చాందోగ్య, బృహదారణ్యక వుపనిషత్తుల్లో ఆకాశం, అగ్ని, వాయువు అనాది వస్తువులని వర్ణించబడ్డవి. దీనివలన తక్కిన ఉపనిషత్తుల్లో 'పరమాత్మ వొక్కడే అనాది' అనే సిద్ధాంతం దీన్నాధారం చేసుకొన్న, 'పరమాత్ముని తెలుసుకుంటే సర్వం తెలుస్తుంది.' అనేవాదన (ఇదే హిందూతత్వ శాస్త్రానికి మూలాధారం) దెబ్బతింటవి. కాబట్టి వుపనిషత్తు లన్నింటినీ తత్వశాస్త్రంగా పరిగణించటానికి వీల్లేదు సనాతనత్వంతో మూఢ విశ్వాసాలకు గురికాని కొందరు తత్వవేత్తలు వేదమతాన్ని యెదుర్కొనటానికి యీ వైరుధ్యాన్ని చూపించారు. వారి వాదన వొక్కటే—ఆదిలో పరమాత్మ తప్ప మరొకటి లేదని. అంటే ఆకాశం, అగ్ని, వాయువు మొదలైనవాటికిపుట్టుక వుందని. అంటే అవి సృష్టించబడ్డవని అంగీకరించవలసి వస్తుంది. అప్పుడు

పరమాత్ముడు నిర్వికల్పుడు, నిర్గుణుడు అనే వాదనకు ఆస్కారంలేదు. ఒకవేళ యివి కూడా అనాది వస్తువులని అంగీకరిస్తే "పరమాత్మ డొక్కడే అనాది (స్వయంభూ)" అనే వాదనకు ఆస్కారం వుండదు. కాబట్టి యిందులో యేది అంగీకరించి యేది కాదన్నా వేదమతం దెబ్బతింటున్నది శంకరుడు యీచిక్కునుంచి వేదాంతాన్ని రక్షించటానికి ప్రయత్నించాడు. పరమాత్మ కలుషరహితం కావాలంటే ఆకాశం, అగ్ని, వాయువు మొద లైనవికూడా అనాది వస్తువులు కావాలి. కాబట్టి వీటికి భగవత్స్వరూపం కల్పించి వేదాంతాన్ని రక్షించాడు.

ఇక్కడ యీసూత్రంమీద శంకరుని భాష్యం చాలా తమాషాగా వుంటుంది ఇక్కడ హిందూ తత్వశాస్త్రం తర్కబద్ధంతో పూర్తిగా మూసి బడుతుంది. "పరమాత్ముని సంపూర్ణత్వం నిరూపించాలంటే తక్కిన వస్తువు లన్నీ భగవత్స్వరూపమేనని చెప్పవలసి వస్తుంది. భేదంవుందని అంగీకరిస్తే పరమాత్ముని సంపూర్ణత్వానికి భంగం వాటిల్లుతుంది ద్విత్వంలో అభేదం చూపాలంటే వాటికి కారణం పరమాత్మ అనే చెప్పాలి. వేదం ప్రకారం కారణ-కార్యాలుఒకటేనని అంగీకరించినప్పుడు యీ విభేదం వుండదు. ఆకా శం మొదలైనవి పరమాత్ముని కార్యాలుకాకపోతే పరమాత్ముని తెలుసుకో టంచేత వీటిని తెలుసుకోలేము. కాబట్టి తక్కినవికూడా అనాది వస్తువులని అంగీకరిస్తే వేదాధికారం తొలుగుతుంది కనుక యీవాదన అంగీకరించటానికి వీల్లేదు" యిందులోనితర్కశాస్త్రనైపుణ్యం గమనించదగ్గది. వేదాల్లో వైరు ధ్యంవుంటే దాన్నిఅంగీకరించటానికి వీల్లేదు. అంగీకరిస్తే వేదాలు ప్రమాణ గ్రంధాలనిపించుకోవు. కాబట్టి ఆ వైరుధ్యాన్ని త్రోసివేయాలి. యీ తర్క శాస్త్రం ప్రకారం యే విషయాన్నీ రుజువుచేయటానికి వీల్లేని సిద్ధాంతం సృ ష్టించబడ్డది వ్యతిరేక వాదాన్ని కేవలం అది వ్యతిరేకవాదం అనే దృష్టితో త్రోసివేయబడ్డది. ప్రాచీన భారతకాలంలో యిలాంటి తర్కం హేతు వాదం అభివృద్ధి చెందటానికి వీల్లేకుండా చేసింది. మతాధిపతుల (బ్రాహ్మణ వర్ణం) నిరంకుశత్వం క్రింద నలిగిపోతూ వున్న సంఘానికి యిది ఆదర్శ ప్రాయ సిద్ధాంతంగా చూపబడింది.

భిన్నత్వంనుంచి ఏకత్వం తెలుసుకోటమే హిందూ తత్వశాస్త్రంలోని గొప్పదనంగా భావించబడ్డది. ఇది కేవలం వూహా కల్పితం దీనివల్ల నిజంగా పరిష్కరించ వలసిన సమస్యలు పరిష్కరించ బడలేదు. భౌతిక (జడ) పదార్థ

మైన ప్రకృతికి అభౌతికమైన చేతనం కారణం కావటం తర్కబద్ధం కాదు. యీ విషయాన్ని ఉపనిషత్తుల, ఋషులనుంచి శంకరాచార్యుని వరకు యే హిందూ తత్వశాస్త్రజ్ఞుడు కూడా సహేతుకంగా ఒక కారణ వస్తువునుంచి విభిన్నమైన ప్రకృతి పదార్థాలు యెలా జనించినవో నిరూపించలేదు. యీ అజ్ఞానావస్థే చివరకు మాయావాదంగా పరిణమించినది. హేతువాద బద్ధమైన తర్కశాస్త్రం లేకపోవటంచేత యీ సిద్ధాంతం నాలుగు స్తంభాలాటగా పరమాత్ముని సహాయంతో తిరిగిన చోటే తిరుగుతూ ముందుకు సాగలేకపోయింది. చివరకు శంకరాచార్యుని అద్వైతవాదం ప్రకృతిని మాయగా చూపించి యీ సమస్యను పరిష్కరించింది. అయినా ఇది 'భగవంతుని' నుంచి తప్పించుకోలేకపోయింది. భిన్నత్వంనుంచి ఏకత్వం నిరూపించే తత్వశాస్త్రానికి 'భగవంతుడు' అనవసరం.

వేదమతం మీద కొంత అసంతృప్తి యేర్పడటంచేత ప్రకృతి పుట్టుకను, అనాది వస్తువులను గూర్చి కొన్ని నూతన సిద్ధాంతాలు (ఉపనిషత్తులు) బయలు దేరినవని కాని ఆసిద్ధాంత కర్తలు కూడా బ్రాహ్మణ జాతికిచెందిన వారు కావటంచేత హిందూతత్వశాస్త్రం భౌతికవాదానికి మారుగా వేదాంత మార్గం (ఆధ్యాత్మికవాదం)లోనే నడిచిందని వెనుక చూపబడింది కాని క్రీస్తు పూర్వం 8,9 శతాబ్దాల్లో ఇక్కడకూడా కేవలం భౌతికవాద దృష్టికల కొంతమంది తత్వశాస్త్రజ్ఞులు బయలుదేరారు. వీరి సిద్ధాంతాలకు ప్రత్యేకించి ప్రస్తుతం యేమీ ఆధారం లేకపోయినా వాటినిగూర్చి ఖండిస్తూ వ్యతిరేకులు వ్రాసిన వాటినిబట్టి వీరి సిద్ధాంతాలు కొంతవరకు అర్థం చేసుకోవచ్చు. మొదటి వుపనిషత్తుల్లో చూపబడ్డ వైశేషిక, సాంఖ్యశాస్త్రాలు చాలావరకు యీభావ పరిణామానికి దోహద మిస్తవి. సంఘంలో వేదమతం చివరిదశకు వచ్చింది. మతాధిపతుల (బ్రాహ్మణవర్ణం) నిరంకుశత్వంతో సంఘం నలిగిపోయింది యీవ్యవస్థను తొలిగించి నూతన వ్యవస్థను స్థాపించ వలసిన ఆవశ్యకత యేర్పడింది. తత్వ శాస్త్రజ్ఞులు కొంతమంది ప్రకృతి ధర్మాల్ని, పరిణామాన్ని హేతువాదంతో, భౌతిక దృష్టితో వివరిస్తూ సంఘంమీద దేవుని పేరుతో సృష్టించబడ్డ అధికారానికి అత్యాచారాలకూ యెదురు తిరిగారు.

నేడు ప్రచారంలోవున్న హిందూవేదాంత శాఖలన్నీ 'సంఘద్రోహులని' 'నాస్తికులని' నిరసిస్తున్నవి. ఇందులో మొదటి తెగకు చెందిన

వారు వేదాధికారాన్ని ఖండించారు, రెండో తెగకు చెందినవారు ఆదిలో యేమీ లేదు, అంతా శూన్యం అనే వాదనకు చెందినవారు సాంఖ్యశాస్త్రం ప్రకారం శూన్యవాద సిద్ధాంతమిది .. "యదార్థంగా కేవలం భావంతప్ప యేదీ స్థిరంగా నిలవదు అదే విధంగా కర్మకూడా అంతే కర్మ కేవలం స్వప్న సమానం. కాబట్టి దానికి ప్రత్యేకించి కారణం వుండదు. కర్మ కేవలం మిథ్య శూన్యం వొక్కటే స్థిరమైనది నాశనం చెందేది లెక్కించటానికి వీల్లేదు. నాశనం చెందటం వస్తుధర్మం శూన్యం వొక్కటే స్థిరంగా వుండ గలుగుతుంది. పుట్టుక వున్నదంతా నాశనం చెందక మానదు. నాశనం చెందేది స్వప్నంలాగా మిథ్య కాబట్టి వస్తుసంబంధ కర్మసంచయంకూడా కేవలం క్షణికం స్థిరంగా వుండదు కాబట్టి కర్మబంధనం యెవరికీ వుండదు. వస్తువు తన ధర్మాన్ని విడిచిన తరువాత నిలువజాలదు. వస్తువు తన ధర్మాన్ని విడిచిందంటే అది తన అస్తిత్వాన్నే కోల్పోయిందని చెప్పవలసి వస్తుంది.

## ప్రాచీన హిందూ తత్వశాస్త్రంలో భౌతికవాదం

ఈవిధంగా విడి విడిగా అస్పష్టంగా వున్న యీభావాల్ని తీసుకొని మొత్తం శాస్త్రాన్ని నిర్మించటం చాలా కష్టం. కాని ప్రాచీన హిందూతత్వ శాస్త్రాన్ని కూలంకషంగా తెలుసుకోవాలంటే లోతుకుదిగి వీటిని చర్చించవలసి వుంటుంది ప్రస్తుతానికి పైభావాలను పరిశీలిస్తే వేద మతంలోవున్న అజ్ఞానాన్ని తప్పించుకొని బయటపడటానికి ప్రయత్నించిన యీయత్నం ఆదిలో భౌతికవాదం మీదనే నడిచిందని స్పష్టంకాక మానదు. ఇందులో ఆధ్యాత్మిక వాదానికి చోటులేదు. ఇందులో వేదాధికారాన్ని యెదుర్కొనటమే కాకుండా ఆధ్యాత్మికవాదం పూర్తిగా ఖండించబడ్డది 'అంతాశూన్యం' యేదీస్థిరంలేదు. అనేవాదనతో ఆధ్యాత్మికవాదం బోధించే భగవంతుడు, భగవత్స్వరూపాలు యెగిరిపోయినై.

వేదకాలం అంతరించటానికి శూన్యవాదం సిద్ధాంతంగా వుపకరించింది. యీసిద్ధాంతం వేదకాలంలోంచి మతాధిపతులమీద తిరుగుబాటు లేవదీసింది కాబట్టి ఆసృష్టిలో యిది విప్లవాత్మకమైన సిద్ధాంతం. కాని తత్వ

శాస్త్రాలలో యిది తీవ్రవాదంగా అభివృద్ధి చెందింది. రాను, రాను చాలా వరకు బౌద్ధమతం మీదకూడ దీని ప్రభావం పడింది. ఆకాలంలో యీసిద్ధాంతం చాలా వరకు సంఘంలో వ్యాపించి వుండవచ్చు. అందుకనే దీన్నియెదుర్కొనటానికి హిందూ తత్వశాస్త్రంలో శాఖోప శాఖలు బయలుదేరినై. భౌతికవాదం అభివృద్ధిచెందటానికి శూన్యవాదం అవకాశాన్ని కలిగించింది. 'అంతా శూన్యం' అనేవాదనను యెదుర్కొనటానికి భౌతిక ప్రపంచాన్ని ఆధారంగా తీసుకొన వలసివచ్చింది యీశూన్యవాదానికి, కేవలం భౌతిక వాదంమీద నడిచిన వైశేషిక సిద్ధాంతానికీవున్న సంబంధాన్నిగూర్చి ఇంకా పరిశోధనచేయ వలసివుంటుంది కాని దీనికీ, సాంఖ్యశాస్త్రానికీ వున్న సంబంధం కొంతవరకు తెలుస్తుంది. శూన్యవాదాన్ని యెదుర్కొనటానికి సాంఖ్య శాస్త్రజ్ఞులు పూర్తిగా భౌతికవాదాన్ని చేపట్టవలసివచ్చింది. ఒకదాని స్థిరత్వాన్ని ఋజువుచేయటానికి కపిలుడు భౌతికప్రపంచాన్ని ఆధారంగా చూపవలసివచ్చింది. అంతకుముందు సంఘంలో ప్రచారంలోవున్న ఆధ్యాత్మికవాదంలోని భావవాదాన్ని (భావంవొకటే స్థిరమైనదనేవాదన) ఆధారంగా చేసుకొని తర్కబద్ధంగా అభివృద్ధిచెందిన శూన్యవాదాన్ని ఖండించటానికి సరియైన ప్రమాణం చూపెంచాలి కాబట్టి భావం స్థిరమైతే భావానికి కారణభూతమైన భౌతిక ప్రపంచంకూడా స్థిరమని కపిలుడు వాదించాడు. ఆవిధంగా శూన్యవాదంనుంచి భౌతికవాదం బయలుదేరింది.

వేదాంత తత్వశోధకు పట్టుకొమ్మలనుకునే యితర వుపనిషత్తుల్లో కూడ యీభౌతికవాదం కనబడుతూనే వుంటుంది. వేదమత సిద్ధాంతాలతో తృప్తిచెందక ప్రకృతిని తెలుసుకోటానికి బయలుదేరినసిద్ధాంతం తప్పనిసరిగా భౌతికవాదంవైపు నడుస్తుంది ఈవిధంగా ప్రాచీన హిందూతత్వశాస్త్రం పూర్తిగా భౌతికవాదాన్ని తిరస్కరించలేకపోయింది. అక్కడక్కడా కనబడుతున్న యీతత్వవిచారణనుబట్టి చూస్తే చాలవరకు ఈసిద్ధాంతం కాలం గడిచినకొద్దీ నాశనం చేయబడుతూవచ్చినదని తేలుతుంది. గడిచిన దానిని పునరుద్ధరించేవారకూ హిందూతత్వశాస్త్రం క్రమబద్ధంగా వుండదు. మచ్చుకి ఒకటి రెండు విషయాలు గమనిస్తే వుపనిషత్తులు యేవిధంగా నడిచినవో తెలుస్తుంది.

"ప్రకృతికి ఆదియేది? ఆకాశం. అన్నివస్తువులు అక్కడనుంచే

బయలుదేరి తిరిగి అక్కడకే చేరుకుంటున్నవి. కాబట్టి వాటన్నింటికి స్థావరం ఆకాశం" "దేన్నుంచైతే వివిధనామాలు, స్వరూపాలు వుద్భవిస్తున్నయో అదే ఆకాశం (ఛాందోగ్య ఉపనిషత్).

యీ సిద్ధాంతాన్ని వొప్పుకుంటే ప్రతిదీ శూన్యం (ఆకాశం) అని చెప్పవలసి వస్తుంది కాబట్టి శూన్యవాదాన్ని వొప్పుకోవలసి వస్తుంది. ఇదే ఉపనిషత్ లో మరొకచోట పరమాత్మ (చేతనం) ప్రతివస్తువుకీ మూలాధారం (కారణం) అని కూడా చెప్పబడింది ఆకాశం (శూన్యం) పరమాత్మ (చేతనం) ఒకటే అయితే పరమాత్మతోపాటు 'ఆకాశం'నుంచి వివిధ నామాలు, స్వరూపాలు వుద్భవిస్తున్నయ్యని చెప్పనక్కర్లేదు దీన్నిబట్టి వివిధవస్తువులకు (ప్రకృతికి) కారణభూతం 'పరమాత్మ' కాదని తేలుతుంది. పరమాత్మ కాదని తేలినప్పుడు వాటికి కారణం భౌతికమని వొప్పుకోక తప్పదు దీన్ని గురించి వాదోపవాదాలు బయలుదేరి వుండవచ్చు అందుకనే శంకరాచార్యుడు "యిక్కడ ఆకాశం అనే పదానికి పరమాత్మ అని అర్థం చెప్పుకోవాలి." అని నొక్కి చెప్పవలసి వచ్చింది. తర్కశాస్త్రం ప్రకారం పైవాదం వొప్పుకోక తప్పదు. కాని అప్పటి మత ప్రచారాన్ని బట్టి పరమాత్మ మూల కారణంగా చూపబడినా భౌతిక పదార్థం (ఆకాశం) కూడా మూల కారణంగా చూపబడింది. మత ప్రాబల్యాన్నిబట్టి, మూఢాచారాలను బట్టి 'పరమాత్మ'ను వదలిపెట్టటానికి వీల్లేకపోయింది అప్పటి నుంచీ యిప్పటివరకూ యీ పరస్పర వైరుధ్యంతో హిందూ తత్వశాస్త్రం యెటూ తేల్చుకోలేక రెంకల రాటం లాగా ముందుకుసాగలేని స్థితిలో పడిపోయింది

కథా ఉపనిషత్తులో యీ ప్రపంచ పరిణామానికి జడ పదార్థం కారణభూతంగా చూపబడింది కపిలుడు దాన్నే తన సిద్ధాంతమైన 'ప్రధాన అవ్యక్తి' తత్వానికి ఆధారంగా తీసుకొని వేరుమార్గం త్రొక్కాడు.

శ్వేతాశ్వతార ఉపనిషత్తులో అగ (అగ్ని) "ఒక్కటే అనాది వస్తువు తక్కినవన్నీ అందులోనుంచి వుద్భవించినవని" చెప్పబడింది. కాని యిక్కడ అగ పరమాత్మతో పోల్చి చెప్పబడలేదు. కాబట్టి పరమాత్మ కంటె మరొక మూల కారణం వుందని భావించ బడ్డది. ఇందులో కూడా యీ ప్రపంచానికి జడ పదార్థమే కారణభూతంగా చూపబడ్డది. శ్వేతాశ్వ

తర ఉపనిషత్తులో శంకరాచార్యుడు కూడా కాదనటానికి వీల్లేనంత స్పష్టంగా భౌతికవాదం ప్రస్ఫుటంగా కనబడుతుంది. చివరకు శంకరాచార్య డంతటివాడు కూడా వీటన్నిటి ఆధారంతో బయలుదేరిన భౌద్ధ మతాన్ని యెదుర్కొనటానికి యేమీ చేయలేక భౌతికవాద సహాయం కోరవలసి వచ్చింది.

హిందూ తత్వశాస్త్రంలో 'వేదాంత తత్వవిచారం' ప్రధానభాగంగా యెంచబడుతువుంది. వేదసారమంతా యిందులోనే వున్నట్లుగా భావించబడుతూవుంది కాని వేద ప్రమాణంతో బయలుదేరిన యీతత్వ విచారాన్ని తత్వశాస్త్రంగా పరిగణించటానికి వీల్లేదు యదార్థంగా ఆలోచిస్తే యిది ఆధ్యాత్మిక వాదంలో ఉన్నతదశ అని చెప్పవచ్చు అందుకనేయిది మత సంబంధమైన సరిహద్దులను దాటి భౌతిక పొలిమేరలలో తిరుగుతుంది. కాని యదార్థంగా యిది భౌతికవాదంకాదు. తర్కబద్ధమై 'ఏకత్వ సిద్ధాంతం (దేవుడు వొక్కడే మూలకారణం) నుంచి దానికి భిన్నమైన సారాంశం తేల్చటానికి వీలుండదు కాని వేదాంతతత్వ విచారం యీసిద్ధాంతాన్ని త్రోసివేసి మతానికే భంగం కలిగిస్తుంది. యీవేదాంత తత్వవిచారం లోని భౌతికవాదం శంకరభాష్యంలో ప్రస్ఫుటంగా కనబడుతుంది వేదాంత తత్వవిచారంలోని 'ఏకత్వ' సిద్ధాంతాన్ని వేదకాలంలో ప్రచారంలో వున్న తాంత్రిక కర్మలతోనూ, మూఢ విశ్వాసాలతోనూ తృప్తిచెందక భౌతికవాద దృక్పథంతో అభివృద్ధి చెందసాగిన తత్వశాస్త్రాన్ని యెదుర్కొనటానికి బ్రాహ్మణ జాతికిచెందిన విజ్ఞానులు సృష్టించారు.

వేదమతం మీద తిరుగుబాటు చివరకు బౌద్ధమతంగా పరిణమించి ఆమతాన్ని నాశనంచేసి, కొన్నివందల సంవత్సరాల వరకుసంఘానికి బ్రాహ్మణాధికారంనుంచి విముక్తి కలిగించింది వేదాంత సూత్రాలను అర్థం చేసుకుంటే అవి బౌద్ధమతాన్ని యెదుర్కొనటానికే రచించబడ్డట్లు తెలుస్తుంది, కాబట్టి అవి ఉపనిషత్తుల్లో చూపబడ్డ భావ పరిణామ ఫలితం కాదని చెప్పవచ్చు. ఉపనిషత్తుల కాలానికి, వేదాంత సూత్రరచనా కాలానికి మధ్య అనేకవందల సంవత్సరాలు గడిచివుంటవి ఆకాలంలోనే ప్రాచీన తత్వశాస్త్రం కణాద, కపిల, మొదలైన వారి భౌతిక వాద సిద్ధాంతాలతోనూ, తరువాత బౌద్ధమతం, జైన మతంయొక్క హేతువాద

తోనూ అభివృద్ధి చెందింది. బౌద్ధమత విజయం, తరువాత సంఘంమీద బౌద్ధమత ప్రభావం చూస్తే ఆధ్యాత్మిక వాదానికి చెందిన వేదాంతులు భౌతిక వాదాన్ని, హేతువాదాన్ని కొన్నివందల సంవత్సరాల వరకూ యెదుర్కొనలేక పోయ్యారని తేలుతుంది బౌద్ధవిప్లవం దెబ్బతిన్న తరువాతనే తిరిగి ఆధ్యాత్మిక వాదం పునరుద్ధరించబడింది. వేదాంత సూత్రాలు క్రీస్తుపూర్వం 4వ శతాబ్దానికి ముందు రచించబడినట్లు కనబడదు. ఆసమయంలోనే బౌద్ధమతం బాగా వ్యాప్తిచెంది బ్రాహ్మణాధికారాన్ని యెదిరించ గలిగింది. వేదాంత సూత్రాల్లో హెచ్చుభాగం బౌద్ధమతాన్ని నాశనం చేయటానికే రచించ బడ్డట్లు తెలుస్తుంది. బౌద్ధమతానికి సాంఖ్య, వైశేషిక సిద్ధాంతాలు ప్రాతిపదికగా స్పష్టంగా కనబడుతుంది బౌద్ధ జైన తత్వశాస్త్రజ్ఞులు కణాద, కపిల తత్వవేత్తల నాదర్శంగా తీసుకున్నారు.

వీరిద్దరూ దాదాపు వొకేకాలంలో వుద్భవించినా తారతమ్యాన్ని బట్టిచూస్తే యిందులో వైశేషికం, సాంఖ్యశాస్త్రం కంటె ప్రాచీనంగా కనబడుతుంది. చరిత్రాత్మకంగా గ్రీకుభౌతికవాద నిర్మాత కాలంలోనే (క్రీస్తు పూర్వం 8వ శతాబ్దం) ఈతత్వవేత్తకూడా వుద్భవించినట్లు బోధపడుతుంది. ఆతత్వవేత్తకూడా యిదేవిధంగా ప్రపంచానికి మూలంకనుక్కోటానికి అణు సిద్ధాంతాన్ని బోధించారు.

కణాదు అణుసిద్ధాంతంలోనికొన్నిముఖ్య సూత్రాలు—పదార్థమంతా అణువులచేత సృష్టించ బడుతూవుంది. వాటి, వాటి గుణాలను, సంయోగాన్ని బట్టి పదార్థం మారుతూవుంటుంది. పదార్థాన్ని యింకా విభజించటానికి వీలులేని భాగమే అణువు. అణువులే ప్రపంచానికి మూలకారణం: కారణం లేకుండా కార్యం జరగదు అణువులకు వినాశనం లేదు. అవి నాలుగు రకాలుగా వుండి నాలుగు గుణాలు కలిగి వున్నవి. ఒకే రకం, ఒకే గుణం కల అణువుల కలయిక వస్తూత్పత్తికి కారణభూతమౌతుంది. యీ కలయిక రెండు విధాలుగా జరుగుతూ వుంటుంది. ఒకటి—అణువుల్లోనే అంతర్భూతంగా వున్న సహజమైన భౌతికశక్తి. రెండోది బహిర్గతమైన దైవికశక్తి.

వివిధ వస్తువులు ఆ యా వస్తువుల స్వభావ ధర్మాన్నిబట్టి యేర్పడుతూ వుంటవి. వస్తువు అందులోవున్న కణ సంయోగాన్ని బట్టి యేర్ప

డుతూ వుంటుంది. ఏకస్వభావం గల కణములు కొన్ని ఒక దానితో వొకటి కలిసి వస్తు రూపం పొందుతెవి. కణములో వున్న స్వభావ ధర్మం వస్తువులో ద్వ్యాత్మక మౌతుంది. అదే ధర్మంతో వస్తువు తక్కిన వస్తువుతో సంయోగం పొందుతుంది. యీ ప్రపంచమంతా కణాలతో సృష్టించ బడింది. కాబట్టి దీనికి ఆద్యంతాలు వున్నవి. కారణం లేకుండా కార్యం జరగదు. కాబట్టి ప్రపంచ సృష్టికి అణువులు కారణం అణువులు (కణవిభజన) సంద్రలి ఆకారంలో వుంటవి. అణువులు ఒకదాని నుంచొకటి వేరైనప్పుడు, కదలిక లేనప్పుడు యేకార్యం జరగదు అప్పుడు అగోచరమైన శక్తివల్ల అణువులు సంయోగం పొంది కణాలుగా మారి, యీ ప్రపంచ సృష్టికి కారణ భూతమౌతవి. కణాలు యేర్పడటానికి అంగాలో వున్న అణువులే కారణ భూతం. యీ కలయికకు అగోచరమైన ఒక శక్తి కారణం.

యీ సిద్ధాంతంలో భౌతికతత్వం బాగా స్ఫురిస్తుంది. కాని స్వయం సంపూర్ణత్వం కలిగిన ప్రకృతికి మూల కారణం అంతర్గతమైన పదార్థ ధర్మం అని చెప్పుతూ బహిర్గతమైన, అగోచరమైన మరొక శక్తి కూడా కారణ భూతంగా చూపబడింది ఇక్కడ యీ రెండో కారణం అనవసరంగా కనబడుతుంది ఒకదానితో ఒకటి కలిసే గుణం అణువులలోనే అంతర్గతంగా వుంది. కాబట్టి అవి సంయోగం చెందటానికి బహిర్గతంగా మరొక అగోచర శక్తి అనవసరమౌతుంది. కాబట్టి వైశేషిక సిద్ధాంతం ప్రకారం అణువులకు సంయోగం పొందటానికి యితర సహాయం అక్కర్లేదు. సంయోగం పొందే స్వభావంఅణువుల్లోనే అంతర్గతంగానుంది "కార్యం (వస్తువు) కారణంలో యిమిడివున్న సంయోగ స్వభావాన్నిబట్టి యేర్పడుతూ వుంటుంది" అంటే సంయోగం అణువులయొక్క స్వభావధర్మం అణువులెప్పుడు చేతనావస్థలో (కదిలిక) వుంటవని కణాదుమహించ లేకపొయ్యాడు. కదిలిక లేకుండా అణువులు వేరు వేరుగా వుంటవనే భావనకు అగోచరమైన మరొకశక్తి ఆధారం కావలసి వచ్చింది. భాష్యకారుడైన ఉపాస్కరుడు యీలోటును తొలిగించాడు. అతడు పదార్థంలోవున్న 'సంయోగ' ధర్మం వల్ల వస్తు పరిమాణం చెందుతూ వుంటుందని రెండు అణువులకలయిక స్వభావ ధర్మమని నిరూపించాడు సూత్రాల్లో వుండవలసిన విషయాన్ని యీ భాష్య కారుడు స్పష్టపరిచాడు.

అనవసరమైన వేరేశక్తిని మూలకారణంగా భావించినా కణాదుని సిద్ధాంతం పరస్పర వైరుధ్యం వుందని త్రోసివేయ నక్కర్లేదు. దీనికి అప్పటి సాంఘిక వ్యవస్థను పరిశీలించ వలసివుంటుంది, ఇదేవిధంగా ఆధునికపాశ్చాత్య విజ్ఞాన నిర్మాతలైన కోపర్నికస్, గెలీలియో, డిస్కార్టస్, న్యూటన్ మొదలైన వారుకూడా భగవంతుని అన్నివిషయాలనుంచి దూరంచేసినా అప్పటి మతప్రాబల్యాన్నిబట్టి భగవంతునిపూర్తిగా వదలలేకపోయ్యారు. కణాదుడు తన సిద్ధాంతంలో అనవసరంగాచొప్పించిన యితరశక్తిని నిజంగా విశ్వసించాడా లేక సాంఘిక పరిస్థితులను బట్టి ఆవిధంగా చూపించాడా అనేది నేడు తేల్చవలసిన విషయంకాదు. ఒకవేళ అతడు యదార్థంగా విశ్వసించినా అతని సిద్ధాంతం పూర్తిగా భౌతిక వాదమని వొప్పుకోక తప్పదు.

కణాదుని సిద్ధాంతం ప్రకారం సాధారణంగాఅధ్యాత్మికవాదదృష్టితో చెప్పుకునే అర్థం ప్రకారం ఆత్మకు చోటులేదు, దీని ప్రకారం ఆత్మకు స్వతఃసిద్ధమైన జ్ఞానంలేదు.

జ్ఞానం అణుసంబంధం. ఆత్మ అణువులతో కలసినప్పుడు ఈగుణం(జ్ఞానం) ప్రస్ఫుట మౌతుంది. కణాదుడు ఈవిధంగా వాదిస్తాడు—ఒకవస్తువు కారణమైనప్పుడు ఆవస్తువులో వున్న గుణాలే కార్యంగా మార్పు చెందిన వస్తువులోకూడా తప్పనిసరిగా వుంటవి. కాబట్టి 'జ్ఞానవంతమైన చేతనం' పరమాత్మ ప్రపంచానికి కారణమైతే కార్యమైన ప్రపంచంలో కూడాజ్ఞానమనే గుణం తప్పనిసరిగా వుండాలి. కాని అలాలేదు. కాబట్టి చేతనం ప్రపంచానికి కారణం కాజాలదు అణువుల యొక్క విపరీత కలయికవల్ల మనస్సు (చేతనావస్థ) యేర్పడుతూవుంది. ఆత్మ కేవలం ప్రాణియొక్క ఉద్దీపన. ప్రాణి పదార్థ సంయోగంవల్ల యేర్పడుతూవుంటుంది. అణువులసంయోగం వల్ల యేర్పడిన ప్రాణి ఒకదశలో బహిర్గత ప్రపంచంతో వ్యవహరించే గుణాన్ని పొందుతుంది. అదే మనస్సు. వైశేషిక శాస్త్రం ప్రకారం 'ఆత్మ' వేటివల్ల యేర్పడుతుందో అవి ప్రాణికి కారణ భూతిమైన వస్తువులోనే అంతర్భూతంగా వుంటవి. వస్తువు అణువుల సంయోగంవల్ల కలుగుతూవుంటుంది. అణువులు నాలుగు విధాలు—భూమి, గాలి, అగ్ని, నీరు.

ఈవిధంగా ఆత్మజడపదార్థమని, చేతనంకాదని కణాదుడు నిరూపిస్తూ బహిర్గతమైన పరమాత్మ మూలకారణం అనేవాదన అనవసరం అని తేల్చి

వేస్తాడు అంటే పరమాత్మ ప్రపంచానికి మూలకారణం కాదని అతడే స్పష్టంగా చెప్పుతున్నాడు. మరొకచోట అణువులే ప్రపంచ సృష్టికి కారణం అనికూడా స్పష్టంగా చెప్పాడు. ప్రాచీన ఆధ్యాత్మిక వాదులు పరమాత్మను 'జ్ఞానంగా' భావించారు ఈవాదనను భౌతికవాదు లెదుర్కొన్నారు వాదన ప్రకారం ప్రపంచ సృష్టికి బహిర్గతమైన జ్ఞానం అనవసరంగా కనబడింది వారి భౌతిక వాదం ప్రకారం జడపదార్థం స్వయం—సంపూర్ణజ్ఞానవంత మైనది. పరమాత్మ లేక బహిర్గత శక్తిని జోడించటం సాంఘిక పరిస్థితులనుబట్టి జరిగివుంటుంది.

వైశేషిక శాస్త్రంలో ప్రకృతి పరిణామం కనబడటంచేత దాన్ని ఆధ్యాత్మికవాదులు శూన్యవాదమని ఖండించారు. యీ సిద్ధాంతం ప్రకృతి యెప్పుడూ మార్పు చెందుతూ వుంటుందని, వస్తువు లెప్పుడూ మార్పు చెందటంవల్ల పాత వస్తువులు నాశనం చెంది కొత్త వస్తువు లేర్పడుతూ వుంటవని బోధిస్తుంది. కాని పదార్థం నాశనం చెందదని కూడా యీ సిద్ధాంతంలో కనబడుతుంది,

గ్రీకు తత్వశాస్త్రజ్ఞుడయిన డెమాక్రిటోస్ యొక్క అణు సిద్ధాంతం కంటె కణాదుని అణుసిద్ధాంతం చాలావరకు భౌతికవాదాన్ని అంగీకరించి స్వయం సంపూర్ణత్వాన్ని చూపుతుంది. యిందులో ఒక దానితో ఒకటి కలిసే గుణం అణువుల్లో సహజంగా వుందని చూపబడింది. యిది లోపించటంచేత డెమాక్రిటోస్ సిద్ధాంతాన్ని అరిస్టోటిల్ తేలిగ్గా ఖండించ గల్గాడు. కణాదుని సిద్ధాంతం చాలావరకు దైవశక్తి (పరమాత్మ) నుంచి తప్పించుకోగల్గింది. (ఆ రోజుల్లో సృష్టికర్త వున్నాడనే వాదనకు చాలా బలంవుండి) వైశేషిక అణుసిద్ధాంతం తరువాత కొంతమంది తత్వశాస్త్రజ్ఞులకు ప్రాతిపదిక అయింది. వీరి సిద్ధాంతాలు చాలావరకు తత్వశాస్త్రంలో నడిచి ప్రాచీన భారత సంఘాన్ని వేదమతాధిపతుల నిరంకుశత్వం నుంచి తప్పించటానికి కొంతవరకు వుపకరించినవి. కాని గ్రీకు దేశంలో లాగా యిక్కడ సాంఘిక పరిస్థితులు అనుకూలంగా లేకపోవటం చేత తత్వశాస్త్రం బాగా అభివృద్ధి చెంది సంఘాన్ని పూర్తిగా మార్చగల శక్తి సంపాదించ లేక పోయింది. అధికారంతో పాటు విజ్ఞానం కూడా పీఠాధిపతులే గుత్తను తీసుకొనటం చేత శాస్త్రీయమైన హేతువాదంతో తత్వ

విచారం అభివృద్ధి చెందటానికి అవకాశం లభించలేదు. అవకాశం పొంది, అభివృద్ధి చెందుతున్న తత్వశాస్త్రాన్ని బ్రాహ్మణవర్గం నాశనం చేసింది.

వైశేషిక శాస్త్రంలో చాలావరకు భౌతికవాద ముఖ్యసూత్రాలు కన బడుతున్నా ఆ కాలంలో కపిలుని సాంఖ్యశాస్త్రమే విజ్ఞానవంతులను యెక్కువగా ఆకర్షించ గలిగి బాగా వ్యాప్తి చెందింది సాంఖ్యశాస్త్రం కేవలం భౌతికవాద దృష్టితో కాకుండా హేతువాద భూయిష్టమైన ప్రకృతి సిద్ధాంతంగా అభివృద్ధి చెందింది యిందులోకూడా చాలా వరకు భౌతికవాద దృష్టితో ప్రకృతి చర్చించబడ్డది. కపిలుడు భగవంతుని అస్తిత్వం తర్కబద్ధంగా నిరూపించటానికి వీల్లేదని వాదించాడు అందుకని యితడు నాస్తికుడని పేర్కొన బడ్డాడు. ప్రకృతియొక్క స్థిరత్వాన్ని గుర్తించటమే యితని సిద్ధాంతంలోని గొప్పతనం భావంతప్ప మరొకదానికి స్థిరత్వం లేదనే వాదనను సాంఖ్యశాస్త్రం పూర్తిగా ఖండిస్తుంది. కపిలుడు కొంతమంది తత్వశాస్త్రజ్ఞులతో చర్చిస్తూ "భావం వొక్కటే అస్తిత్వం కలిగివుంటుందన టానికి వీల్లేదు. ఎందుచేతననగా బహిర్గతమైన ప్రపంచం వేరేవున్నది" అని చెప్పాడు.

"ప్రపంచం లేకపోతే భావంవుండదు అప్పుడు అంతా శూన్యం" (ప్రథమ గ్రంథము 42. 43 సూత్రాలు )

ప్రమాణంగా తిసుకొనబడు విజ్ఞాన భిక్షుడు ఈసూత్రాలకు ఈవిధంగా అర్థం చెప్పాడు. "భావం వొక్కటే స్థిరమైనదికాదు. బహిర్గత వస్తువులుకూడ స్థిరమైనవని రుజువు చేయబడుచున్నవి. ఈ వస్తువులు లేక పోతే అంతా శూన్యంగా కనబడుతుంది. అప్పుడు భావం వుండటానికే వీల్లేదు భావనాశక్తి వల్లనే వస్తు స్థిరత్వం రుజువు చేయబడుతుంది. దీన్ని (భావనాశక్తి) మిథ్య అని వాదిస్తే భావంవుందనే భావనాశక్తి కూడా మిథ్యగా తేలుతుంది"

సాంఖ్య శాస్త్రంలోని యీసూత్రం ఆధునిక భౌతిక వాద సూత్రంతో (వస్తువునుబట్టి భావం వుంటుంది) యేకీభవిస్తుంది. ఆకాలంలో మతప్రచారకులు భగవంతునిసృష్టికర్తగాసమర్థించటానికిగాను యీవాదాన్ని ప్రచారంలో రాకుండా చేసారు. 'స్వప్నసమాన' మైన ఈప్రపంచాన్ని స్థిరమూ, అస్థిరమూ అని చర్చించటం అనవసరమని వారువాదించారు. దీన్ని

ఖండిస్తూ కపిలుడు యీవిధంగా వాదించాడు. "ప్రపంచం అస్థిరమైనది కాదు. దీనిస్థిరత్వాన్ని కాదంటానికి తగిన దృష్టాంతంలేదు. పంచేంద్రియాలు లేనిదాన్ని వున్నవనే మాటల్లో లేవు" ఇందులో ప్రపంచం స్థిరమైనదని స్పష్టంగానేవుంది. కాని యింకా స్పష్టంగా కపిలుడు మరొకచోట వాదిస్తాడు.

"శూన్యంనుంచి వస్తువు సృష్టించబడదు" (ప్రథమగ్రంథం 78 వ సూత్రం) దీంతో ఆధ్యాత్మికవాద పునాదులే కదలిపోతున్నవి భౌతిక ప్రపంచం ఒక అంతులేని కారణ-కార్య సంబంధంగా చూపించబడ్డది. యీ సంబంధం ప్రకృతిలోనే సహజంగా వుంది కాబట్టి దీనికి ప్రత్యేకించి మరొక సృష్టికర్త అనవసరం. దీనికి ఆదికూడాలేదు. వుంటే శూన్యం నుంచి వుత్పత్తి కావలసివస్తుంది. ఇది అసంభవం.

సాంఖ్యశాస్త్రంలోవున్న యీ భౌతికవాదం, సాంఖ్యశాస్త్రం అణువాదాన్ని వొప్పుకోకపోవటంచేత కొంతవరకు సంధిగ్ధావస్థలో పడవలసి వచ్చింది కానీ యిదేవాదం బాగా పరిశీలిస్తే సరియైన భౌతికవాదం అని తేలుతుంది. 'పరిమితిగల పదార్థం అనంతకోటి వస్తువులను పదార్థం కాజాలదు" వైశేషిక సిద్ధాంతం మాదిరిగా సాంఖ్యసిద్ధాంతంకూడ అన్ని వస్తువులకుమూల పదార్థం అణువుగానే సూచిస్తుంది కాని కపిలుడు అణువులన్నింటికీ అంతకంటె సూక్ష్మమైన సర్వం వ్యాపించిన మరొకటి ఉత్పత్తి పదార్థంగా సూచిస్తాడు అరిస్టోటిల్ (గ్రీక్ తత్వశాస్త్రజ్ఞుడు) కూడా యిదేవిధంగా సిద్ధాంతీకరిస్తాడు. ఆకాలంలో బాగా ప్రచారంలోవున్న సృష్టివాదాన్ని (భగవంతుడు కర్త అనేవాదం) కాదని నిరూపించటానికి కపిలుడు యీ వాదాన్ని చూపియుండవచ్చు యేదియేలావున్నా సిద్ధాంతం ఆధునిక భౌతికవాదంతో సరితూగుతూవుంది. ఆధునిక ... వాదంకూడా పదార్థంలో అంతిమభాగం అణువేకాదు, అంతకంటె సూక్ష్మతరమైనది వున్నదని నిరూపిస్తుంది.

కపిలుడు వస్తువు ఒకదాని వెనుక వొకటి సూచిస్తూ, 25 భాగాలుగా విభజిస్తాడు. ఇవి ఆత్మ, ప్రకృతి, మనస్సు, బుద్ధి, పంచేంద్రియజ్ఞానం, వాసనలు, ఆది భౌతిక పదార్థాలు మొదలైనవి. ఇవి వేరు వేరుగా విభజింపబడ్డా వీటన్నింటికి తిరిగి మూలం భౌతిక పదార్థంగానే అంగీకరించబడ్డది. ఆదిలో

జడపదార్థం కదలికలేని దానిగా భావించబడ్డది కాని ప్రకృతి స్థిరమైనదని, సంఘాణత్వం కారణ కార్యశక్తి కలిగివుందని అంగీకరించబడ్డది. "మూలానికి (వేరు) మూలం వుండదు. కాబట్టి మూలం మూలంలేనిది" (ప్రవచనగ్రంథం 114, 115 సూత్రాలు) యీవిధంగా జడపదార్థమే ఆది కారణంగా భావించబడ్డది మనస్సు, బుద్ధి, ప్రకృతిలోనివే కాబట్టి అవికూడా భౌతిక వాద సిద్ధాంతంలోనే చేర్చబడ్డవి, ఆత్మవొక్కటే జడపదార్థానికి వేరుగా చూపబడ్డది కాని జడపదార్థమే కారణ కార్యమని అంగీకరించినప్పుడు యీ ప్రత్యేకత అనవసరం. ప్రకృతి పరిమాణాన్నిబట్టి పదార్థ అస్థిత్వం నిరూపించ బడ్డది. దానికి స్థిరత్వం వుందని అంగీకరించ బడ్డది 'వైశేషిక, న్యాయ' శాస్త్రాల్లో అణువు మూలపదార్థంగా చూపబడ్డది. కపిలుడు అంతకంటె సూక్ష్మతరమైన మరొక పదార్థంవుందని, దాన్నే అచేతనా వస్థలోవున్న ప్రకృతి అని నిర్వచించాడు.

సాంఖ్యశాస్త్రం ప్రకారం ప్రకృతి త్రిగుణాత్మకంగా(సత్వగుణము, రజోగుణము తమోగుణము) నిర్వచించబడ్డది. కాగా ఇవే ప్రకృతి పరిణామానికి ఆధార భూతములని సూచించబడ్డది. సుఖ, దుఃఖము అణువు యొక్క గుణములు కావు. యీభావనతో అణువాదము త్రోసివేయబడ్డది. అస్థిత్వంగల ప్రతి వస్తువులోనూ వీటిసంబంధమైన గుణాలు కనబడుతూనే వుంటవి. కాని యిక్కడవొక ప్రశ్నఉదయిస్తుంది. యీ గుణాలన్నింటికీ కారణమేంటి? కపిలుని సిద్ధాంతం ప్రకారం శూన్యంనుంచి యేదీ వుద్భవించదు. కాబట్టి యీ చిక్కునుంచి బయటపడటానికి కపిలుడు జడ పదార్థం అచేతనావస్థలోనే త్రిగుణాత్మకమని నిర్వచించాడు. అణువాద సిద్ధాంతం కూడా యిదే విధంగా అణువు త్రిగుణాత్మకమని చెప్పుతుంది కపిలుడు అణువాదాన్ని త్రోసివేయటంతో ప్రకృతి యొక్క పదార్థ తత్వం కూడా మూలం కాదనే వాదనకు రావలసివస్తుంది. అప్పుడు మూల కారణం పరమాత్మ లేక శూన్యం అని చెప్పవలసి వస్తుంది. కాని కపిలుని భావం యిదికాదు. అందుకనే అతడు అణు సిద్ధాంతాన్ని త్రోసివేసినా ప్రకృతి యొక్క పదార్థ తత్వాన్ని నిరూపించటానికి చివరకు మళ్ళీ యీ విధంగా అంటాడు.

"మనుష్యుని కొమ్ములాగా లేనిదాన్నుంచి యేదీ వుద్భవించదు"

"యేదైనా వుద్భవించటానికి ముందు పదార్థం అవసరం" (ప్రథమ గ్రంథం సూత్రాలు 114, 115)

సాంఖ్యశాస్త్రం ప్రకారం పదార్థం లేకుండా యేమీ జరగటానికి వీల్లేదు. పదార్థం లేకుండా యెక్కడ బడితే అక్కడ వస్తువు వుద్భవించటానికి అవకాశం వుందంటే అది సాంఖ్యశాస్త్రానికే విరుద్ధం. సాంఖ్య సిద్ధాంతం 'చేతనావస్థలోవున్న పదార్థం' అనే వాదనకు దారి తీస్తుంది. కాబట్టి యిది అణువాదాన్ని త్రోసివేయటం వల్ల భౌతికవాదాన్నే త్రోసి వేస్తుందనుకో కూడదు. భౌతిక ప్రపంచానికి తర్కబద్ధమైన ఒక పద్ధతి చూపించటానికే యిది చేయబడ్డది సర్వవ్యాప్తి చెంది సహజ గుణాలు కలిగిన పదార్థం అని చెప్పటం చేత ఆది కారణం యెవరనే ప్రశ్న వుదయించదు. దీన్నిబట్టి వేరే సృష్టికర్త అనవసరం అవుతుంది.

సాంఖ్యసిద్ధాంతంలోని 'ప్రధాన' శబ్దం యొక్క భావాన్ని, గుణాల్ని అర్థంచేసుకుంటే ఆ సిద్ధాంతం తప్పనిసరిగా భౌతికవాదానికి దారి తీస్తుందని వొప్పుకోక తప్పదు కపిలుడు ఒకచోట నీరు లేక (తల్లి స్తనం నుంచి) పాలు వాటంతటవి బయలు దేరినట్లు "ప్రధాన" కూడ అజ్ఞాన పూరితమైనా, దానంతటది కదిలే స్వభావం కలిగివుంది. (కపిలుడు సర్వ వ్యాప్తి, సహజగుణాలు కలిగిన పదార్థాన్ని 'ప్రధాన' మని పేర్కొన్నాడు) కాబట్టి యిక్కడ 'ప్రధాన'లో కదలిక సహజగుణమని చూపబడింది. దీన్నిబట్టి సృష్టికర్తకాని, పరమాత్మ కాని అనవసరం అని తేలుతుంది.

పరమాత్మ (పురుష)ను గురించి అది ఆదికారణం కాదని, అదికూడా అనవసరమని, భౌతికపదార్థమే మూలకారణమని మరొకచోట స్పష్టంగా చూపబడింది.

"పదార్థం, ఆత్మ రెండూ (ప్రకృతి, పురుష) సమ్మేళనం వల్లనే వస్తూత్పత్తి జరుగుతుంది. కాని ఆత్మ కారణం అని చెప్పటానికి వీల్లేదు. అది ప్రకృతికే చెందుతుంది. (ప్రథమ గ్రంథం 75 వ సూత్రం)

ఆత్మకు గుణాలులేవని, ప్రకృతియే అన్ని గుణాలు కలిగి మూలకారణం అని చూపిన తరువాత కపిలునికి యీరెండూ అభేదం- ఒకటేనని నిరూపించటం కష్టసాధ్యమైనది. ప్రకృతి అన్నింటికి మూలాధారం అనుకున్న

తరువాత ఆత్మ అనవసరం. కాని ఆత్మకూడా వున్నదనే విశ్వాసం ఆకాలంలో ప్రబలంగా వుండటంచేత అదిలేదని కాని లేక వుంటే అదీ, ప్రకృతి రెండూ వొకటేనని నిరూపించలేక కపిలుడు సందిగ్ధావస్థలో పడ్డాడు. కాని అతని వాదన ఆత్మ అనవసరమనే తేలింది. జ్ఞానం, బుద్ధి, మనస్సు మొదలైనవన్నీ ఆత్మనుంచి వేరుచేసి ప్రకృతికి సంబంధించినవని చూపబడ్డవి. అట్టి పరిస్థితుల్లో ఆత్మచేసే పనిలేదు. దాని గుణాలనుబట్టే అది నిర్గుణం, నిరాకారం. కాబట్టి అది యితర పదార్థంతో కలిసే అవకాశమేలేదు. యీ విధంగా 'ప్రకృతి, పురుష' యీ రెండింటికీ యెక్కడా సమానత్వం కాని సంబంధంకాని లేదు. యీద్వైత్వం నుంచి బయటపడాలంటే ఆత్మ లేదని చెప్పుకోవాలి. కపిలుడు యీ ప్రయత్నంలో యెంత సఫలీకృతుడయ్యాడో చెప్పలేము. యిక్కడ అతని సూత్రాలు అంత స్పష్టంగాలేవు. కాని ఒకభాష్యకారుడు యీవిధంగా అర్థం చెప్పాడు.

"ప్రకృతి, పురుష యిందులో యేదిముందు, యేది వెనుక అనిప్రశ్నించటం పొరపాటు. ఇది విత్తనంముందా, చెట్టుముందా అనే ప్రశ్నలాంటిది. వీటికి మరొకటి మూలాధారంలేదు."

సాంఖ్య సిద్ధాంతం ప్రకృతి పురుషను (పదార్థం - ఆత్మ) యీసంబంధం చెప్పుకుంటే యిందులోవున్న వైరుధ్యం తొలగి యిది వస్తుభౌతిక వాదం అవుతుంది. యీరెండూ అనాది కారణాలనికాని లేక పురుష (ఆత్మ) ప్రకృతియొక్క గుణంఅని కాని అంగీకరించాలి అప్పుడు 'విత్తనం-చెట్టు' అనే తర్కం లోపభూయిష్ట మౌతుంది యిందులోవున్న లోపం తొలగిస్తే యిది 'ఏకత్వ' వాదానికి దారితీస్తుంది ప్రకృతి పురుష యీరెండింటిలో ఒకటి మరొక దానికి కారణం కావాలి సాంఖ్య సిద్ధాంతం ప్రకారం ఆత్మ నిర్గుణం, నిరాకారం కాబట్టి అది కారణం కాజాలదు. ఒకవేళ కారణం అని అంగీకరించితే ఆత్మ స్వభావానికే విరుద్ధం అవుతుంది. (గుణాలు, ఆకారంలేని' వస్తువు గుణాలు, ఆకారంకల వస్తువుకి కారణం కాజాలదు) కాబట్టి ప్రకృతియే కారణం అని చెప్పాలి. కపిలుని సిద్ధాంతం ప్రకారంకూడా ప్రకృతి స్వయం సంపూర్ణత్వం కలిగివుంది. యితరమైన ముఖ్యశక్తులన్నింటికీ ప్రకృతియే మూలకారణంగా చూపబడ్డది.

సాంఖ్య శాస్త్రంలో చర్చింపబడ్డ ఇంద్రియజ్ఞాన సిద్ధాంతంకూడా

చాలావరకు తత్వశాస్త్ర అభివృద్ధికి తోడ్పడింది కపిలుడు పూర్తిగా అనుభవాన్ని ఆధారం చేసుకొని శాస్త్రం నిర్మించాడు ఇంద్రియాలద్వారా పొందినజ్ఞానమే నిజమైనజ్ఞానమని కపిలుడు తర్కపూరితంగా నిరూపించాడు.

"అంతకుముందు తెలియనిదాన్నిగూర్చి తెలుసుకొనడమే నిజమైన జ్ఞానం. ఇందుకు ప్రమాణమే (సాక్ష్యము) మూలాధారం" (ప్రథమగ్రంథం 87 వ సూత్రం)

జ్ఞాన సముపార్జనకు ఇంద్రియాలు ప్రత్యక్ష, పరోక్ష ప్రమాణాలు మొదలైనవి ఆధార భూతములుగా పేర్కొనబడినవి. కపిలుని యీ పరోక్ష ప్రమాణమే తర్కశాస్త్రంలో వొకశాఖకు పునాది రాయిఅయింది. కాబట్టి శాస్త్రీయ బద్ధమైన హేతువాదానికి కపిలుడు ఆ కాలంలో మార్గదర్శకుడని చెప్పవచ్చును

యీ పై సూత్రానికి ఒక భాష్యకారుడు యీ విధంగా అర్థం చెప్పాడు.

"యే ఆధారం లేక సాక్ష్యం ద్వారా జ్ఞానం కలుగుతుందో (వస్తువును తెలుసుకొనుట) అది ఆ ఇంద్రియం ద్వారా ఆ వస్తువుతో పొందిన జ్ఞానమని చెప్పబడును"

ఇంద్రియాల ద్వారా జ్ఞానం సంపాదించే విషయంలో యిక్కడ సూత్రాలు స్పష్టంగా చెప్పబడ్డవి. ఆధునిక శూన్యవాదులు కూడా వేసే ప్రశ్నకు సమాధానంగా ఒక సూత్రం చెప్పబడ్డది.

"యేదైతే వస్తువులతో సంబంధం కలిగించుకొని దానికి సరియైన చిత్రాన్ని మాపగలుగుతుందో అదే ఇంద్రియ జ్ఞానం (ప్రథమ గ్రంథం 89 వ సూత్రం.)

యీ పంచేంద్రియాలు ప్రకృతి (పదార్థం)కి సంబంధించినవని వర్ణించబడ్డవి. ఇవి అసత్యాన్ని సత్యంగా (అనిత్యాన్ని నిత్యంగా) వర్ణించవు. కాబట్టి వాటి ఆధారంతో పొందిన జ్ఞానం సత్యబద్ధమైనది. యీ యింద్రియాల ద్వారా ప్రకృతి యొక్క అస్థిత్వం తెలుసుకొనబడుతుంది. కాబట్టి అది నిత్యమని నిరూపించ బడుతుంది.

ప్రాచీన తత్వశాస్త్ర పరిణామమే రాను, రాను బౌద్ధమతంగా అభివృద్ధి చెంది బ్రాహ్మణమతం యొక్క పునాదులను కదలించి వేసింది. బౌద్ధ

మతం వేదాధికారాన్ని తిరస్కరించినది. వేదకాలంలోవున్న యజ్ఞ, యాగాదులను, వాటికోసం జరిపే బలి మొదలైన హింసాకాండను పూర్తిగా ఖండించింది మూల కారణం అనుకుంటున్న భగవంతుని అస్థిత్వం, ఆత్మ సిద్ధాంతం మిథ్య అని బౌద్ధమతం వాదించింది. అప్పటినుంచే తత్వశాస్త్రం మూఢవిశ్వాసాల నుంచి, పరమాత్మనుంచి విముక్తి చెంది, నిజమైన తత్వశాస్త్రంగా అభివృద్ధి చెందటానికి అవకాశం యేర్పడ్డది.

ప్రాచీన కాలంలోని నిహిలిజాన్ని (శూన్యవాదాన్ని) ఆధారం చేసుకొని బౌద్ధమతంలోని శూన్యవాదశాఖ అభివృద్ధి చెందింది. వైశేషిక సాంఖ్య సిద్ధాంతాలు వెనుకనుంచీ వస్తున్న హేతువాదాన్ని ఆధారం చేసుకొని బౌద్ధమతంలోని సర్వాస్థిత్వవాద (యదార్థవాదులు) శాఖ అభివృద్ధి చెందింది. ప్రకృతి యెప్పుడూ పరిణామావస్థ చెందుతూ, మారుతూ వుంటుంది అణువుల కలయిక విడుబాటు వలన యీ మార్పు సంభవిస్తూ వుంటుంది. యీ మార్పులో పాతవస్తువులు నశించి కొత్త వస్తువులు యేర్పడుతూ వుంటవి యీ ప్రకృతి పరిణామావస్థ వైశేషిక సిద్ధాంతంలో కొంతవరకు చర్చించ బడ్డది తరువాత కపిలుడు దానికి స్పష్టమైన ఆకారాన్నిచ్చాడు. దానాధారం చేసుకుని బౌద్ధమతంలోని శూన్యవాద శాఖ బయలుదేరింది.

కాని బౌద్ధమత శూన్యవాదులు వెనుకటి శూన్యవాదులు మాదిరిగా ప్రతివస్తువునూ అస్థిత్వం 'శూన్యం'గా నిరూపించలేదు. వారు మొత్తం ప్రకృతి అంతా అంతులేని ఒక గొలుసుగా చిత్రించారు. వారు సర్వకాల సర్వావస్థలయందు చంచలరహితమని భావించే వస్తువును (పరమాత్మ) మిథ్య అని ఖండించారు. వారి సిద్ధాంతం వేదాల్లో చూపబడ్డ ఆధ్యాత్మిక వాదానికి పూర్తిగా వ్యతిరేకం. బౌద్ధమతంలో వున్న మూడు శాఖలు కూడా (మూడవది విజ్ఞానవాదశాఖ) ప్రతివస్తువు యొక్క అస్థిత్వం ఆద్యంతములు లేని ప్రకృతి పరిణామంలో తాత్కాలికం అని బోధించినవి. యీ వాదం హిందూమత వేదాంతంలోని ప్రధాన సిద్ధాంతాన్ని త్రోసివేసింది

వైశేషిక, సాంఖ్యసిద్ధాంతాలను ఆధారం చేసుకొని బుద్ధుడు చేతన జడపదార్థాల సంబంధాన్ని తలక్రిందులు చేసాడు. యీ సంబంధం తలక్రిందులు చేయటంచేత వాటి గుణసంబంధం కూడా తలక్రిందులైంది. ఆత్మ దేహసంబంధమైనదేనని, కాబట్టి ప్రకృతికి లోబడే ఆత్మవుంటుందని బుద్ధుడు

వాదించాడు. బుద్ధుని సిద్ధాంతం ప్రకారం మానవుని పరిణామ దశలో పొందే ''సంస్కారాలు'' స్థిరంగా నిలచివుంటవి. ఇవి మానవుడు తాను నిత్యం జరిపే ప్రవర్తనలో పొందిన అనుభవ ఫలితంగా యేర్పడుతవి. యీ 'సంస్కారాలు' కూడా కారణ - కార్యరూపంలో పనిచేస్తూవుంటవి. ఆత్మదేహసంబంధం అని చెప్పటంచేత ఆత్మ అస్వతంత్ర అని తేలుతుంది. కాబట్టి ఆత్మ మానవుని నిత్యజీవితంలోని కార్యకలాపాలకు కర్త (కారణం) కాజాలదు. కాగా అవే దానికి కారణంగా యేర్పడుతవి. ఇక్కడ బుద్ధుడు ఆత్మఅనేది ప్రత్యేకంగాలేదని 'సంస్కారమే' ఆత్మ అని బోధిస్తాడు.

కాని బౌద్ధమతంలోని భౌతికవాదం కొంతవరకు భావవాద మార్గంలో నడిచింది అయినా బ్రాహ్మణమతానికి యెదురుగా నిల్వగలిగింది శంకరాచార్యుడు కూడా చివరికి యీవిధంగా అనవలసివచ్చింది. ''అంతులేని ఆత్మలను (ఒక్కొక్క జీవి కొక్కొక్క ఆత్మ) సృష్టించే శక్తి గలిగిన 'గుడ్డికర్మ' (సంస్కారం) కూడా స్థిరత్వం సంపాదించింది'' 'ఆత్మ అస్వతంత్ర్యం, జడపదార్థంవల్ల ఆత్మ యేర్పడుతుంది. దానికి చేతనస్వరూపం లేదు' అనేవాదన బుద్ధునికి 'పరమాత్మ' (భగవంతుడు) లేడనే నమ్మకం కలిగించింది. జీవితసమస్యా పరిష్కారానికి భగవంతునిమీద విశ్వాసం బుద్ధునికి అనవసరంగా కనిపించింది. 'ఆత్మ' వుందని విశ్వసించినప్పుడే 'పరమాత్మ' (భగవంతుడు) వుందనే విశ్వాసం యేర్పడుతుంది. 'ఆత్మ' లేదనుకుంటే 'పరమాత్మ'ను చేరడానికే వీలులేదు.

బౌద్ధమతంలోని యదార్థవాదులు ప్రకృతి పరిణామానికి మొదట ఒక కారణం (వస్తువు) వుండాలనివాదిస్తారు. దీనిప్రకారం నిరాకార వస్తువు (చేతనం) కారణభూతం కాజాలదు. 'యదార్థవాదం'లో నుంచి 'శూన్యవాదం' బయలుదేరింది. శూన్యవాదం ప్రకారం ప్రతిదీ నాశనం అవుతుంది. కాబట్టి 'శూన్యం' ప్రతిదానికీ కారణమని తేల్చబడింది. శంకరాచార్యుని కథనం ప్రకారం వారు (శూన్యవాదులు) యీ విధంగా బోధించారు. "మార్పులేని వస్తువు కారణభూతం కాజాలదు. మార్పు వుంటే అది నాశనం కాకతప్పదు. కాబట్టి అస్తిత్వం శూన్యంనుంచే బయలుదేరుతుంది.'' బౌద్ధమతసూత్రం యీ విధంగా వుంది. ''కార్యం ఫలించటానికి కారణం ముందు నాశనంకావాలి''. చెట్టుఆకారం యేర్పడేముందు దానికి కారణ

భూతమైన విత్తనం విత్తనంగా వుండక మార్పుచెంది విత్తనరూపంలో నాశనం చెందుతుంది. అదేవిధంగా ప్రకృతి సృష్టిఅంతా దానంతటదే శక్తికలిగి కారణ కార్యవస్తువుగా వూహించబడ్డది కాబట్టి యధార్థవాదులు చెప్పే కారణవస్తువుకి, శూన్యవాదులు చెప్పే 'శూన్య' సిద్ధాంతానికి తేడాలేదు.

వైశేషిక సిద్ధాంతంలోని అణువాదాన్ని ఆధారం చేసుకొని బౌద్ధ మతంలోని భౌతికవాదం బయలుదేరింది. ఆ వాదాన్ని క్లుప్తంలో యీ విధంగా చెప్పవచ్చును. "అస్తిత్వం రెండువిధాలు. ఒకటి బహిర్గతం (పదార్థ సంబంధం) రెండోది(అంతర్గతం)మానసిక సంబంధం కాని మనస్సు అనగానే అది అణువుల కలయిక ఫలితం అని తేలుతుంది 'భూత, భౌతిక' పదార్థాల వల్ల బహిర్గత ప్రపంచం,శరీరావయవాలు యేర్పడుతున్నై. బహిర్గత ప్రపంచం 'భూత' పదార్థం అంటె భూమి, నీరు, అగ్ని, గాలి ఇవి ఆ యా అణువుల సంయోగం వల్ల ఆ యా పదార్థములుగా యేర్పడుతున్నవి శరీరావయవములు 'భౌతిక' పదార్థం అంటే భూతపదార్థాలు ఒకదానితో ఒకటి కలియటం చేత యేర్పడుచున్నవి.

మనస్సు, మానసిక సంబంధమైన ప్రేరేపణ అణువుల కలయికమీద ఆధారపడి వుండటంచేత అంతర్గత అస్తిత్వానికి స్వతంత్రం లేదు. ఇది బహిర్గత అస్తిత్వాన్ని (భౌతికపదార్థాన్ని) ఆధారం చేసుకొని పెరుగుతుంది. 'అంతర్గత' అస్తిత్వం ఐదువర్గాలుగా (స్కంధములు) విభజింపబడి దీనికి ప్రత్యేకవ్యక్తిత్వం లేదనికూడా చూపబడింది అవి— Sensation, Knowledge feeling,verbal knowledge, impression ఇవి అన్నీ శరీరంలో అణువుల కలయికద్వారా జరిగే భౌతిక పదార్థసంయోగం వల్లనే యేర్పడుతున్నవి బౌద్ధమతంలోని యేశాఖకూడా యీ అణువుల కలయికను యే ఆత్మ లేక పరమాత్ముడో, కారణభూతం అని అంగీకరించదు. పైగా యీ అణుసంయోగం దానంతటదే జరుగుతుందని, యీ సంయోగ ఫలితంగా అంతర్గతవాసనలు(స్కంధములు)యేర్పడు తున్నవని బోధిస్తుంది

కాని బౌద్ధసిద్ధాంతంలో ఒకలోటుకూడ లేకపోలేదు అది 'నిర్వాణ' వాదం. సంఘంలో అప్పుడున్న దారిద్ర్యం, కష్టాలు, దుఃఖం మొదలైన వాటిఫలితంగా యేర్పడ్డ మానసికబాధలే యీ 'నిర్వాణ' సిద్ధాంతానికి కారణభూతమై వుండాలి. ప్రపంచం పూర్తిగా దుఃఖమయమైనది.

దాన్నుంచి తప్పించుకొని దూరంగా వెళ్ళాలి.'' యీ వాదం బౌద్ధమతం లోని తక్కిన తత్వశాస్త్రానికి విరుద్ధంగా వుంది. శంకరాచార్యుడు యీ వైరుధ్యాన్ని ఆధారంచేసుకొని బౌద్ధమతాన్ని ఖండించాడు. ''అణువులు కాని, స్కంధములు కానీ వాటంతటవే కార్యానికి గమనశీలవని అనటానికి వీల్లేదు. అది వాటి సహజ స్వభావమని వాదిస్తే అవి సర్వకాల సర్వావస్థలయందు చలన స్వభావాన్నే కలిగివుంటవని అంగీకరించవలసి వస్తుంది'' నిర్వాణంఅంటే చలనరహితం కావటం బౌద్ధసిద్ధాంతం ప్రకారం ప్రకృతిలో యీ చలన స్వభావం సహజంగానేవుండి దానంతటదే కారణ - కార్య తత్వాన్ని పొంది వుంది. కాబట్టి శంకరాచార్యుడు సూచించినట్లుగా భౌతికప్రపంచం చలనరహితం కాజాలదు. దానికి ఆద్యంతములు లేవు.

యీ 'నిర్వాణ సిద్ధాంతం' బౌద్ధమతంలోని శూన్యవాద శాఖకు చెందినది. సంఘంలోవున్న పరిస్థితులు పోయి నూతన పరిస్థితులు యేర్పడటానికి యీవాదం బయలు దేరింది బౌద్ధమతంలోవున్న అభ్యుదయ భౌతికవాదం వల్ల యీవాదం కొంతకొంతవరకు విజయవంతంగా కనబడింది. కాని తెను వాతయిందులోవున్న శైథిల్యమే చివరకు బౌద్ధమతంలోని భౌతికవాదాన్ని కప్పివేసింది.

అప్పటి సాంఘికపరిస్థితుల కారణంగా బౌద్ధమతం సృష్టించబడ్డది. ఇది భౌతికప్రపంచంయొక్క వాస్తవికతత్వాన్ని అంగీకరించేవారి సిద్ధాంతం. అప్పటి పరిస్థితుల్నిబట్టి సంఘంలో వ్యాపించిన కష్టాలే వారికి వాస్తవంగా కనబడ్డవి. బౌద్ధమతం విజయానికి చాలావరకు క్షత్రియ వర్ణసహాయం కూడా లభించింది. అప్పటి ఆచార, వ్యవహారాలను త్రోసివేసి నూతన వ్యవస్థకోసం, అధికారంకోసం కృషిచేస్తున్న వారందరికీ బుద్ధుడు ప్రాతినిధ్యం వహించాడు. అనేకమంది వర్తకులుకూడా బుద్ధుని శిష్యులయినట్లు చరిత్రి రుజువుచేస్తుంది.

శంకరాచార్యుడు బుద్ధుని భావవాదిగా వర్ణించాడు. ఇది కొంతవరకు నిజమే అగ్రవర్ణాలను (క్షత్రియ, వైశ్య) సహాయభూతంగా తీసుకొనటమే బుద్ధుడు భావవాదిగా పరిణమించటానికి కారణమైంది. బ్రాహ్మణ మతం బోధిస్తున్న నిత్యస్వరూపాన్ని (పరమాత్మ) త్రోసివేయటానికి దీని వ్యతిరేకవాదులు (బౌద్ధులు) అనిత్యవాదాన్ని (యేవస్తువు స్థిరంగా వుండదు)

ప్రచారం చేయసాగారు. యీ వాదం రాను, రాను భౌతికప్రపంచానికే కాక మానసిక అవస్థకూ్కడా వినియోగించ బడ్డది. సంఘంలోవున్న సుఖము, విచారము మొదలైన బాధలన్నీ కూడా తాత్కాలికమేనని (అనిత్యం) బోధించసాగారు. ఇక్కడే బుద్ధని తత్వశాస్త్రం భౌతికవాదం నుంచి భావవాదంగా మారింది తాత్కాలికం (అనిత్యం) అనుకున్నది వాస్తవికం (నిత్యం) కాజాలదు కాగా సుఖం, విచారం మొదలైనవి కేవలం భావాలు. అవి మానసిక సంబంధమైనవి. వాటికి ప్రత్యేకించి భౌతికపదార్థం కారణభూతం కాజాలదు. కాబట్టి అవి భావరూపంలో తప్ప వాటికి ప్రత్యేక అస్థిత్వంలేదు యీవాదం బుద్ధని వాస్తవిక వాదానికి వ్యతిరేకంగా వుంది. కాని దీనివల్ల బుద్ధని తక్కినసిద్ధాంతం అంతా త్రోసి వేయటానికి వీల్లేదు. "యీ ప్రపంచానికి ఆదిలేదు. అనేకవిధంగా భావాలు కూడా ఒకదానొ్కకటి ఆధారంచేసుకొని అనాదినుంచీ వస్తూనే వున్నవి. (ఇక్కడ భావంకూడా అనాదికారణంగా చూపబడ్డది) వాటికి అవే కారణ కార్యభూతమై అస్థిత్వాన్ని పొందుతున్నవి. కాబట్టి బహిర్గత ప్రపంచం వాటికి కారణం కానక్కర్లేదని" వారు వాదించారు.

బౌద్ధమతంలోవున్న యీ వాదం చివరకు సంఘంలో అధికారాన్ని చేపట్టి నూతన వ్యవస్థను యెదిరించినవారికి (బ్రాహ్మణవర్ణం) సహాయ భూతమైంది. యీలోటువల్ల తిరిగి బౌద్ధమతం బ్రాహ్మణమత ప్రభావానికి గురికావలసి వచ్చింది. బౌద్ధమతంలోని మహాయాన శాఖ చివరకు హిందూ మతశాఖగా పరిణమించింది. కాని బౌద్ధమతం చాలావరకు బ్రాహ్మణమత ఆధ్యాత్మికతత్వంనుంచి దూరంగానే వుంది. బౌద్ధమతం యెప్పుడు ప్రకృతి అస్థిత్వాన్ని త్రోసివేయలేదు

కాని బౌద్ధమతంలోవున్న 'నిర్వాణవాదం' చివరకు దానిపతనానికే కారణభూతమైంది దీన్ని ఆసరాగా తీసుకొని బ్రాహ్మణమతం తిరిగి అధి కారాన్ని సుస్థిరం చేసుకొంది శంకరాచార్యుడు యీ వైరుధ్యాన్నిచూపి బౌద్ధమతాన్ని ఖండించాడు. బౌద్ధమతంవల్ల కదలిపోయిన పునాదులు తిరిగి స్థాపించబడ్డవి. మతాధిపతులు (బ్రాహ్మణవర్ణం) తిరిగి అధికారాన్ని చేపట్టారు

జైనసిద్ధాంతంలో చాలావరకు ప్రకృతిగమనం వర్ణించబడ్డది. జైన తత్వశాస్త్రజ్ఞులు ప్రకృతియొక్క గతి - తర్క సిద్ధాంతం చాలావరకు ముందుకు తీసుకొని వెళ్ళారు. శంకరాచార్యుడు దీన్ని 'స్థాయిలేని హేతు వాదం' అని ఖండించాడు. కల్పితవస్తువుని సృష్టించిన తర్కవాదులకు యిది నిజంగా స్థాయిలేని వాదంగా కనబడుతుంది. నిత్యం అనుకొన్న దాన్ని (పరమాత్మ) కాదని చూపించినప్పుడు దానికాధారంగా నిర్మించిన సిద్ధాంతాలు, మూలసూత్రాలు అన్నీ పునాదులతోసహా కదలక మానవు.

జైనతత్వ శాస్త్రజ్ఞులు ఒకేవస్తువు పరస్పర విరుద్ధగుణాలను (వున్నది లేదు, స్థిరం, అస్థిరం) కలిగి వుంటుందనే వాదాన్ని లేవదీసారు. యీవాదం ప్రకారం యేదీ స్థిరంగా వుంటానికి వీల్లేదు. కాబట్టి 'పరమాత్మ' అస్తిత్వం కూడా యీసిద్ధాంతానికి గురికావలసి వచ్చింది. దీన్ని శంకరాచార్యుడు యీవిధంగా ఖండిస్తాడు. ''పరమాత్మ, మోక్షం 'వున్నవి, లేవు, స్థిరం, అస్థిరం' అని వాదిస్తే అవి పొందడానికి యెవరూ ప్రయత్నించరు.''

జైనులు ఆత్మవుందని విశ్వసించారు. కాని వారిదృష్టి ప్రకారంఆత్మ యెప్పుడూ మారుతూ వుంటుంది. వారి సిద్ధాంతం ప్రకారంఆత్మ అంతులేని అణువులచే (ఆత్మ-అణువులు)సృష్టించబడ్డది అది యెప్పుడు పెరుగుతూ తరుగుతూ వుంటుంది కాని అంతమాత్రంచేత అది అశాశ్వతం కాదు ఒకే వస్తువు యెప్పుడు శాశ్వతం, అశాశ్వతంగా వుంటుంది. వుదాహరణకు నీరు యెప్పుడు ప్రవహిస్తూ పోతున్నా ప్రవాహం యెప్పుడూ అక్కడే వుంటుంది. అదేవిధంగా ప్రపంచంలో జరిగే మార్పులు అశాశ్వతంగా కనబడినా ప్రపంచం శాశ్వతం.

ప్రాచీన యుగంలో తరువాత మాధ్యమిక యుగంలో యెప్పుడు కూడా బ్రాహ్మణ అధికారాన్ని పూర్తిగా త్రోసివేసి, మరొకవర్ణం అధికారానికి వచ్చి నూతన తత్వశాస్త్రాన్ని బోధించే పరిణామదశ హిందూ సంఘంలో జరగలేదు.

ప్రాచీన కాల తత్వశాస్త్రంలో, అది భౌతికవాద మయినా, ఆధ్యాత్మిక వాదమైనా ముఖ్యంగా యీ ప్రపంచంలోని జీవితబాధనుండి విముక్తి చెందే పరిశోధన జరిగినట్లు కనబడుతుంది. సంఘం క్రమంగా కృశించిపోయి ఛిన్నా భిన్నమాటమే యిలాంటి ఆలోచనకు కారణం. మహాభారతం

చివరిలో చూపినట్లుగా అప్పటి సాంఘిక పరిస్థితులు యేవిధంగా చూచినా చాలా హీనస్థితిలో వున్నట్లు కనబడుతుంది. అలాంటి పరిస్థితులు తప్పని సరిగా అసంతృప్తికి, తిరుగుబాటుకి త్రోవతీయక మానవు. మహాభారతం ప్రకారమే అప్పటి క్షత్రియజాతి నిర్వీర్యమై దానికంటె యితర జాతులు కొన్ని బలవత్తరమై క్షత్రియజాతిని యెదిరించినట్లు కనబడుతుంది ఆ జాతులు సంఘంలో ప్రబలివున్న అసంతృప్తి కారణంగా తిరుగుబాటు చేసినట్లు కూడా కనబడుతుంది. కానివారు ఒక ప్రత్యేకమైన ఆదర్శాన్ని చేపట్టి, వున్న వ్యవస్థను తొలగించి నూత్న వ్యవస్థ కోసం తిరుగుబాటు చేసినట్లు కనబడదు.

అప్పటి కాలంలో సంఘంలో నిరాశ ప్రబలంగా వ్యాపించింది. యీభావం అప్పటి తత్వశాస్త్రంలో ప్రతిబింబించింది. అసలు ప్రపంచమే ఆబాధలకు కారణంగా కనుపించింది. ప్రకృతిని జయించడమే బాధలనుంచి విముక్తి చెందుట అని వారి దృష్టికి తగలలేదు. యీ 'బంధనం' నుంచి (భౌతిక ప్రపంచం) దూరంగా పారిపోవడమే విముక్తి చెందుట అని వారి మనస్సుకు తట్టింది. అందుకనే మన ప్రాచీన తత్వశాస్త్రం నిజమైన తత్వశాస్త్రంగా అభివృద్ధి చెందలేక పోయింది. సర్వసంగ పరిత్యాగం వల్ల ప్రకృతిని జయించలేము దానివల్ల బహిర్గత ప్రపంచములో నిత్యం జరిగే కార్య కలాపాలు, వాటి కారణాలునుంచి మానవుడు దూరం అవుతాడు. ఇది అజ్ఞానానికి తిన్ననిబాట.

యీ 'వైరాగ్యం' ఆదిలో వేదకాలంలో వున్నట్లు కనబడదు. సంఘంలో వ్యాపించిన అశాంతి,అసంతృప్తి, నిరాశాభావం ఫలితంగా బయలు దేరిన తిరుగుబాటు దారులను బ్రాహ్మణ వర్గం, మతాధిపతులు తపస్సు, వైరాగ్యం బోధించి తిరిగి తమ ఆధికారాన్ని సుస్థిరం చేసుకున్నారు. 'మానవుని కోర్కెలకు అంతులేదు. కాబట్టి జీవిత మెప్పుడూ దుఃఖమయంగానే వుంటుంది. కోర్కెలనుచంపుకో. నీకు యేదుఃఖమూవుండదు. నిత్యానందాన్ని(మోక్షం)పొందగలుగుతావు'— ఈవాదం దరిదాపుదొరుకని సంఘానికి చక్కని మార్గంగా కనుపించింది. దీనిఫలితంగా తత్వశాస్త్రంఅనేకవందల సంవత్సరాలవరకు సరియైన మార్గంలో నడవటానికి వీలులేకపోయింది. చివరకు బౌద్ధమతంకూడా దీన్నుంచి

పూర్తిగా విముక్తిచెందలేక పోయింది సంఘంలో తిరుగుబాటు చేసేశక్తి యీ 'వైరాగ్య' వాదంవల్ల నశించిపోయింది.

వున్నవ్యవస్థమీద రోతపుట్టినప్పుడు తప్పనిసరిగా నూతన వ్యవస్థ కావాలనే వాంఛవుంటుంది కాని ఈఅసంతృప్తికి 'వైరాగ్యం' మందుగా వుపయోగిస్తే అసలు వాంచే నశిస్తుంది తత్ఫలితంగా సంఘం ముందుకు పోలేదు. సంఘంలో అభివృద్ధి లేనప్పుడు భావంలోకూడా యిది ప్రతి బింబిస్తుంది వేల సంవత్సరాలనుంచి బ్రాహ్మణవర్ణం అధికారంలో వుండ టంచేత, మరొకవర్ణం అధికారాన్ని సంపాదించేశక్తి పొందలేకపోటంచేత, సంఘంలోవున్న బాధలను బ్రాహ్మణవర్ణం సరియైన వుపశాంతి కలిగింప టానికి మారుగా తమ అధికారం నిలబెట్టుకోటానికి 'వైరాగ్యం' అనే మందు-యివ్వడంచేత, సంఘం మరీ నిస్తేజమై, ప్రాపంచిక వాంఛలను చంపు కొని ముందుకుసాగలేక వున్నచోటనే అప్పటినుంచీ యిప్పటివరకూ ఆగి పోయింది. దీనిఫలితం అప్పుడప్పుడు కొంతమంది తత్వవేత్తలు సరియైనమార్గం చూపించటానికి ప్రయత్నించినా, నిర్వీర్యమైన సంఘం దాన్ననుసరించలేక పోయింది

బ్రతకాలనేవాంఛ మానవుని ప్రకృతితో పోరాటానికి దింపుతుంది. అతని ఈ పోరాటంలో మానవుడు అంతకుముందు అగమ్యగోచరం అనుకుం టున్న ప్రకృతి రహస్యాలను కనుక్కోగలుగుతాడు. ఆదిలో మానవుడి యీపోరాటం అతనికి అనుభవాన్ని సంపాదించి పెట్టుతుంది యిదే తత్వ శాస్త్రానికి (ప్రకృతిగమనం తెలుసుకొని దానిని సంఘాభివృద్ధికి మార్చగల జిజ్ఞాస) దారి తీస్తుంది. తత్వశాస్త్రం విజ్ఞానానికి (సైన్సు) తల్లివంటిది. ఈ విజ్ఞానం చివరకు అభివృద్ధిచెంది తన తల్లియైన తత్వశాస్త్రాన్ని 'విజ్ఞానా లకు విజ్ఞానం' గా చేస్తుంది జీవితంమీద విరక్తి, సౌఖ్యంమీద విరక్తి మాన వుని విరాగిని చేస్తుంది. ఇది అతని సైజగుణాన్ని (బ్రతకాలనే వాంఛ) చంపివేసి అతడు ముందుకుపోకుండా బంధించివేస్తుంది. దీనిఫలితంగా అతడు ఆధ్యాత్మిక వాదానికి గురి అవుతాడు. మానవుడు విజ్ఞానం, తత్వ శాస్త్రం సృష్టిస్తాడు. కాని సాంఘిక పరిస్థితులు అతని జీవితసౌఖ్యాన్ని అరి కట్టితే, దానితోపాటు అతని బుద్ధి, విజ్ఞానం, భావాలుకూడా అరికట్టబడు

త్రవి. ప్రాచీన భారతదేశ తత్వశాస్త్రం యిదేవిధంగా అభివృద్ధి చెందకుండా అరికట్టబడింది. [1]

ప్రాచీన భారతదేశంలోని కణాద,కపిల,గౌతమ, మహావీర,చార్వాక* మొదలైన తత్వవేత్తల హేతువాదం, భౌతికవాదం, ప్రకృతిగతి తర్క వాదం మొదలైనవి బౌద్ధ విప్లవం నాశనం చెందటంతో అన్నీ నాశనం అయిపోయినై .శంకరాచార్యుని సిద్ధాంతంతో తిరిగి బ్రాహ్మణమతం అధికారాన్ని సంపాదించింది తత్వశాస్త్రానికిమారుగా తిరిగి ఆధ్యాత్మిక, మాయావాదాలు బయలుదేరినై. తత్వశాస్త్రం, తాత్వికవిప్లవం మళ్ళీ తలెత్తటానికి వీలులేకపోయింది. క్షత్రియజాతి పతనమైంది సంఘం నిర్వీర్యమైంది. విదేశీదండయాత్రలకు దేశం గురికావలసివచ్చింది అప్పటి సాంఘిక పరిస్థితులనుబట్టి మరొకవర్గం అధికారానికి రావలసిన ఆవశ్యకతవుంది. కాని బ్రాహ్మణవర్గం బోధించిన ఆధ్యాత్మికవాదం యీ అవకాశాన్ని నాశనంచేసి సంఘాన్ని అజ్ఞానం, బానిసత్వంలో అట్టిపెట్టి మరీ నిర్వీర్యం చేసింది.

అప్పటి కాలంలోని సాంఘిక పరిస్థితులనుబట్టి వేదమతంమీద అసంతృప్తి బయలుదేరినట్లు,దాని ఫలితంగా ప్రకృతిని భౌతిక దృష్టితో అర్ధంచేసుకోటానికి ప్రయత్నించినట్లు, యేశాస్త్రంచూచినా కనబడుతుంది. తక్కిన ప్రపంచంలో మాదిరిగా ఇండియాలోకూడా ఆధ్యాత్మిక వాదానికి ముందు

---

*[1] చార్వాకుడు ఈవిధంగా బోధించాడు:- ఆనందమే జీవిత ఆదర్శం. నిజమైన ఆనందాన్ని యీ ప్రపంచంలోనే పొందగలుగుతాము. పరలోక సుఖం వుందనుకుని ఈలోక సుఖాన్ని విడనాడటం పొరపాటు. ఇది ఎండమావుల వెంటబడినట్లవుతుంది మతం మానవులను సుఖం పరిత్యజించమని బోధించి వారిని దుఃఖమయుగ చేస్తుంది. కాబట్టి సోమరితనం, వైరాగ్యం మానవుని జీవితం సుఖమయం చేయటానికి వుపకరించవు. మతంచెప్పినట్లు చేసే యజ్ఞ-యాగాదులు మొదలైనవన్నీ మోసకృత్యాలే. వాటివల్ల యేమీ ప్రయోజనంలేదు. ప్రపంచం మానవుడు సుఖంపొందటానికే యేర్పడింది. అందులోవున్న ప్రతిదీ మానవుని అవసరానికే యేర్పడింది.

చార్వాకుని అనుయాయులు బౌద్ధమతంలోనిశూన్యవాదాన్ని,నిర్వాణవాదాన్ని ఖండించారు. [1]

భౌతిక వాదం వున్నట్లు గోచరించక మానదు గ్రంధస్థమయిన యీభావ పరంపర చాలావరకు నాశనమై పోయింది కాని వున్న దాన్నిబట్టి కొంత వరకు తిరిగి మళ్ళీ ఆచరిత్రను పూర్తిచేయటానికి అవకాశంవుంది ఆదిలో సహజంగా తత్వశాస్త్రం ప్రతిచోట (ఇండియాలోకూడా) భౌతికవాద దృష్టితోనే అభివృద్ధి చెందింది వేదమతంతో కలిగిన అసంతృప్తి ఫలితంగా వైశేషిక, సాంఖ్య న్యాయ సిద్ధాంతాలు బయలు దేరినవి. ఇవే బౌద్ధవిప్లవానికి పునాదులైనవి. క్రీస్తుపూర్వం ఏడవ శతాబ్దం నుంచి దాదాపు వెయ్యి సంవత్సరాల వరకు మన తత్వశాస్త్రం పూర్తిగా భౌతిక, హేతువాద దృక్పథంలో నడిచింది వేదాంత సూత్రాలు వీటి తరువాతనే రచించబడ్డట్టు తెలుస్తుంది. కణాద, కపిల సిద్ధాంతాలను, బౌద్ధ జైన మతాలను నాశనం చేయటానికి యివి రచించ బడ్డట్లు కనబడుతుంది, కాబట్టి భారత దేశంలో బౌద్ధమత పతనం వరకు తత్వశాస్త్రం భౌతిక వాదంలోనే నడిచిందని చెప్ప వచ్చును క్రీస్తు శకం నాలుగో శతాబ్దంలో గుప్తరాజ్యంలో పూర్తిగా సంఘం హిందూమతానికి కట్టుబడిన కాలంలో కూడా చైనానుంచి వచ్చిన ఫాహియాన్ సూచించిన ప్రకారం యిక్కడ "భౌతిక ప్రపంచాన్నొప్పుకున్న 96 శాఖలు వున్నట్లు" తెలుతుంది.

బౌద్ధమతాన్ని యెదిరించటానికి శంకరుడు అద్వైతవాదాన్ని సృష్టించాడు. కాని అతడు నిజంగా బౌద్ధకాలం కంటె ముందుగావున్న భౌతిక వాదాన్ని యెదుర్కొన వలసి వచ్చింది. అతని రచనలను బట్టి చూస్తే కేవలం భౌతిక వాదాన్ని, ప్రకృతి తత్వాన్ని ఖండించటానికే రచించ బడ్డట్లు కనబడుతుంది యీ క్రిందదాన్ని బట్టిచూస్తే శంకరుడు ఖండించిన "నాస్తికవాదం, భౌతికవాదం" యేవిధంగా వుందో కనబడుతుంది.

మత సిద్ధాంతాలు కేవలం నిరుపయోగమైనవి. వాటికి పునాది భగవంతుడు. కాని భగవంతుని అస్థిత్వం రుజువు చేయటానికి వీల్లేదు. భగవంతుడు సృష్టికర్తగా భావించబడు తున్నాడు కాని అతనికి అస్థిత్వంలేదు. ప్రపంచానికి ఒకసృష్టికర్త, పరిపాలకుడువున్నాడని అంగీకరించితే యీసృష్టి కర్తకు సృష్టికర్తయెవరు? యెక్కడనుంచి యీసృష్టికర్త వచ్చాడు? అనే ప్రశ్నలు పుడయుస్తవి యీసృష్టి కర్తకు ఆద్యంతములు లేవని చెప్పబడు తుంది. కాని అతడు సృష్టికర్తఅని చెప్పటంలోనే అతనికి వ్యక్తిత్వం

వున్నదని అంగీకరించక తప్పదు. వ్యక్తి అయిన వానికి ఆద్యంతములు వుండక మానవు. భగవంతుడు సర్వశక్తి సంపన్నుడని నమ్మబడుతుంది. కాని మానవుని బుద్ధికి ఇవి అన్నీ వూహాకల్పితమని గోచరించకమానవు. అప్పుడు భగవంతుడే వుండడు. కాగా సృష్టికి కోర్కె ప్రధానం అని చెప్పబడింది దీన్ని బట్టి భగవంతుడు కూడా కోర్కెలనుంచి తప్పించుకోలేని అస్వతంత్రుడని తేలుతుంది పైగా యీప్రపంచం భగవంతుని కోర్కె ప్రకారం సృష్టించబడితే భగవంతునికే యీ ఆవశ్యకత వుందని తేలుతుంది. అవసరాన్ని బట్టి కోర్కె జనిస్తూ వుంటుంది. అవసరాన్ని అంగీకరిస్తే సర్వశక్తి, గుణసంపన్నుడు, నిర్వికల్పుడు, నిర్వికారుడు, నిరామయుడు అని భగవంతుని గూర్చి చెప్పటానికి వీల్లేదు.

శంకరుని భాష్యం ప్రమాణ గ్రంథంగా యెంచబడుతుంది. బౌద్ధ మతాన్ని నాశనంచేసి తిరిగి హిందూమతాన్ని, బ్రాహ్మణ అధికారాన్ని స్థాపించటానికి అతడు సిద్ధాంతాలు సృష్టించాడు కాని అతడు అంతేవరకున్న నిజమైన తత్వశాస్త్రాన్ని ఖండించడంలో విఫలుడయ్యాడు. యింతవరకు దీన్ని యెవరూ గుర్తించలేదు. శంకరుని భాష్యంలోనే యీలోటు కనబడుతుంది. భౌతికవాదులను యితడు సూటిగా యెదుర్కొని వారివాదన ఖండించలేక పోయ్యాడు. వేదాలను యితడు ప్రమాణంగా చూపించి వారివాదన కాదంటానికి ప్రయత్నించాడు. వేదాలు మానవబుద్ధికి తగినసమాధానం ఇవ్వజాలక పోవటం చేతనే, తరువాత వైశేషిక, సాంఖ్యశాస్త్రాలు బయులుదేరినై. వేదాంత సూత్రాలు కూడా వేదాల్లో వున్న యీలోటును అంగీకరించినై "వేదాల్లో పూర్తి సమాధానం పొందలేక శాండిల్యుడు శాస్త్రాలను పఠించాడు" (భాగవతం) శంకరుడు యీశాస్త్రాల్లో చూపిన వాదనకు సరియైన సమాధానం యివ్వలేక, వేదాలే ప్రమాణం అని ఒక కొండగుర్తుచెప్పి వీటిని గ్రుడ్డిగా త్రోసివేశాడు.

కాగా భౌతిక, ప్రకృతివాదాలకు, వాటిసిద్ధాంతాలమీద ఎదుర్కొనటానికి ప్రయత్నించినప్పుడల్లా శంకరుడుకూడా భౌతికవాద దృక్పథాన్ని చేపట్టక తప్పలేదు. అతని అద్వైతవాదం నిజంగా ఆధ్యాత్మికవాదంకాదు. భౌతికవాదాన్ని తలక్రిందులుచేసి చెప్పాడు. అతడు బోధించిన మాయా

వాదంలోనే అతడు ప్రకృతియొక్క వాస్తవికాన్ని కాదనలేకపోయ్యాడని తేలుతుంది. ప్రకృతికి అస్థిత్వంలేదని నిరూపించలేక చివరకు అది 'మిథ్య' అని ఒక గీతగీసి, దీనికి వేదాలుప్రమాణం అని ఒక కొండగుర్తుచెప్పి, శంకరుడు దొడ్డిత్రోవను బయటపడ్డాడు. శంకరుని 'మాయావాదం' భౌతికవాదాన్ని కాదనలేక మరొకపేరుతో అంగీకరిస్తుంది.

శంకరుడు వేదాంత సూత్రాలకు భాష్యంచెప్పతూ, ఆదిలోనే రాత్రికీ, పగలుకూ వున్నంతభేదం వస్తువుకీ, వస్తుతత్వానికి వున్నది కాబట్టి దీన్నిగూర్చి ప్రత్యేకమైన ప్రమాణం అక్కర్లేదని బోధిస్తాడు. ఆదిలో యీవిధంగా ద్వైత సిద్ధాంతంతో బయలుదేరిన శంకరుడు చివరకు 'మాయావాదం' తో అద్వైత సిద్ధాంతాన్ని సృష్టిస్తాడు. భగవంతుని అస్థిత్వం నిరూపించటానికి (ఇది కేవలం కల్పితంతప్ప ప్రమాణపూర్వకంగా రుజువు చేయటానికి వీల్లేదు) ప్రమాణ పూర్వకంగా రుజువు చేయటానికి వీలున్న ప్రకృతి అస్థిత్వం 'మాయ' అని త్రోసివేస్తాడు. ''పరమాత్మ, 'అవిద్య' అనే శక్తితో కలిసివుంది. యీ 'అవిద్య' ప్రపంచ సృష్టికి, కారణభూతమని చెప్పబడింది. యీ శక్తిని 'వస్తువు'గా చెప్పటానికి వీల్లేదు. పరమాత్మ వొక్కటే వస్తువు (చేతనం) అయితే ఇది వస్తురహితంగా చెప్పటానిక్కూడా వీల్లేదు. దీనివల్లనే యీ ప్రపంచం సృష్టించ బడుతుంది. కాబట్టి యిది మాయ'' ఈ ప్రపంచ సృష్టికి కారణ వస్తువైన దీన్ని త్రోసివేయటానికి వీల్లేకపోయింది 'మాయ' ప్రపంచసృష్టికి ఉపాదానంగా చూపబడింది. మాయ భగవంతుని శక్తి కాబట్టి మాయ భగవంతుని శక్తిగా వున్నంత కాలం యీప్రపంచ సృష్టికి కారణం భగవంతు డవుతాడు.

యీసిద్ధాంతాన్ని వొప్పుకుంటే భగవంతుని అస్థిత్వానికే భంగం కలుగుతుంది. భగవంతుడు నిర్గుణుడు, చలన రహితుడు. కాని అతనికి మాయ అనే ఒకశక్తి అంటగట్ట బడుతుంది. కాగా యీశక్తికూడా అతనితో పాటు సమాన అస్థిత్వాన్ని కలిగివుందని నిరూపించ బడుతుంది. 'కలయిక' అనగానే రెండువస్తువు లున్నవని అంగీకరించక తప్పదు. 'చెంది యుంటం' అనేదికూడా అంతే, భగవంతుడు యీభౌతిక ప్రపంచానికి కారణ భూతమని చెప్పితే కారణం 'అభౌతికం' కావటానికి వీల్లేదు. పరస్పర

విరుద్ధమైనవి కారణ కార్య సంబంధాన్ని కలిగి వుండవు. భౌతిక పదార్థానికి అభౌతికం కారణం కాదని అంగీకరిస్తే, భౌతిక పదార్థానికి ప్రత్యేక అస్థిత్వం వుందని అంగీకరించకతప్పదు. దానికి యేదైనా కారణం కావచ్చు కాని అభౌతికం 'పరమాత్మ' మాత్రం కారణం కాటానికి వీల్లేదు శంకరుడు యీవిషమ పరిస్థితినుంచి తప్పించు కోటానికి వేదాలు ప్రమాణంగా చూపిస్తాడు అతడు యీవిధంగా వాదిస్తాడు. "వేదాంత సిద్ధాంతం ప్రకారం పరమాత్మ అచంచలంఅని, అప్పుడు యీసృష్టి వుండదని వాదిస్తే, దానికి మనం భగవంతుడు మాయ అనే శక్తితో కలిసివున్నాడని సమాధానం చెప్పవచ్చును' హేతువాదంమీద నడిచే వారికి యిది సమాధానం కాదు. ఆదిలోనే మాయ అని యీ ప్రపంచం కొట్టివేయబడింది. భగవంతునికి యీ ప్రపంచంతో సంబంధంలేదని చెప్పబడింది. కాగా వెంటనే గ్రుడ్డిగా భగవంతునకు ఒక మానవ స్వరూపం కల్పించి, యిది అతనికి ఒక శక్తిగా జోడించబడ్డది. యీ కుతర్క వాదంతో శంకరుడు భౌతికవాదాన్ని ఖండించాడు.

వేదాంత సూత్రాల ప్రకారం యీ ప్రపంచం అస్థిరం, యదార్థం కాదని చెప్పబడింది. కాని బౌద్ధమతంలోని భావవాదాన్ని యెదిరించటానికి శంకరాచార్యుడు వేదాంత వాదాన్ని కూడా త్రోసివేసాడు. బౌద్ధమతం లోని భావవాదం యీ ప్రపంచం, దీనిలోవున్న అంతర్యాభూతమైన కారణ కార్యభావంవల్ల పరిణామదశ చెందుతూవుందని, దీనికి మూలం అణువని, తక్కినదంతా దాని స్వరూపం అని, బహిర్గత ప్రపంచమంతా మానసిక సంబంధాన్ని బట్టి అస్థిత్వాన్ని పొందినట్లు కనబడుతూ వున్నా యథార్థంగా కాదని చెప్తుతుంది.

శంకరుడు దాన్ని ఖండించటానికి యీ విధంగా వాదించాడు—బహిర్గత ప్రపంచం కనబడుతూవుంది. కాబట్టి దానికి అస్థిత్వం లేదని (బౌద్ధ మతం యిది స్వరూపం అని, అణువు దానికి మూలం అని చెప్తుతుంది.) చెప్పటం పొరపాటు. ఇలా వాదించే వ్యక్తి వాదనలు వినటం అనవసరం. అయితే శంకరుడు మా యీ వాదాన్ని గూర్చి బోధిస్తూన్నప్పుడు యెందుకు అంగీకరించి వినాలో అర్థం కావటంలేదు. తరువాత అతడు యీ విధంగా చెప్తుతాడు. "మనస్సు తత్వాన్ని బట్టే బహిర్గతంగా వస్తువు యొక్క

అస్థిత్వం వుందని అంగీకరించాలి. ఒకడు ఒక స్తంభాన్ని లేక గోడను చూచి నప్పుడు అది అతని యొక్క మనస్సుకేకాదు. అందరి దృష్టిలోను అవి కన బడుతూనే వుంటవి. బహిర్గత వస్తువు యొక్క అస్థిత్వం లేదనే వారి కూడా అవి కనబడుతూనే వుంటవి. బహిర్గతమైన వస్తువు వున్నప్పుడే అది మనస్సులో భావంగా యేర్పడుతుంది. వస్తువులేకుండా భావం యేర్ప డదు. కాబట్టి మానసిక ప్రవర్తన బహిర్గత ప్రపంచాన్ని బట్టి వుంటుంది. మనకున్న విజ్ఞానాన్ని బట్టి యీ బహిర్గత ప్రపంచ అస్థిత్వం త్రోసివేయ టానికి వీల్లేదు.'*

ఇక్కడ శంకరుడు తనఅద్వైతవాదాన్ని తానే ఖండించుకుంటు న్నాడు. హేతువాదంమీద వాగ్వివాదం జరిగి నప్పుడు భౌతిక వాదాన్ని అంగీకరించక తప్పదు. శంకరాచార్యుడే యీ వాదాన్ని చేపట్టాడంటే ఆకాలంలో భౌతికవాదం బాగావ్యాప్తిచెంది ప్రబలంగా వుందని వొప్పుకో వలసి వస్తుంది.

గ్రీస్ దేశంలోమాదిరిగా యిక్కడకూడాఅదేకాలంలో భౌతికవాదం అభివృద్ధి చెందటం, పతనం చెందటం జరిగింది. పాశ్చాత్య దేశాల్లో తరువాత విజ్ఞానం పెరగటంచేత ఆ అవస్థనుంచి అక్కడి సంఘం తప్పించుకొని ముందుకు పోగల్గింది. ఇక్కడఅల్లా జరగలేదు. మనం యిప్పటికీ ప్రాచీన కాలంలో గతించి పోయిన ఈ భౌతిక వాదాన్ని తిరిగి పునరుద్ధరించి సంఘాన్ని ముందుకు తీసుకొని వెళ్ళవలసిన ఆవశ్యకత యెంతో వుంది.

తక్కిన ప్రపంచం మాదిరిగా భారతదేశం ముందుకు వెళ్ళకుండా వున్నచోటనే యెందుకు ఆగిపోయింది? ప్రాచీన గ్రీకుదేశంలో తత్వశాస్త్రం వర్తక సంఘంద్వారా సృష్టించబడ్డది. అప్పుడు అధికారంలోవున్న మతాధి పతుల సిద్ధాంతం, వారి అధికారం, వ్యాపారవర్గ అభివృద్ధికి ఆటంకం కలిగించింది అందుకని వారు మూఢ విశ్వాసంతో సృష్టించిన మతాధిపతుల సిద్ధాంతాలను ఖండించే వొకసంఘాన్ని పరిపాలించటానికి అధికారంలేదని నిరూపించారు. కాని యిక్కడ భారతదేశంలో వ్యాపారవర్గం ఆ విధంగా సంఘంలో శక్తివంతమైన వర్గంగా అభివృద్ధి చెందలేక పోయింది మన దేశంలోవున్న స్వయం పోషక గ్రామీణ ఆర్థికవ్యవస్థ వ్యాపారం అభివృద్ధి చెందటానికి వీలులేకుండా చేసింది. వ్యవసాయవుత్పత్తిలో చాలా భాగం

పన్నుక్రింద జమకట్టించ బడుతూ వుండేది. మారకంకోసం మార్కెట్టుకు వచ్చేవస్తువులు చాలా కొద్దిగా వుండేవి. క్రీస్తుశక ఆరంభంలో, అంతకు పూర్వం దక్షిణ భారతదేశంనుంచిసిల్కు, దంతములు, రత్నాలు మొదలైనవి గ్రీసు, రోముదేశాలకు యెగుమతి చేయ్యబడుతూ వుండేవని చరిత్ర చెప్తు తుంది. కాని ఈవ్యాపారం యవనులు (గ్రీకుదేశస్తులు) చెస్తూ వుండే వారు. వీరువిపరీతంగా వీటికోసం దక్షిణభారతదేశంవస్తూ వుండేవారని, వీరిలో చాలామంది యిక్కడ ద్రవిడరాజులక్రింద సైనికులుగా పనిచేసారని కూడా చరిత్రచెప్తుతుంది. తరువాత యిదేవ్యాపారం అరేబియనులు సాగిం చారు. దక్షిణదేశంలో ఉత్తరదేశంకంటె యెక్కువగా వ్యాపారంజరుగుతూ వ్యాపారవర్గం బయలుదేరటంచేతనే అక్కడ బౌద్ధమతంలో హీనయానశాఖ (భౌతికవాదం) యేర్పడింది. ఉత్తరదేశంలో బ్రాహ్మణ అధికారం ఎక్కు వగా వుండటంచేత వారు వ్యాపారాన్ని ఖండించారు. మను, కౌటిల్య శాస్త్రాల్లో వర్తకుడు సంఘంలో ప్రధాన అంగంగా పరిగణించ బడలేదు. హావెల్ ఆర్యసంస్కృతినిగూర్చి యీవిధంగా వ్రాసాడు.

"వేదాల్లో గండయాత్రచేసిన జాతి (ఆర్యులు) యొక్క సంస్కృతి ప్రతిబింబిస్తుంది. వీరికి వ్యవసాయమే ముఖ్యజీవనాధారం. వ్యాపారాన్ని వీరు నిరసించారు. ఒక చేతిలోకత్తి, ఒకచేతులో నాగలి పట్టుకొని వీరు దేశాన్ని ఆక్రమించుకుంటూ వచ్చారు. వీరు యే దేవాలయాల్ని నిర్మించ లేదు. ప్రకృతిశక్తుల పూజిస్తూ వాటికి బలులిస్తూవుండేవారు......ద్రవిడ సంస్కృతి వ్యాపారసంఘానికి చెందినది. వీరికి పరలోకంకంటె ఇహ లోకమే ప్రధానంగా కనబడింది. ఆధ్యాత్మిక ప్రపంచంకంటె భౌతిక ప్రపంచంలోనే సుఖంపొందటానికి వారుప్రయత్నించారు." (ఇండియాలో ఆర్యుల రాజ్యం)

నాగరికతలో ముందంజవేసిన ద్రవిడులను ఆర్యులువోడించి వారిని బానిసలుగాచేసుకొని చట్టబద్ధంగా వారిని బంధించివేస్తారు. దీనిఫలితంగా వ్యాపారం, స్వతంత్రభావన నశించినై. మాంసం తినటంలోనూ,కల్లు త్రాగ టంలోనూ ఆర్యులు భౌతిక ప్రపంచాన్ని, ప్రాపంచిక సౌఖ్యాన్ని కాదన లేదు. కాని తమ అధికారం సుస్థిరం చేసుకోటానికి తమక్రిందనున్న ప్రజ లకు యీ అవకాశం (ప్రాపంచిక సౌఖ్యం) లేకుండా చేసారు. ఇదే ఆర్య

సంస్కృతిలోవున్న 'ఆధ్యాత్మిక గొప్పదనం'. వేదఋషులు పొందిన ప్రాపంచికసౌఖ్యం మాదిరిగాకాకుండా, ప్రకృతిని జయించి, స్వాధీనం చేసుకొని తద్వారా జీవితాన్ని, సంఘాన్ని సుఖవంతం చేయటమే తత్వశాస్త్ర లక్షణం. ఆర్యుల ఆధ్యాత్మిక వాదానికి యీ అవసరంలేదు. కాబట్టి మరొక వర్గం (వ్యాపారివర్గం) పైకి వచ్చేవరకు తత్వశాస్త్రం అభివృద్ధి చెందలేక పోయింది.

బౌద్ధవిప్లవం మామూలుగా బ్రాహ్మణ జాతిమీద క్షత్రియజాతి జరిపిన పోరాటం అని చెప్పబడుతుంది ఇది కొంతవరకు నిజమే.. కాని యీవిప్లవంలో వ్యాపార వర్గంకూడా పాల్గొన్నది. ఉదాహరణకు— హ్యుయన్‌సాంగు (చైనా యాత్రికుడు) కథనం ప్రకారం నలందా విశ్వ విద్యాలయం 'బుద్ధుని శిష్యులైన ఐదువందల వర్తకులచేత' స్థాపించ బడ్డది. బౌద్ధ రాజుల కాలంలో వర్తకులు కూడా సంఘంలో ప్రదానాంగంగా పరిగణింప బడివుండవచ్చు. బౌద్ధమతం పతనంచేత తిరిగి బ్రాహ్మణ మతం అధికారాన్ని (గుప్తరాజ్యం) సంపాదించగానే తిరిగి వీరికి సంఘంలో, వ్యాపారంలో వ్యతిరేకంగా కొన్ని శాసనాలు నిర్మించబడ్డవి.

మను ధర్మశాస్త్రం (క్రీస్తుశకం 4 వ శతాబ్దం) వర్తకులు వర్తకం చేయకుండా అనేక నిర్బంధాలు పెట్టింది. అప్పటినుంచే సముద్రం మీద వ్యాపారం చేయటం పాపంగా పరిగణించ బడింది, అశోకుడు సముద్ర యానానికి అంగీకరించి బౌద్ధమత ప్రచారకులను విదేశాలకుకూడా పంపాడు. ఇక్కడ నుంచి వర్తకులు చైనా, మలయా ద్వీపములు మొదలైన దేశాలకు వెళ్ళుతూ వుండేవారు. దాని ఫలితంగా దక్షిణ దేశంలో బౌద్ధమతం ఫక్తు తత్వశాస్త్ర రూపంలో (హీనయానం) అభివృద్ధిచెంది చాలాకాలం బ్రాహ్మణ అధికారాన్ని యెదిరించ గల్గింది సముద్రయాన ఫలితంగా (విదేశ సంపర్కం) సంఘంలో నూతన వ్యవస్థ కావాలనే వాంఛ ప్రబలుతుంది. అందుకని మనువు 'సముద్రయానం పాపం' అని శాసించాడు. స్వతంత్రమైన వర్తకసంఘం లోపించటంచేత, సముద్రంగుండా వర్తకం చేయటానికి వీల్లేదని విదేశాలతో సంబంధం త్రెంచివేయటం చేత, తత్వశాస్త్రం తత్వశాస్త్రంగా అభివృద్ధి చెందలేక పోయింది.

దీనికి సాంఘికవర్ణ వ్యవస్థ కూడా కొంత కారణమని చెప్పాలి. భూమి అంతా బ్రాహ్మణ, క్షత్రియుల అధీనంలోవుంది. కాబట్టి యీ రెండు వర్ణాలు సహజంగా వ్యాపారం అరికట్టడానికి ప్రయత్నిస్తవి. బ్రాహ్మణ అధికారాన్ని యెదిరించటానికి క్షత్రియవర్ణం పూనుకోవలసింది. కాని ఆ వర్ణంకూడా బ్రాహ్మణ అధికారాన్ని అంగీకరించింది. మహాభారత అంతర్యుద్ధ ఫలితంగా క్షత్రియ జాతి తమలో తాము నాశనమై చివరకు బ్రాహ్మణ అధికారానికి దాసోహం అనవలసి వచ్చింది. యీ సాంఘిక వ్యవస్థే వ్యాపారాభివృద్ధికి, స్వతంత్రాలోచనకు అవకాశం లేకుండా చేసింది ప్రాచీనకాలంలో ఒకప్పుడు భౌతికవాదంలో తక్కిన దేశాలన్నింటి కంటె ముందంజ వేసిన భారతదేశంలో, తరువాత అదే వాదం మచ్చు కూ్కుడా లేకుండా మాయమైపోయింది.

# ఆధునిక భౌతికవాదం

భౌతికవాదం అంటే కేవలం ప్రాపంచిక సౌఖ్యాలను అనుభవించటం కాదు. ప్రత్యేకించి యే దైవశక్తి ఆధారంలేకుండా యీప్రపంచాన్ని అర్థం చేసుకోనటం భౌతికవాదం. యిందుకోసం ప్రాచీనకాలంలో జరిగిన ప్రయత్నాలన్నీ ఈ భౌతికప్రపంచానికి ఒక మూలకారణం వుందని,—శరీరం, మనస్సు,ఆత్మ—భౌతిక పదార్థానికి సంబంధించినవనీ నిరూపించినవి. ఆలోచనా శక్తికి ఒకవస్తువుయొక్క అస్తిత్వం, భావాలకు వస్తువులు, చేతనానికి పదార్థం కారణభూతాలు.

భావవాదం దీన్ని తలక్రిందులుచేస్తుంది. కాని తత్వశాస్త్రంతో కూడిన భౌతికవాదాన్ని ఖండించటానికి మతసంబంధమైన భాషలో చెప్పినందువల్ల ప్రయోజనంలేదు. విజ్ఞానం, హేతువాదం పెరిగిన ఈ రోజుల్లో అది మరీ అసంభవం. కాబట్టి తత్వశాస్త్రాన్ని యెదుర్కొనటానికి తత్వశాస్త్రంతో కూడిన భాషను నిర్మించాలి. అందుకనే ఆధ్యాత్మికవాదం 'భావవాదం' అనే పేరుతో బయటపడింది. దీనికి ఫ్యూయర్ బాక్ 'తత్వశాస్త్ర ఆధ్యాత్మికవాదం' అని పేరు పెట్టాడు. యీవాదం బయలుదేరటంతో అంతవరకు భిన్నదృక్పథాల్లోవున్నవాగ్వివాదాలన్నీపోయి ఒకటేవాదం—యీ భౌతిక ప్రపంచం వాస్తవమైనదా, కాదా, దీన్ని నిరూపించటానికి మానవబుద్ధికి యెంతవరకు శక్తివున్నది—అనేది మిగిలింది.

'యీ ప్రపంచానికి ప్రత్యేకించి అస్తిత్వంవుంది. మానసికభావాన్ని పట్టి ఈప్రపంచం ఆధారపడలేదు. దీనికి స్వతంత్రమైన అస్థిత్వంవుంది'— అనే భౌతికవాదం దీనికి వ్యతిరేకంగా మానసిక భావనే ప్రధానకారణం అనే భావవాదాన్ని ఖండిస్తుంది.యీ పై ప్రధాన సూత్రంమీద ఆధారపడిన భౌతికవాదం 18, 19 శతాబ్దాల్లో అభివృద్ధిచెందిన సైన్సునాధారంగా తీసుకొనే భావవాదాన్ని ఖండిస్తుంది. యీసైన్సు అంతకుముందు హేతువాదం, భౌతికవాదం సహాయంతో బయలుదేరిన రినైజాన్సు వుద్యమాన్ని (తాత్విక విప్లవాన్ని) ఆధారంచేసుకొని అభివృద్ధి చెందింది.

17 వ శతాబ్దంలోని భౌతికవాదులు బాహ్యప్రపంచంలోజరిగేదాన్ని బట్టి, మనకు భావాలు యేర్పడుతూ వుంటవని, బాహ్యప్రపంచాన్ని

తెలుసుకోటానికి ప్రత్యేకించి యితర ఆధారంయేదీఅక్కర్లేదనివాదించారు. ఫ్రెంచి భౌతికవాదులుకూడా యిదేదృష్టితో మన యింద్రియ జ్ఞానమే నిజమైన జ్ఞానమని, అదే భావాలకు మూలాధారం అని వాదించారు. వారి వాదన ప్రకారం 'ఇంద్రియాలకు మూలాధారం భౌతికపదార్థం.' ఆశతాబ్దంలో కేవలం వూహాకల్పితంగా వున్న ఈ అభిప్రాయం 19వ శతాబ్దంలో సైన్సు సహాయంతో పూర్తిగా నిరూపించ బడ్డది.

18వ శతాబ్దంలో చివరిలో ప్రోవస్ట్, డ్యూలాంగ్, ఫోరియర్, ఫ్రెస్నేల్ మొదలైన ఫ్రెంచి సైన్సిస్టులు ప్రకృతిలోని వేడి, వెలుతురు, విద్యుచ్ఛక్తి; ఆకర్షణశక్తి (సూదంటురాయి)ని గూర్చి అనేక అద్భుత పరిశోధనలు చేశారు. ఆధునిక రసాయన శాస్త్రం అప్పటి ఫ్రెంచి భౌతికవాదులవల్లనే సృష్టించబడ్డది భూగర్భశాస్త్రం, జంతుశాస్త్రం, శరీరశాస్త్రం, వృక్షశాస్త్రం, మానసికశాస్త్రంకూడా అప్పటినుంచే ఒకక్రమ పద్ధతిలో ప్రారంభమైనవి.

''జంతుశాస్త్రం, శరీరశాస్త్రం, సహాయంతో ప్రపంచంలో అనాది నుంచీ జరిగే పరిణామావస్థ గుర్తించబడ్డది. కాగా ఈ పరిణామావస్థకు కారణం భౌతిక ప్రపంచం అని, ఈప్రపంచం ఒక క్రమబద్ధమైన గతిలో నడుస్తుందని కూడా గుర్తించబడ్డది. యిలాంటి భావాలు అంతకుముందు కూడా వున్నవి కాని ఫ్రెంచి భౌతికవాదులు ఈభావాలకు ఒకస్పష్ట ఆకారం యిచ్చి భావి భౌతికవాదులకు ఒకమార్గం చూపించారు...'' (బకిల్)

19వ శతాబ్దంలో సైన్సు యింకా అభివృద్ధిచెంది అంతవరకు అనూహ్యమైన అనేక సమస్యలను సహేతుకంగా పరిష్కరించ గల్గింది. సైన్సు నిరూపించిన వాదాన్ని మతం కాదనలేక పోయింది. సైన్సు మతంలో వున్న పరస్పర విరుద్ధ భావాలను చూపింది. మతం దానికి సరియైన సమాధానం యివ్వలేక పోయింది. అంతకుముందు సమాజం మతం చెప్పినట్లు ప్రపంచాన్ని అర్థం చేసుకుంటూ వచ్చింది. సైన్సు ఆభావననంతా తలక్రిందులు చేసింది. మానవుడు అనుభవాన్ని పొందుతున్నకొద్దీ అతనికి మతం చెప్పినది అసత్యంగా కనబడింది. యీప్రపంచాన్నంతటినీ భగవంతుడు వెనుకవుండి నడిపిస్తున్నాడనే విశ్వాసం తొలగి, యీప్రపంచం అంతా దాని

లోనే యిమిడివున్న ఒక క్రమబద్ధమైన కొన్ని శక్తుల ఆధారంతో నడుస్తుందని మానవుడు గ్రహించ గలిగాడు.

1809 లో లోరెన్జ్ జకెన్ తన 'ప్రకృతివాదం'లో అన్ని జీవులలోను ప్రాణం ఒకేవిధంగా కొన్ని పదార్థాల సంయోగం వల్ల యేర్పడుతుందని సిద్ధాంతీకరించాడు. అంతకు ముందే లామార్క్ జంతు పరిణామావస్థను గూర్చి కొంత సిద్ధాంతీకరించాడు. లామార్క్ తాను వ్రాసిన 'ప్రకృతి చరిత్ర' అనే గ్రంథంలో (1815) యీ విధంగా వ్రాసాడు. 'ప్రాణం కేవలం పదార్థసంబంధమైనది. ప్రాణం పదార్థంలో అంతర్భూతంగా యిమిడి వున్న రసాయనిక సంయోగం వల్ల యేర్పడుతూ వుంటుంది. జంతువులో కాని, వృక్ష జాతుల్లో కాని మొట్టమొదటిగా బయలుదేరేది దానంతటదే వుద్భవిస్తుంది. ప్రాణం వున్న వస్తువులు కూడా ప్రాణం లేని వస్తువులు మాదిరిగా ఒకే క్రమ సిద్ధాంతానికి కట్టుబడి వున్నవి. భావాలు, కార్యకలాపాలు మెదడుగా యేర్పడిన నరాల నాధారం చేసుకొని కలుగుతూవుంటవి. కాబట్టి మనస్సు పదార్థ సంబంధమైనది.''

లామార్క్, జకెన్ సిద్ధాంతాలను ఆధారం చేసుకొని డార్విను పరిణామవాదాన్ని హేతు పూర్వకంగా అభివృద్ధి చేసాడు. డార్విను చూపించిన సిద్ధాంతం ప్రకారం సృష్టికర్త కాని, మతం ప్రచారం చేస్తున్న చేతనం పరమాత్మ మొదలైనవి గాని, అనవసరంగా తేల్చబడ్డవి. డార్విను సిద్ధాంతాన్ని ఆ రోజుల్లో అనేకమంది మతప్రచారకులు, తత్వశాస్త్రజ్ఞులు తీవ్రంగా ఖండించారు. డార్విను 'నాస్తికుడు'గా నిందించబడ్డాడు. డార్విను విప్లవ పూరితమైన తన భావాలను చూచే తాను భయపడ్డాడు. కాని ఒకసారి భావాలు సృష్టించబడిన తరువాత వాటంతటవే ముందుకు సాగిపోతవి. డార్విను సృష్టించిన భావాల నాధారం చేసుకొని అతని శిష్యులు అతని సిద్ధాంతాన్ని యింకా స్పష్టీకరించారు. ఉదాహరణకు హేకెల్ 'శిలా ఖండంలో కూడా చేతనావస్థ పొందే గుణం వుందని' చెప్పాడు. ఇతర జంతు శాస్త్రజ్ఞులు కూడా యిదే సిద్ధాంతానికి వచ్చారు. దీని ఫలితంగా అంతవరకూ కేవలం వూహా కల్పితంగా వున్న భౌతికవాదం ప్రత్యక్ష ప్రమాణంతో అభివృద్ధి చెందసాగింది.

సైన్సు ప్రకారం చూస్తే యీ భూమి మీద అనాదినుంచీ ప్రాణులు నివసించటంలేదు. దీనికి కారణం ఆదిలో ప్రాణులు నివసించటానికి వీలు లేని పరిస్థితులున్నవి. భూమి క్రమేపి మార్పు చెందుతూ ఒక దశలో ప్రాణి యేర్పడటానికి అనుకూల పరిస్థితులు యేర్పడ్డవి. అప్పటినుంచి ప్రాణులు పరిణామావస్థ చెందుతూ చివరకు మానవ స్వరూపం యేర్పడింది. యీ వాదన అంగీకరించితే మొదట ప్రాణి యేవిధంగా వుద్భవించిందనే ప్రశ్న వుదయిస్తుంది. జర్మను శాస్త్రజ్ఞుడైన హేకెల్ ముందుగానే యీ ప్రశ్న వేసుకొని పదార్థంలోనే ప్రాణికి కావలసిన చేతనావస్థవుందని సమాధానం చెప్పాడు. "యీ ప్రశ్నకు సమాధానం చెప్పలేక చాలామంది శాస్త్రజ్ఞులు భగవంతుని మీద ఆధారపడ్డారు. యీవిధంగా చేయటం వల్ల వారు సైన్సునే వదలిపెట్టి యేమీ చేయలేనిస్థితిలో పడిపోతున్నారు. కాని ఆవిధంగా మూఢవిశ్వాసంమీద ఆధారపడితే మనం ప్రకృతి రహస్యాలను తెలుసుకునే విజ్ఞానం నుంచి దూరం అవుతున్నాము" (హేకెల్)

హేకెల్ పరిశోధనచేసి యీఅనాది ప్రాణిని 'శరీరంలేని ప్రాణులు'గా వర్ణించాడు. అవి సముద్రంలో నీళ్ళమీద తేలుతూ వున్నట్లు కనిపెట్టాడు "అవి చాలా సూక్ష్మతమమైన ప్రాణులు. సరిగ్గా చెప్పాలంటే అవి శరీరం కలిగిన ప్రాణిఅని, ఒకటికన్నా యెక్కువ పదార్థాల కలయికతో యేర్పడినప్రాణిఅని చెప్పటానికి వీల్లేదు ఆకారం లేకుండా, సూక్ష్మతమమై, ఒకే అణువులున్న పదార్థం." (హేకెల్) ఇంగ్లండు శాస్త్రజ్ఞుడైన థామస్ హక్స్లీకూడా ఇదే విధమైన ప్రాణులను సముద్రంలో నీళ్ళఅడుగున కనిపెట్టాడు.

వీటిని కనిపెట్టటంతో ప్రాణరహస్యం తెలుసుకోటానికి వీలైంది. అంతవరకు మూఢవిశ్వాసంతో, మత దృష్టితో ప్రాణికి ఆధారం సృష్టికర్త (భగవంతుడు) అనుకునే వాదన పోయింది. పదార్థంలో స్వతస్సిద్ధమైన చేతనం (ప్రాణం) వుందని పరిశోధనలద్వారా నిరూపించబడ్డది. ఆమ్లజని, ఉదజని, నత్రజని, వాయువులతో బొగ్గుకలయికవల్ల మనం ఆత్మ, జీవి, ప్రాణం అనుకుంటున్న శక్తియేర్పడుతుందని శాస్త్రీయంగా నిరూపించబడ్డది. యీశక్తికల పదార్థానికి 'ప్రొటోప్లాజమ్' అని నామకరణం చేయబడ్డది.

ప్రాణం కలిగిన వస్తువులకు, ప్రాణంలేని వస్తువులకు భేదంలేదు ప్రాణం వున్న వస్తువులన్నీ బొగ్గు, ఆమ్లజని, ఉదజని, నత్రజని, గంధకము పొటాసియమ్ మొదలైన పదార్థాల కలయిక వల్లనే యేర్పడుచున్నవి. ప్రాణంలేని వస్తువులో వున్న పదార్థాలకు మించి ప్రాణంవున్న వస్తువులో కొత్తపదార్థాలు లేవని నిరూపించబడ్డవి. కొన్ని పదార్థాల కలయికవల్ల వొకదశలో ప్రాణం యేర్పడుతుంది. అప్పుడు ఆవస్తువు ప్రాణిస్వరూపాన్ని పొందుతుంది.

//"అభౌతికమైన శక్తి (చేతనం) మొదట భౌతిక పదార్థాన్ని సృష్టించిందని అనుకోటం కేవలం మూఢవిశ్వాసానికి సంబంధించిన వాదన. విశ్వాసానికీ, విజ్ఞానానికీ (సైన్సు) సంబంధంలేదు. విశ్వాసం వున్నచోట విజ్ఞానం (సైన్సు) వుండదు. కాబట్టి వీటి రెంటినీ వేరుగా అట్టిపెట్టాలి. విశ్వాసం కవియొక్క వూహా ప్రపంచంనుంచి బయలు దేరుతుంది. విజ్ఞానం మానవుని యొక్క హేతువాదం, ఆలోచనాశక్తి నుంచి బయలు దేరుతుంది."
(హేకెల్) హేకెల్ తరువాత యింకా కొంతమంది శాస్త్రజ్ఞుల పరిశోధనలతో డార్విను పరిణామవాదం బాగా అభివృద్ధిచెంది భౌతిక తత్వశాస్త్రానికి పునాదిరాయి అయింది.//

కాని సైన్సుద్వారా మానవుడు తన ప్రయత్నంలో విఫలమై, సరియైన సమాధానం పొందనప్పుడల్లా అతడు ఇంకా తనకు తెలియకుండా యేదో మహత్తరశక్తి (భగవంతుడు) వెనుకవున్నదనే భావంలోవుంటూ వచ్చాడు అజ్ఞానావస్థ అతనికి దేవునిమీద విశ్వాసాన్ని కలిగిస్తూవచ్చింది. ఈప్రపంచంలో మానవుని కతీతమైన అనేకరహస్యాలున్నవి సైన్సుద్వారా మానవుడు ఒక్కొక్కదాన్నే కనుక్కుంటూ ముందుకు సాగుతున్నాడు. కాని యింకా అనేకం వున్నవి. యింకా అతడు అనేక విషయాలను తెలుసుకోలేని అజ్ఞానావస్థలోవున్నాడు. కనుక ఈ అజ్ఞానావస్థ అతనికి దేవునిమీద విశ్వాసాన్ని కలిగిస్తూవుంది.

కాబట్టి నేడు ప్రపంచంలో అనేకమంది సైంటిస్టులున్నా, వారిలో హెచ్చుమందికి మతం, భగవంతునిమీద నమ్మకం వుంటంలో ఆశ్చర్యం లేదు. దీనికి కారణం, వారు వొక్కొక్క శాస్త్రంలో వొక్కొక్కరు ప్రత్యేకంగా కృషిచేస్తూ యితరశాస్త్రాలనుంచి దూరంగావుండటమే. సైన్సు

లోని ఒక్కొక్క శాస్త్రంలో వొక్కొక్కరు ప్రత్యేకకృషిచేసి ఆశాఖ ద్వారా ఆసంబంధమైన ప్రకృతి రహస్యాలను తెలుసుకోటం అవసరమే. కాని ప్రకృతి మొత్తంలో అది ఒక స్వల్పభాగమే. మానవుడు ఆస్వల్ప భాగంలోనే కృషిచేస్తూ అందులోనే మునిగిపోటంచేత మొత్తం విజ్ఞాన శాస్త్రాన్నంతటటినీ అతడు అర్థంచేసుకోలేక పోతున్నాడు. ఉదాహరణకు ఈప్రపంచం ఒక పెద్దఅడవిలాంటిది. అందులో ఒక్కొక్కవ్యక్తి ఒక్కొక్క చెట్టునుగూర్చి పరిశోధనచేస్తూ మొత్తం అడవిని మరచిపోతున్నాడు. కాబట్టి ప్రత్యేకశాఖల్లో పరిశోధనలుచేసే శాస్త్రజ్ఞులు తమ పరిశోధనల నాధారంతో ఈమొత్తం భౌతికప్రపంచానికి సరిపడే సిద్ధాంతాలు సృష్టించ లేరు. ఈ అన్నిశాస్త్రాల విజ్ఞానాన్ని పొందుపరచి వాటిసహాయంతో సిద్ధాంతీకరించటం తత్వశాస్త్రజ్ఞుడు—భౌతికవాది చేయవలసిన పని.

బిషప్ బెర్క్లీ భౌతిక వాదాన్ని ఈవిధంగా ఖండించాడు. "ప్రకృతివాదం పదార్థం మూలాధారం అనేవాదం-నాస్తికవాదానికి త్రోవ తీస్తుంది. కాబట్టి పదార్థాన్నిత్రోసివేస్తే దానిమీద ఆధారపడివున్న, మత వ్యతిరేకమైన తక్కిన భావపరంపర అంతా దానంతటదే రూపుమాసిపో తుంది. కాబట్టి జ్ఞానం, శాంతి, మతం కావాలనుకునే వారంతా నా ఈ వాదన తప్పకుండా అంగీకరిస్తారు"

కాని ఆవిధంగా జరగలేదు. మతం విజ్ఞానంముందు నిలువలేక పోయింది. భూగర్భ, ఖగోళ, రసాయన, పదార్థవిజ్ఞాన, జంతు, శరీర శాస్త్రాల్లో జరిగిన పరిశోధనల ఫలితంగా మానవుడు యీప్రపంచంలో వుద్భ వించకముందే చెప్పటానికి వీలులేనంత కాలంక్రితమే యీభౌతిక ప్రపంచం యేర్పడిందని నిరూపించబడ్డది. యీభౌతిక ప్రపంచం లెక్కించటానికి వీలులేనన్ని గోళాలతో కూడివుంది. అందులో సూర్యుడు ఒక గోళం. భూమి సూర్యునిలోని ఒకభాగం. కాబట్టి యీవిషయం తెలుసుకుంటే మానవుడిప్రాణం యిందులో యెంత సూక్ష్మాతిసూక్ష్మమో తెలుస్తుంది.

వస్తువును బట్టిచూస్తే మానవుడిప్రాణం సూక్ష్మతమమే. కాని గుణా లను బట్టిచూస్తే దానికి చాలా ప్రాధాన్యం వుంది. అందుకనే మానవుడు యీఅగమ్య గోచరమైన ప్రకృతిలో చొరపడి రహస్యాలు కనుక్కోగలుగు తున్నాడు. పదార్థంలోనుంచి బయలు దేరిన ప్రాణం (చేతనం) పదార్థం

మీద పెత్తనం చేస్తుంది. లేకపోతే ప్రకృతి రహస్యాలు కనుక్కోటానికే వీల్లేదు. పదార్థంలో నుంచి ప్రాణం బయలు దేరిందని చెప్పినంత మాత్రంచేత ప్రాణం కేవలం అస్వతంత్రమని, శక్తివిహీన మని అనుకో కూడదు. యీప్రాధాన్యతను గుర్తించ గలిగితే మానవుడు మాఘ్యంగా మతంమీద ఆధారపడ నక్కర్లేదు. మానవుడు తన మనస్సుకు యేపని చేయటానికైనా శక్తివుందని గ్రహిస్తే అతడు సృష్టికర్త, కనపడని భగవంతునిమీద తనభారం వేసి నిష్కామ యోగం చేయవలసిన అవసరం వుండదు.

కాగా యీఅంతులేని బ్రహ్మాండమైన భౌతిక ప్రపంచంలో ప్రాణం యొక్క పరిమితి సూక్ష్మాతి సూక్ష్మం అని గ్రహించినప్పుడు మతంప్రకారం ప్రతిదీ భగవంతుని యిష్టం ప్రకారం నడుస్తుందనే భావన విడ్డూరం కాక మానదు. యేమతం తీసుకున్నా మానవుడు యీప్రపంచంలో ప్రధాన పాత్ర ధరించినట్లు మానవుని క్షేమం కోసమే భగవంతుడు యీఅంతులేని ప్రపంచాన్ని సృష్టించినట్లు చెప్పబడుతుంది. కాని యీభౌతికప్రపంచ అస్థిత్వంతో మానవ అస్థిత్వం, భౌతిక ప్రపంచ పరిమితితో మానవుని పరిమితి తులదూస్తే ఆవాదన కేవలం అసంభవమని, వూహాకల్పితమని తోచక మానదు.

మతం చెప్పినట్లుగా భగవంతుడు సర్వశక్తి సంపన్నుడై, సర్వవిద్యలు నేర్చిన సృష్టికర్తగా కనబడడు. అయితే సూక్ష్మాతి సూక్ష్మమైన మానవునికోసం అనంతమైన ఈభౌతిక ప్రపంచాన్ని సృష్టించ నక్కర్లేదు. ఇందులోనే అతని అజ్ఞానం కనబడుతుంది. విజ్ఞానవంతుడైన యే మానవుడూ యీ వాదన వొప్పుకోడు. యీ ప్రపంచం మానవ సుఖంకోసం సృష్టించబడితే యిందులో మానవునకు ప్రథమస్థానం యివ్వవలసివుంటుంది. ప్రాణం కంటె అనేక కోట్ల సంవత్సరాల ముందే వుద్భవించిన యీ ప్రపంచం మానవున కేవిధంగా ఆటస్థలం. అవుతుంది? ప్రాణం వుద్భవించనంతవరకూ యే పదార్థంలో కూడా చేతనావస్థ బహిర్గతం కావటానికి వీల్లేదు. పరిణామదశలో, చివరఃభాగంలో యిది బహిర్గతం అయింది. చేతనావస్థ లేనంతవరకూ ఆ సృష్టికి ప్రత్యేక ప్రయోజనం కనబడదు. యీ భౌతిక ప్రపంచం క్రమబద్ధమైన కొన్ని సూత్రాలకు కట్టుబడి వుంది. కాబట్టి అచేతనావస్థలో నున్నంత కాలం దీనికి ప్రత్యేకమైన ప్రయోజనం లేదు. ప్రకృతి కొన్ని నియమాలకు కట్టుబడివున్నా, యిందులో చలన

శక్తి స్వత సిద్ధంగా వుంది. ప్రకృతి శాస్త్రం ప్రకారం స్వతసిద్ధమైన చలన శక్తి సహాయంతో పదార్ధంలోని కొన్ని విభిన్న అణువులు సంయోగం పొంది ప్రాణం యేర్పడిన తరువాతనే జ్ఞానం (ఆత్మ, మనస్సు) బయలు దేరిందని తెలుస్తుంది. కాబట్టి యిందులో భగవంతుని జోక్యం కాని, ప్రత్యేక వుద్దేశం కాని లేదని నిరూపించవచ్చును.

అందుకనే బిషప్ బెర్క్లీ భౌతికవాదాన్ని నాస్తికవాదం అని ఖండించాడు. ప్రకృతివాస్తవికతత్వం మతం, మూఢవిశ్వాసం, వేదాంతం, మాయావాదం—వీటన్నింటికీ చోటు లేకుండా చేస్తుంది. ఇంద్రియాలు స్వతంత్ర శక్తి కలిగి ఆత్మతో నిమిత్తం లేకుండానే ముందుగానే యేర్పడి వస్తు పరిజ్ఞానాన్ని పొందుతూవుంటవి. యిది వాస్తవమైనప్పుడు వస్తు పరిజ్ఞానానికి మూలాధారమైన ప్రకృతి కూడ స్వతంత్ర శక్తి గలదై వూహా కల్పితమైన పరమాత్మ (భగవంతుడు) కంటె ముందుగానే యేర్పడిందని చెప్పితే త్రోసివేయటానికి వీల్లేదు. ఆత్మ, పరమాత్మ యీ రెంటినీ విడదీయటానికి వీల్లేదు వుంటే రెండూ వుండాలి. లేకపోతే రెండూ శూన్యం కావాలి. భౌతికవాద దృష్టితో వృద్ధిపొందిన యీ సిద్ధాంతం సైన్సు ద్వారా ఇవి శూన్యం అనే రుజువు చేయబడ్డవి.

హెగిల్ శిష్యుడైన ఫ్యూయర్ బాక్ తన గురువుగారి భావవాదాన్ని (ఐడియలిజమ్) ఆధ్యాత్మిక వాదంలోని అంతిమ దశ అని తేల్చి, తత్వశాస్త్రం నూతనమార్గాన్ని త్రొక్కాలని చెప్పాడు. "భావం పదార్ధ అస్తిత్వాన్ని బట్టి వుంటుంది. కాని పదార్థ అస్తిత్వం భావాన్ని బట్టి వుండదు. పదార్ధం (వస్తువు) కారణ కార్యతత్వాన్ని కలిగివుంది. కాబట్టి దాని మూలం అందులోనే యిమిడివుంది." యిక్కడ ఆత్మకు శరీరానికీ, మనస్సుకీ పదార్ధానికీ సాధారణంగా అనుకునే సంబంధం తలక్రిందులు చేయబడ్డది. మతం చెప్పిన ఆత్మ, పరమాత్మ, అనాది కారణం మొదలైనవి మనుష్యుని సృష్టించలేదు. మనుష్యుడే వాటిని సృష్టించాడు. యీ సిద్ధాంతాన్ని ఫ్యూయర్ బాక్ తన పుస్తకమైన "క్రైస్తవ మతసారం"లో బాగా విపులంగా వర్ణించాడు. యిందులోని విమర్శ అన్ని మతాలకు వర్తిస్తుంది.

ఫ్యూయర్ బాక్ సిద్ధాంతాన్ని క్లుప్తంలో యీవిధంగా చెప్పవచ్చును. "యీ భౌతిక ప్రపంచాన్ని మనం ఇంద్రియ జ్ఞానంతో

తెలుసుకోగలుగుతున్నాం. మనం నివసిస్తున్న యీప్రపంచమే వాస్తవమైన ప్రపంచం. మన మనస్సులు, భావాలు మెదడును బట్టివున్నవి. మెదడు శరీరంలో వొక భాగమై పదార్థంతో చేయబడి వుంది పదార్థం మనస్సుచేత సృష్టించ బడలేదు మనస్సే పదార్థ సంబంధమైన సృష్టిలోని వున్నత దశను పొందివుంది." హేగిల్ సిద్ధాంతం ప్రకారం "నీవు ఒక వస్తువు యొక్క అన్ని గుణాలను తెలుసుకుంటే ఆవస్తువునే తెలుసుకోగలుగుతావు అప్పుడు ఆవస్తువు మనసుంచి వేరుగా వున్నదనేది తప్పవేరే తేడా యేమీ వుండదు. నీయింద్రియాలు నీకు ఈసత్యాన్ని నేర్పినప్పుడు నీవు వస్తువులోని అంతిమ భాగాన్ని తెలుసుకోగలుగుతావు" ఈభావవాదమే వివిధ విజ్ఞాన శాస్త్రాలకు, ఫ్యూయర్ బాక్, మార్క్స్, యేంగిల్సుల భౌతికవాదానికి మార్గ దర్శికమైనది.

మతంమీద పూర్తిగా విశ్వాసం వున్నకాలంలోనే ఫ్యూయర్ బాక్ 'మానవునకు' ప్రధాన స్థానమిచ్చి ప్రతివిషయాన్ని మానవుడనే కొలతబద్దతో విమర్శించసాగాడు. ప్రతిదీ నూతనంగా కనపడ సాగింది. దేవుని జీవితం విమర్శించ బడ్డది. మతానికి మూలాధారం కనుక్కొన బడింది. మూఢ విశ్వాసాలకు మానవుని అజ్ఞానం కారణంగా చూపబడింది. ఫ్యూయర్ బాక్ మానవుడు మొదటినుంచి యిప్పటివరకు అజ్ఞానావస్థనుంచి విజ్ఞానావస్థకు వచ్చిన పరిణామావస్థనుచూపి మతాన్ని, మూఢ విశ్వాసాలను తీవ్రంగా ఖండించాడు. కాని ఫ్యూయర్ బాక్ వాదంలోకూడ కొంత లోటులేక పోలేదు. అతడు వస్తుపరివర్తనంలో వస్తుతత్వాన్ని అర్థంచేసుకోలేక పోయాడు. మానవ అస్థిత్వం మీద అతని మనస్సు ఆధారపడి వుంటుంది అతని అస్థిత్వం కొన్నిసూత్రాలకు కట్టుబడి వుంటుంది. ఆసూత్రాలేంటి? అవి యేవిధంగా పనిచేస్తవి?—వీటికి ఫ్యూయర్ బాక్ సమాధానం చెప్పలేదు. అతని 'మానవుడు' అన్నీ చెప్పగలిగాడు. కాని ఆ 'మానవుడు' తనకుతాను యేంటో చెప్పలేక పోయాడు.

మార్క్స్, ఏంగిల్సు ఫ్యూయర్ బాక్ విడిచిపెట్టిన వాటికి సమాధానం చెప్పగలిగారు. మానవుడు ఎప్పుడూ పరిణామం చెందుతువున్న సంఘంలో చేతనావస్థ గలిగిన శక్తిఅని వివరించారు. వారు ఫ్యూయర్ బాక్ వాదాన్ని యీవిధంగా సవరించారు. "మానవుని మానసిక ప్రవృత్తిని బట్టి

వాని అస్థిత్వం ఆధారపడివుండదు. సంఘంలోనివాని అస్థిత్వాన్నిబట్టి వాని మానసికప్రవృత్తి ఆధారపడివుంటుంది.'' మానవుని భౌతిక అస్థిత్వాన్నిబట్టి మానసికప్రవృత్తి వుంటుంది. కాని మానవుని అభివృద్ధికి ఆధారభూతమైన భావపరిణామం సాంఘిక పరిస్థితులనుబట్టి జరుగుతూవుంటుంది. యీభావ పరిణామం తిరిగి సంఘాన్ని, సంఘంలో అతని భౌతిక అస్థిత్వాన్ని మారుస్తూ వుంటుంది. మానవుడు యెప్పుడూ మార్పుచెందడు అని అనుకుంటే అతడు అన్ని కాలాల్లోనూ, అన్ని పరిస్థితుల్లోనూ ఒకేవిధంగా ఆలోచిస్తాడు అని చెప్పవలసివస్తుంది కాగా యెల్లకాలం ఒకేధర్మం వుంటుందనికూడా చెప్ప వలసివస్తుంది. ఇది మతంచెప్పేవాదన. కాని యీవిధంగా మానవ్రుడులేడు. కాబట్టి మానవుడు సంఘంలోని ఒకప్రాణి అని అర్థం చెప్పుకుంటే యీవిరుద్ధ భావాలకు ఆస్కారం వుండదు.

మానవుని మానసికప్రవృత్తి అతని అస్తిత్వాన్నిబట్టి వుంటుందని చెప్పి నప్పుడు యిదికొంత అస్పష్టంగా వుండవచ్చు. కాబట్టి మానవునకు ప్రకృతికి వున్న సంబంధాన్నిచెప్పి కారల్ మార్క్సు దీన్ని స్పష్టంచేసాడు. "ప్రకృ తితో కార్యానికి గడంగి మానవుడు ప్రకృతిని మారుస్తూ దానితోపాటు తన ప్రవృత్తినికూడ మార్చుకుంటూ వుంటాడు మానవుని భౌతిక అస్తిత్వం యెప్పుడూ వొకేవిధంగా వుండదు. మానవుడు ప్రకృతిలో వొకభాగం కాబట్టి ప్రకృతితో అతనికున్న సంబంధాన్ని విడదీయటానికి వీల్లేదు. కాగా యీసంబంధంలో మానవుడు నిత్యం ప్రకృతితో కార్యానికి గడం గుతూ ప్రకృతిని మారుస్తూ వుంటాడు. ప్రకృతి మారుతున్నకొద్ది ప్రకృతిలో భాగమైన మానవుడు మారుతూవుంటాడు. అతనిలోమార్పు అతని మానసిక ప్రవృత్తిలో ప్రతిబింబిస్తూవుంటుంది. మానవుడు తనజీవితంకోసం ప్రకృతితో పోరాటానికిదిగి ప్రకృతిని లొంగదీస్తాడు తక్కిన జంతువులు తమ జీవి తాన్ని ప్రకృతి కనుబంధంగా గడపుకుంటవి యీ వ్యత్యాసమే మానవుణ్ణి తక్కిన జంతువులనుంచి వేరుచేస్తుంది. యీపోరాటంకూడా మానవుడు వ్యక్తిగతంగాకాక సమిష్టిగా (సంఘం) జరుపుతాడు. మానవుడు పుట్టుక నుంచి సమిష్టిగా (సంఘంలో ఒకప్రాణి) వ్యవహరిస్తాడు. కాబట్టి అతని అస్తిత్వం సమిష్టి అస్తిత్వాన్నిబట్టి వుంటుంది. అతడు కట్టుబడిన సూత్రాలు

అతని అస్థిత్వంలో కాక సమిష్టి అస్తిత్వాన్నిబట్టి, సాంఘిక సంబంధాల్ని బట్టి అర్థంచేసుకోవాలి ''

సైన్సు సహాయంతోనూ, హెగెల్ గతితర్కవాద సహాయంతోనూ మార్క్సు సాంఘిక చరిత్రలో చాలావరకు కృషిచేసి, మానవుని ప్రవృత్తి అతని నిత్యజీవితాన్నిబట్టి వుంటుందనే నిర్ణయానికివచ్చాడు. మానవుని జీవిత పద్ధతి మారుతున్నకొద్దీ దానితోపాటు అతని మానసిక ప్రవృత్తి కూడా మారుతూ వుంటుంది. మతం, తత్వశాస్త్రం, ధర్మశాస్త్రం, చట్టం—మొదలైనవన్నీ మానవసమాజంలోని ఆర్థికసంబంధాన్ని బట్టి ఉత్పన్నమైనవి.

యేంగిల్సు ''అన్ని శాస్త్రాల్లోనూ భావానికి, అస్తిత్వానికి, ప్రకృతికి చేతనానికి వున్న సంబంధం ప్రధాన సమస్యగా చర్చించబడిందని'' చెప్పుతూ దానికి అతడు యీవిధంగా సమాధానం చెప్పాడు. ''భౌతిక వాదం ప్రకృతిని (పదార్థం) ప్రధానంగానూ, మనస్సును రెండవదానిగాను భావిస్తుంది'' యీమూల సూత్రంతో భౌతిక వాదాన్ని స్పష్టపరచి ఏంగిల్సు యీవిధంగా ప్రశ్నిస్తాడు. ''భావ—అస్తిత్వ సంబంధం మరొక విధంగాకూడ చూడవలసి వుంటుంది. మనచుట్టూవున్న ప్రపంచాన్ని గూర్చి యేర్పడిన భావం ప్రపంచంతో యేసంబంధాన్ని పెట్టుకొని యేర్పడు తున్నది? మనభావం సర్వస్వతంత్రమైనదని అంగీకరిస్తే యదార్థ ప్రపంచాన్ని తెలుసుకోగల శక్తిగలిగివుందా? యదార్థ ప్రపంచాన్నిగూర్చి మనకున్న ఆలోచన, అభిప్రాయాలతో వాస్తవ ప్రపంచ ప్రతిబింబాన్ని సృష్టించ గలుగుతామా?'' వీటికి సరియైన సమాధానం చెప్పుతుంటే తత్వశాస్త్రంలోని భౌతిక వాదాన్ని, భావవాదాన్ని ఒకదానికొకటి పొత్తులేకుండా వేరు చేస్తవి. యీభావ వాదాన్నే ఫ్యూయర్ బాక్ 'తత్వశాస్త్ర సంబంధమైన ఆధ్యాత్మిక వాదం' అని నామకరణం చేశాడు.

భావ వాదం మనకు కనబడే యీప్రపంచాన్నుంచి వేరుగా మరొక 'వాస్తవ ప్రపంచం' వుందని వాదిస్తుంది. యీరెంటినీ జడం - చేతనం, శరీరం - ఆత్మ, ప్రకృతి - పురుష, మాయ - సత్యం, కర్మ - మోక్షంగా వర్ణిస్తుంది. భౌతికవాదం యీభేదాన్ని అంగీకరించదు. కాగా సైన్సు యిలాంటి తేడా యేమీలేదని, యిది కేవలం కల్పితమని రుజువుచేసింది.

హిందూ వేదాంతం యీమాయా ప్రపంచాన్ని తప్పించుకో గలిగితే మానవుడు తరించి మోక్షం పొందగలుగుతాడని చెప్తుంది. కాని యెవరూ ఆమోక్షం యెలాంటిదో చూచి, అనుభవించి తిరిగివచ్చి చెప్పనవారు లేరని చెప్పినప్పుడు యీవాదానికి విలువవుండదు. 'మతంద్వారా పొందిన యీఅనుభవం' యితరులు పొందటానికి వీల్లేదు. కాబట్టి మూఢవిశ్వాసంతో యోగిపుంగవుల మాటలు నమ్మవలసి వుంటుంది. అతడు యోగసమాధిలో వున్నప్పుడు కలిగిన కలలు, పిచ్చివూహలు, భ్రమలు మొదలైనవి యదార్థమని, భగవంతుని లీలలని, జ్ఞానమని మూఢ్యంగా నమ్మాలి. కాదని సైన్సు రుజువు చేస్తున్నా దాన్ని త్రోసివేసి విశ్వసించాలి. యీ తత్వం భౌతిక వాదానికి వ్యతిరేకం. భౌతికవాదం చుట్టూవున్న వస్తువులను బట్టి సత్యాన్ని తెలుసుకుంటుంది. చుట్టూ ప్రపంచాన్ని మరచిపోయి మనస్సులో వూహా ప్రపంచాన్ని నిర్మించుకొని కలలుకంటూ వుండటం అసలు వాస్తవికాన్ని సత్యాన్ని మరచిపోటం అవుతుంది. యిది భౌతికవాద వ్యతిరేకులు చేస్తున్న పని.

మార్క్సు భౌతికవాదంలోని ముఖ్యసూత్రాలు—" (1) వస్తువులు మన మనస్సు, ఇంద్రియాల యొక్క సంబంధం లేకుండానే స్వతంత్రంగా అస్తిత్వాన్ని కలిగివుంటవి. (2) వస్తువులోనూ వస్తు తత్వంలోనూ యేమీ భేదంలేదు. తెలుసుకోగలిగిన దానికీ — తెలుసుకోవలసిన దానికీ వున్న భేదమే భేదం (3) సైన్సులోని వివిధశాఖల ద్వారా మనం విజ్ఞానం సంపాదించటానికి హేతువాదం మీద ఆధారపడాలి. జ్ఞానం పరివర్తనం చెందకుండా, యిదివరకే సృష్టించబడ్డ రెడీమేడ్ దుస్తులుగా భావించ కూడదు. అజ్ఞానంనుంచి క్రమేపి విజ్ఞానం యేర్పడుతూ వుంటుంది."

విజ్ఞానం సంపాదించటానికి ప్రకృతితో సంబంధం పెట్టుకొని కార్యాచరణకు దిగాలి. సాక్షీభావం వహించి, ప్రకృతితో సంబంధం లేకుండా కళ్లు మూసుకొని ఆరాధనకు పూనుకుంటే ప్రకృతి యెప్పుడు అగమ్యగోచరంగానే వుండిపోతుంది. మన యింద్రియ జ్ఞానం ద్వారా మనం పొందే వస్తు జ్ఞానం సత్యబద్ధమైనదో, కాదో తెలుసుకోవాలంటే మనం మననుంచి దూరమైన వస్తువు దరిచేరి వస్తువు మన యింద్రియ జ్ఞానానికి సరిపోయిందో లేదో పరీక్షచెయ్యాలి. బెల్లం రుచి తిన్నప్పుడు తెలుస్తుంది. అప్పుడు వస్తు తత్వం

తెలియదనే భావం నశిస్తుంది. వస్తువును వస్తువులో కాక మనదిగా చేసుకొని చూచినప్పుడు ఆ వస్తు తత్వం మనకు తెలుస్తుంది ప్రకృతిని యీ విధంగా అర్ధంచేసుకోటం యిప్పటిది కాదు. మానవుడు మొదటినుంచి ఆధ్యాత్మిక చింతనతో కాక కార్యాచరణతోనే ప్రకృతిని తెలుసుకుంటూ వచ్చాడు. మానవుడు మృగదశలో వున్నప్పుడు ఆకలిని పోగొట్టుకోటానికి కాయలు యేరుకొని చేపలు పట్టుకొని వాటిని తిన్న తరువాతనే ఆ పండ్లు చేపలను గూర్చి జ్ఞానం సంపాదించ గలిగాడు. ఆధ్యాత్మికవాది యెంత గొప్పవాడైనా పండు, చేప ఆ మానవుని కళ్ళకు కనపడే వాటికి మించి యదార్ధమైనవి వేరుగా వున్నవని అతనిచేత వొప్పించలేడు. శంకరాచార్యుడు వచ్చి అతడు తినే పండు మాయ, చేప మిధ్య అని వాదిస్తే అతడు శంకరాచార్యుని యెగతాళి చేస్తాడు.

ప్రకృతితో సంబంధాన్ని పెట్టుకోటం మానవ నైజగుణం. కాని మతం, వేదాంతం . ఆధ్యాత్మిక తత్వం అతన్ని తన నైజగుణం మరచిపోయేటట్లు చేసినవి. ప్రకృతి నుంచి దూరం చేసి అతనికి అజ్ఞానాన్ని బోధించినవి. భావాలు వాటంతటవి వూడిపడవు. మానవుడు తాను ఆచరించే కార్యకలాపాలను బట్టే జ్ఞానం అలవరుచుకుంటాడు. ఆధ్యాత్మిక వాదంద్వారా మానవుడు యీ కార్య కలాపాలనుంచి దూరం చేయబడ్డాడు. అతని సిద్ధాంతాలకు అతని ఆచరణకు సంబంధంలేదు. నిత్య జీవితంలో మానవుడు చేసే కర్మకాండలు మిధ్యగా బోధించబడ్డది. ఊహా కల్పితం సత్యంగా వర్ణించబడ్డది.

దాన్ని మార్క్స్ యీవిధంగా విమర్శించాడు. "జీవిత సిద్ధాంతాలు నిత్యజైనందిన కర్మకాండలు ఆధ్యాత్మికం, భౌతికం అని ఒకదానికొకటి సంబంధం లేకుండా విడదీసినప్పుడు మనస్సు యితర వస్తువుల నుంచి తనను వేరుగా భావిస్తుంది. వాస్తవిక వస్తువులను మరచిపోయి మనస్సువూహా కల్పిత వస్తువులనుగూర్చి ఆలోచించటం ప్రారంభించినప్పుడు యీభౌతిక ప్రపంచం మాయగా భావించి, దీన్నుంచి విముక్తి చెందాలనే అభిలాషతో కల్పనా వస్తువులనే వాస్తవంగా భావించి వాటికోసం కృషిచేస్తుంది."

19 వ శతాబ్దంలో అభివృద్ధి చెందిన సైన్సు యీ వాదాన్ని ఖండించి పదార్ధ అస్తిత్వాన్ని రుజువుచేసింది సైన్సుకాని, భౌతికవాదంకాని సంపూర్ణ

జ్ఞానం ఒక్కసారిగా పొందవచ్చునని చెప్పదు. అది అసంభవం. సర్వం ఒక్కసారి తెలుసుకోగల్గితే యిక యీజీవితమే అనవసరం అవుతుంది. సైన్సు యింకా మనం తెలుసుకోవలసింది చాలావున్నా తెలుసు కోటానికి అవకాశం వుందని చెప్పుతుంది. భౌతికవాదం మానవబుద్ధికి అందగలిగిన దంతా పదార్ధంఅని చెప్పుతుంది పదార్ధం కానిది పదార్ధంతో చేయబడ్డ మానవబుద్ధికి అతీతం. మతం వూహతో ఆలోచించిన ఆత్మను సైన్సు ఆచరణ ద్వారా రుజువుచేయటానికి ప్రయత్నిస్తుంది. ఆత్మ వాస్తవమైతే దానికి పరిణామావస్థ వుండితీరాలి. ఒకదశలోని మానవుని మానసిక ప్రవృత్తి అంతకుముందు పొందిన జ్ఞానాన్నిబట్టి వుంటుంది.

మానవుడు అనుభవాన్ని, ఇంద్రియజ్ఞానాన్ని బాహ్య ప్రపంచంతో సంబధం పెట్టుకునే గడిస్తున్నాడు. కళ్ళుమూసుకొని కూర్చుంటే యీ జ్ఞానం పొందలేడు. బాహ్యప్రపంచంతో సంబంధం పెట్టుకున్నప్పుడే యిలాంటి జ్ఞానం యేర్పడుతుంది. యీజ్ఞాన సంపత్తుకు అంతులేదు. మనం తెలుసుకున్న కొద్దీ యింకా తెలుసు కోవలసింది యెంతో వుంటుంది. వెనకటి జ్ఞానాన్ని ఆధారం చేసుకొని ముందుకుపోతూ వుంటాము. ముందుకు వెళ్ళినకొద్దీ వెనుకటిదాన్ని లోపాలుంటే సవరించుకుంటూ వుంటాము. కాబట్టి సంపూర్ణజ్ఞానం వుందని కాని, యెల్లకాలాలకు పనికివచ్చే సత్యం వొకటుందని కాని చెప్పటానికి వీల్లేదు.

18, 19 శతాబ్దాల్లోని తత్వశాస్త్రజ్ఞులైన కవులు కొంతవరకు వూహా ప్రపంచంలో కవిత్వం అల్లినా యదార్ధ ప్రపంచాన్ని పూర్తిగా విడచి పెట్టలేక పొయ్యారు జర్మను కవిగోథే ఈవిధంగా అంటాడు. "పరిష్కరించటానికి నూతన సమస్యలు కనబడనప్పుడు భగవంతుని సృష్టి అయిన ఈప్రపంచంలో యేంచేయాలో నాకే అర్ధంకాకుండావుంది మనంనక్షత్రాలు సూర్యుడు మొదలైన గోళాలవంక తదేక ధ్యానంతో చూడాలి అక్కడ కూడా మనం తెలుసు కోవలసినవి కొన్నివుంటవి." మరొక కవికూడా యిదే విధంగా అంటాడు. "భగవంతుడు నాకు సత్యం—సత్య పరిశోధన వీటి రెంటిలో వొకటి కోరు కొనమంటే నేను యెప్పుడు రెండవదాన్నే అభిలషిస్తాను" యిందులో ప్రకృతిని తెలుసు కోవాలనే జిజ్ఞాస కవిలో స్పష్టంగా కనబడుతుంది. "వస్తువుయొక్క వాస్తవిక తత్వాన్ని తెలుసు

కోవాలంటే అదిఅనుభవంద్వారా ఆచరణలో తెలుసు కోవలసి వుంటుంది. కేవలం సిద్ధాంతాల వల్ల సత్యం బయటపడదు మనవుడు తన వూహలను (సిద్ధాంతాలు) ఆచరణద్వారా రుజువు చేయగలిగి నప్పుడే అది వాస్తవమని తెలుస్తుంది. అసలు భావమే ఆచరణనుంచి వేరుచేసి సత్యమని ప్రకటించటం కేవలం సిద్ధాంతీకరణ మాత్రమే అవుతుంది.'' (కారల్ మార్క్సు)

కేవలం భావం ఈభౌతిక ప్రపంచంనుంచి వేరుగా లేదు. ఈభౌతిక ప్రపంచాన్ని అధిగమించి ప్రత్యేకంగా భావ ప్రపంచం అనేది మరొకటి లేదు. ఈభౌతిక ప్రపంచం మిధ్యఅని వాస్తవిక ప్రపంచం మరొకటి వుందని వాదించటం సత్యదూరం భావం యెప్పుడు ఈభౌతిక ప్రపంచాన్ని ఆధారం చేసుకునే వుంటుంది. మానసిక ప్రవృత్తి మానవుడు తాను పొందిన అనుభవాన్ని బట్టివుంటుంది. మతం, విశ్వాసం మొదలైనవి అజ్ఞానంనుంచి బయలు దేరినవే.

'మన యింద్రియ జ్ఞానంద్వారా మనకు కనబడే ఈభౌతిక ప్రపంచ ప్రతిబింబాన్ని ఆధారం చేసుకొని వాస్తవిక ప్రపంచాన్ని మనం పూర్తిగా తెలుసుకోలేము' అనే వాదన మానవుని జిజ్ఞాసను చంపిమతం మీద ఆధార పడేటట్లు చేస్తుంది సైన్సు యెప్పుడూ పూర్తిజ్ఞానం సంపాదించానని చెప్ప లేదు. యింకా తెలుసుకోవలసింది చాలావుందని చెప్పుతుంది. అప్పుడు మతం భగవంతుని చూపించి మూఢ విశ్వాసాన్ని ప్రకోపిస్తుంది.

సైన్సు ఈవాదన అంగీకరించదు. మనం మిధ్యగా భావించే ఈభౌతిక ప్రపంచమే వాస్తవ ప్రపంచమని ఆచరణద్వారాచూపుతుంది. మనకు తెలియ నంతవరకు యేవైతే భగవంతుని లీలలుగా వూహించు కుంటున్నామో వీటిని సైన్సు పరిశోధనల ద్వారా ప్రకృతిలో యేవిధంగా జరుగుతున్నవో చూపిస్తుంది. తెలియనివాటినిగూర్చి యింకా పరిశోధనలు జరుగుతున్నవి. యింతవరకు జరిగిన పరిశోధనల బట్టి యీభౌతిక ప్రపంచసృష్టికి వేరేకారణం అనవసరంగా కనబడుతుంది పదార్థంలోనే కారణ-కార్య భావం వుందని చూపబడింది. కాని మూఢవిశ్వాసంతో వున్నవారికి సైన్సుచూపే హేతు వాదంలో సత్యం కనబడటం లేదు.

మానవుడు ఒకప్పుడు ఉరుములు, మెరుపులుచూసి భగవంతుని లీలలుగా భావించాడు. అవి యేవిధంగా వుత్పన్న మవుతున్నయో సైన్సు

చూపగలిగింది. ఆకాశంలో సూర్యుడు, చంద్రుడు యేమీ ఆధారం లేకుండా నిలబడటం మానవునకు భగవంతుని లీలగా కనబడింది. అవి ఆవిధంగా యెలా వుండగలుగుతున్నయో సైన్సు చూపగలిగింది. పెద్దపెద్ద పర్వతాలు, అంతులేని సముద్రాలు చూచి మానవుడు భగవంతుని లీలగా భావించాడు అవి యేవిధంగా యేర్పడుతున్నవో సైన్సుచూపించి, ప్రాణం అంటే యేంటో యెరుగని మానవునకు సైన్సు ప్రాణం యెలా వస్తుందో, యెలా పోతుందో బోధించగలిగింది యీవిధంగా అద్భుతకార్యాలు— అగమ్యగోచరం అనుకుంటున్న విషయాలెన్నో సైన్సు సహేతుకంగా చూపగల్గింది. యింకా తెలియని విషయాలనుగూర్చి పరిశోధనలు జరుగుతూ వున్నవి. కాబట్టి మానవుడు మూఢవిశ్వాసాన్ని వదలి విషయ పరిజ్ఞానానికి పూనుకుంటే సాధించలేనికార్యం వుండదని తేలుతుంది

ఒక ఫ్రెంచిశాస్త్రజ్ఞుడు యీవిధంగా వ్రాశాడు "ప్రకృతినిగూర్చి లోతుకిదిగి పరిశోధనలు జరిపినకొద్దీ ఈప్రపంచం వాస్తవమైనదనీ, క్రమబద్ధమైనదని తెలుసుకోగలుగుతున్నాం. ఈభౌతిక ప్రపంచంలో పదార్థం— చలనశక్తితప్ప మరేమీ లేదు......" ఇక్కడ చలనశక్తిని చేతనంలేక పరమాత్మగా భావించగూడదు. చలనశక్తి పదార్థంయొక్కగుణం.

# భౌతికవాదం—భావవాదం

భౌతికవాదం విప్లవ సిద్ధాంతం. మానవ పరిణామంలోనే విప్లవాలు అంతర్భూతంగా యిమిడివున్నవి. కాబట్టి భౌతికవాదం యెప్పుడూ అవసరమే అవుతుంది. ఈఅవసరాన్ని మార్క్సు, ఏంగిల్సు స్పష్టీకరించి ఒక ఆకారాన్నిచ్చారు. వీరి సిద్ధాతం ప్రకారం జ్ఞానం ప్రకృతినుంచి దూరంగా వుంటంవల్ల అభివృద్ధిచెందదు. ప్రకృతితో నిత్యసంబంధం పెట్టుకొని ప్రకృతిని జయించటంలోనే విజ్ఞానం పెరుగుతుంది. "యీభౌతిక ప్రపంచాన్ని గూర్చి తత్వశాస్త్రజ్ఞులు నానావిధాలుగా వర్ణించారు. కాని యీభౌతిక ప్రపంచాన్ని మార్చటమే నిజమైన తత్వశాస్త్రజ్ఞుడు చేయవలసిన పని." యీ ప్రపంచాన్ని మార్చటంలోనే మానవ విజ్ఞానం పెరుగుతుంది.

ఒక్కొక్కదశలో అప్పటి ప్రపంచాన్ని మార్చి అభివృద్ధికరమైన నూతన యుగాన్ని సృష్టించగలిగిన దాన్నిబట్టి ఆమానవ విజ్ఞానంయొక్క విలువ వుంటుంది

'మార్పు వొక్కటే సత్యం' అని హెగిల్ వాదించాడు. 'కనబడుతున్న ప్రతివస్తువూ సత్యబద్ధమైనది' ఈసిద్ధాంతం అంతకుముందు మానవచరిత్రనుగూర్చి వున్నఅభిప్రాయాల్ని తారుమారుచేసింది. చరిత్రయెప్పుడూ పరిణామం చెందుతూ వస్తుంది. ఒకదశ యేర్పడుతూవుంది ఆదశ మారి మరొకదశ యేర్పడుతూవుంది. కాని యేదశకాదశ వాస్తవమైనదే కాగా అన్ని దశలు అవసరాన్నిబట్టి యేర్పడుతూ వస్తున్నవి. యిది హెగిల్ సిద్ధాంతం. హెగిల్ యీ సిద్ధాంతం ప్రకారమే అతని భావవాదం (భావం స్వతంత్రమైనది. పదార్థంతో సంబంధం లేకుండా భావం వుంటుందనే వాదన) దెబ్బతిన్నది. యేది చేయవలసినా యీ భౌతిక ప్రపంచంలోనే జరగవలసివుంటుంది. కాబట్టి వాటికి మూల కారణం యీ భౌతిక ప్రపంచ పరిణామంలో నుంచే తెలుసుకోవలసివుంటుంది హెగిల్ సిద్ధాంతాన్నాధారంగా తీసుకొని మార్క్సు తర్కబద్ధమైన భౌతికవాదాన్ని సిద్ధాంతీకరించాడు.

భౌతికవాదం వున్న వ్యవస్తను గూర్చి ఆలోచిస్తూ అంతటితో తృప్తి చెందదు. ఆ వ్యవస్త యేర్పడటానికి అందులో యిమిడి వున్న కారణాలను గూర్చి ఆలోచిస్తుంది. 'అగమ్యగోచరమైన విషయాలున్నవి. వాటి జోలికి పోగూడదు. మానవవిజ్ఞానానికి కొంత పరిమితి వుంది, అనే తత్వాన్ని భౌతికవాదం అంగీకరించదు. మానవుడు అనాదినుంచి పొందుతూ వచ్చిన అనుభవం ఆధునిక విజ్ఞానం భౌతికవాదానికిపునాది రాళ్ళు. మానవుని బుద్ధికి అతీతమైన విషయాలు లేవని భౌతికవాదం బోధిస్తుంది. అనాదినుంచీ అజ్ఞానంతో, మూఢవిశ్వాసంతో మానవుడు నిర్మించుకున్న వూహా ప్రపంచాన్ని కల్పితమని రుజువుచేసి అతని బుద్ధికి హేతుబద్ధమైన స్వతంత్రాలోచన శక్తిని భౌతికవాదం కలిగిస్తుంది యేదీ శాశ్వతంకాదు. మార్పు చెందటం వస్తువు యొక్క ధర్మం కాబట్టి 'మార్పే శాశ్వతమైనది'. మానవుడు యీ ప్రపంచాన్ని, ప్రపంచంతోపాటు తాను మారేటట్లుగా భౌతికవాదం అతన్ని కార్యాచరణకు దింపుతుంది.

తక్కిన తత్వశాస్త్రాలు లాగా భౌతికవాదం ఒక అభిప్రాయం లేక కొన్ని అభిప్రాయాల కూర్పు కాదు. ధర్మశాస్త్రాలుగా ఇది కూడా ఒక శాస్త్రం కాదు. ప్రకృతి, చరిత్ర, సంఘం క్లుప్తంలో చెప్పాలంటే మానవ జీవితంలో వివిధ శాఖలను, వివిధ సమస్యలను సరిగ్గా అర్థం చేసుకొని వాటిని మానవ సౌఖ్యం కోసం మార్పుచేయటం భౌతికవాద లక్షణం. భౌతికవాదం దివ్యదృష్టినిగాని, సంపూర్ణ జ్ఞానాన్ని కాని అంగీకరించదు. జ్ఞానం పొందటానికి పరిమితి లేదని వాదిస్తుంది. ఏదో వొక మహానుభావుడు యేదో వొక యుగంలో అవతరించి ఆ యుగానికి భావిప్రపంచానికి సరిపోయేటట్లుగా ఒక్కసారి కావలసిన జ్ఞానం ప్రసాదించి పోతాడు. ఆ జ్ఞానోపదేశం సర్వకాలాల్లో సర్వవేళల పనికివస్తుందనే మూఢవిశ్వాసానికి భౌతికవాదం వ్యతిరేకం. భూతవర్తమాన కాలాల విజ్ఞానాన్నంతా సమీకరించి ఆ ఆధారంతో భావికాలానికి వుపయోగపడే నూతన వ్యవస్థను సృష్టిస్తుంది. కాబట్టి భౌతికవాదం అంటే మానవాభివృద్ధి అనే గ్రహించాలి.

భౌతికవాదం విప్లవసిద్ధాంతం కావటం చేత సహజంగా పైవర్గాలకు చెందినవారు ప్రాక్పశ్చిమ దేశాల్లో యెక్కడున్నా అంగీకరించరు. పీఠాధిపతులు, జమీందార్లు, పెట్టుబడిదారీవర్గం—యీ వర్గాలు ఆ యా దశలను బట్టి అధికారంలో వున్నప్పుడు అప్పటి సంఘం వారి కనుకూలంగా నిర్మించబడి తక్కిన మానవులను బానిసత్వంలో అట్టిపెట్టటం జరుగుతూ వచ్చింది. భౌతికవాదం మానవాభివృద్ధికి కృషిచేస్తుంది కనుక యీ సిద్ధాంతం అధికారంలో వున్న వర్గానికి యెప్పుడూ యెక్కడా గిట్టదు. దీనికి సరిహద్దులు లేవు.

పాశ్చాత్య నాగరికతను భౌతికవాదం అని విమర్శించే వారికి భౌతికవాదం కాని, పాశ్చాత్య నాగరికతగాని బొత్తిగా తెలియదనే చెప్పాలి. ప్లేటో కాలంనుంచి 17, 18 శతాబ్దాల్లో దాదాపు చివరవరకు పాశ్చాత్య తత్వశాస్త్రం పూర్తిగా హిందూవేదాంతం లాగా మతం, మూఢవిశ్వాసం, ఆధ్యాత్మిక, భావవాదాలతో భౌతికవాద వ్యతిరేకంగానే అభివృద్ధి చెందుతూ వచ్చింది.

భారత దేశంలో విద్యాధికులమని చెప్పుకుంటూ భావ (ఆధ్యాత్మిక) వాదాన్ని బోధిస్తూ భౌతికవాదాన్ని నిరసించే వారికి యదార్ధంగా యీరెంటిని గూర్చి యేమీ తెలియదు. భౌతికవాదమంటే కేవలం 'తిండి గుడ్డ...'ను గూర్చిన సిద్ధాంతం అనుకున్నట్లే భావవాదమంటే జీవితానికి సంబంధించినదనేదృష్టితప్ప దాని నిజస్వరూపం వీరికి తెలియదు. సాధారణంగా భావవాదంఅంటే జీవితాన్ని ఆదర్శవంతం (సుఖవంతం) చేయటమనే అర్ధంలో వాడబడుతుంది. కాని భావవాద సిద్ధాంతానికీ, యీఅభిప్రాయానికీ యెక్కడా సంబంధంలేదు. జీవితం ఆదర్శ ప్రాయం చేయటం భౌతిక వాద లక్షణం. భావ వాదానికి ఈతత్వంలేదు. ఈప్రపంచంలోని లోటు పాట్లు తొలగించి, మానవ సమాజాన్ని అభివృద్ధి దాయకంగా మార్చి నూతనయుగం సృష్టించాలనే భౌతికవాద ఆదర్శంకంటె వుత్కృష్టమైన ఆదర్శం మరొకటి లేదు.

భౌతికవాద తనయీఆదర్శంకోసం, మానవసమాజాన్ని ముందుకునడపటానికి కావలసిన త్యాగంచేయటానికి యెప్పుడూ సంసిద్ధుడే. సన్యాసి కళ్ళు మూసుకొని జపంచేసుకుంటూ తనలోతాను సంతృప్తి చెందుతాడు. సైంటిస్టు ఒక విషరోగాన్ని అరికట్టటానికి అందుకు ప్రతిగా మందుకనిపెట్టే విషయంలో జీవితమంతా ధారపోయటానికి సిద్ధపడతాడు. ఇందులో యెవరు గొప్పవారు ? యెవరు త్యాగమూర్తులు ? విప్లవవాది విప్లవం నెగ్గించటానికి కష్టపడు కుంటాడు. కాళ్ళకు బలపాలు కట్టుకొని తిరుగుతాడు. ఆరోగ్యం కోల్పోతాడు. జైలు జీవితం అనుభవిస్తాడు, ఉరికంబాని కెక్కటానికూడా సిద్ధపడతాడు. తృప్తిగా, షడ్రసోపేతంగా భుజించే ధనికుడు, లేక అతని యేజంటు గద్దెయెక్కి, సోఫాలోకూర్చుని బానిసత్వం, దారిద్ర్యం, అజ్ఞానం చిరస్థాయిగా వుంటానికి ధర్మశాస్త్రాలు, మతగ్రంధాలు వల్లించి అంతులేని నీతులు బోధిస్తూ గంభీరోపన్యాసం చేస్తాడు. సన్యాసులు, మహాత్ములు వారికి అండగా 'నిరాడంబర జీవితం—ఆధ్యాత్మిక చింతన, అని బోధిస్తూ వుంటారు. కాని వీరు, వీరు బలపరచే ధనికులు భౌతికంగా స్వర్గాన్ని అనుభవిస్తూ మానసికంగా యెంతో నీచ ప్రవృత్తి కలిగివుంటారు. వీరు యీవిధంగా వుండగూడదని అనుకున్నా, వీరి సిద్ధాంతాలు వీరిని అదేమార్గంలో బంధిస్తవి—ఇందులో విప్లవవాది గొప్పవాడా?

లేక రెండో తెగకు చెందినవాడు గొప్పవాడా? యెవరు త్యాగమూర్తులు? జీవితాన్ని ఆదర్శ ప్రాయంగా చేయాలంటే భౌతికవాదియే చేయగలుగు తాడు.

జీవితాన్ని ఆదర్శవంతం చేయటానికి భౌతికవాది హృదయ పూర్వకంగా, హేతుబద్ధంగా ప్రయత్నిస్తాడు. భావవాది తాను యెన్ని వుపన్యాసాలిచ్చినా, యెన్ని నీతులు బోధించినా ఆచరణలో జీవితాన్ని నాశనం చేయటానికే వుపకరిస్తాడు. భౌతికవాదికి జీవితం ప్రధానమైన సమస్య. దీన్ని తన జీవిత సమస్యగా భావించి యిందుకోసం తన జీవిత మంతా ధారపోయటానికి వుద్యుక్తుడవుతాడు. ఆదర్శం లేకుండా జీవించటం అనవసరం భౌతికవాది దాన్ని ఆదర్శంగా పెట్టుకొని అందుకోసం కృషి చేస్తాడు. యపిక్యూరస్ చెప్పినట్లుగా 'మానవ సంఘాన్ని వున్నతపథం చేర్చే కృషిలో అతడు ఆనందం అనుభవిస్తాడు.'

'నేడు రష్యా వొక్కటే భౌతికవాదాన్ని ప్రభుత్వ సిద్ధాంతంగా చేపట్టి ఆచరణలో పెట్టుతుంది' ఆధ్యాత్మికవాది చెప్పినట్టు భౌతికవాదాన్ని అర్థంచేసుకుంటే నేడు రష్యాలో జాతిఅంతా పతనమై అధోగతిలో వుండ వలసింది. కాని రష్యా నేడు యేపరిస్థితిలో వుంది? భావవాది వూహించి నట్లు కాక దానికి పూర్తిగా వ్యతిరేకంగావుంది.

భావవాది వూహాప్రపంచంలో స్వర్గాన్ని స్థాపించాలని కలలు కన వచ్చు. కాని అతని దృష్టిలో మానవుడు సర్వస్వతంత్రుడు కాడు. మానవు నకు మించి మరొక అగమ్యగోచరమైన శక్తి మానవుని వెనుక వుందని అతని భావం కాబట్టి మానవుడుచేసే ఆచరణలో అతనికి విశ్వాసం వుండదు. యీవిధంగా అతడు నిర్మించుకున్న సౌధాన్ని అతడే కూలద్రోస్తున్నాడు. యిది ఆధ్యాత్మిక వాదులే వొప్పుకుంటున్నారు. యీక్రింద ప్రాక్పశ్చిమ దేశాలకు చెందిన యిద్దరు శాస్త్రకారుల అభిప్రాయాలు చూపబడ్డవి.

మేజనీ (ఇటలీనాయకుడు) 'మానవుని బాధ్యతలు' అనేవొకపుస్తకం వ్రాసాడు. అతని దృష్టిలో మానవుడు కేవలం తనబాధ్యతను నెరవేర్చుటమే. మానవునకు ప్రత్యేకమైన హక్కులులేవు. అంతకు ముందు శతాబ్దంలో ఫ్రాన్సులో విప్లవం జరిగింది. ఆవిప్లవంలో కాపిటలిస్టు వర్గం ప్రధానపాత్ర వహించి భౌతికవాద దృష్టితో మానవ హక్కులకోసం పోరాడింది, అదే

వర్గం తిరిగి వందసంవత్సరాల తరువాత మేజనీ నాయకత్వంక్రింద భావవాదాన్ని బోధించి మానవునకు హక్కులు లేవు, బాధ్యతలేఅని ప్రచారం చేసింది. యిది నిజంగా బానిసత్వం. హక్కులు లేని బాధ్యత మానవుని బానిసగా చేస్తుంది. కాని మేజని దీన్ని సమర్థిస్తూ యీవిధంగా వ్రాసాడు. "మూలకారణమైన పరమాత్మని త్రోసివేస్తే దానిమీద ఆధారపడి మానవుని బాధ్యతగా యెంచబడిన, ధర్మసూత్రాలన్నీ ధ్వంసం అయిపోతవి," యిది భౌతికవాదాన్ని యెదుర్కొనటం. స్వతంత్రం పేరిట బానిసత్వాన్ని స్థాపించటం. మేజనీ యీవిధంగా భావవాదాన్ని ప్రచారంచేసి ఫాసిస్టు ప్రభుత్వ స్థాపనకు పునాదివేసాడు యీవాదాన్ని సాధారణంగా భారతదేశంలోని ఆధ్యాత్మికవాది సమర్థిస్తాడు. మేజనీ అభిప్రాయంలో అతనికి లోటు కనబడదు. ఆధ్యాత్మిక వాదంలో ప్రమాణంగా యెంచబడే యస్. రాధాకృష్ణన్ (కాశీవిశ్వ విద్యాలయ వైస్ - ఛాన్సెలరు) యీవిధంగా వ్రాస్తాడు. "మన నైతిక సూత్రాలకంటె మతానుభవం వుత్కృష్టమైనది. నైతిక జీవితంద్వారా యీ ప్రపంచాన్ని, భగవంతుని తెలుసుకోటానికి కొంత ప్రయత్నం చేయవచ్చు. కాని మతం లేకుండా కేవలం నైతిక సూత్రాలతో యిది సాధ్యపడదు. మతం ద్వారానే సంపూర్ణజ్ఞానం - మోక్షం పొందటానికి వీలుంది." జీవితాన్ని సుఖవంతం చేసుకోవాలంటే విధిగా మతాన్ని అంగీకరించి మతం చెప్పినట్లు ప్రవర్తించాలి. మానవుడు జ్ఞానంసంపాదించి మనస్ఫూర్తిగా నైతికధర్మాన్ని ఆచరించాలనుకున్నా సాధ్యపడదు. మతం చెప్పినట్లుచేస్తేనే అది సాధ్యపడుతుంది. కాని మనం ఆధ్యాత్మిక సంపత్తికి ఆలవాలమై తక్కిన ప్రపంచానికి మార్గదర్శకం అనుకుంటున్న పవిత్ర భారతదేశంలోని మానవజీవితంచూస్తే మతమే ప్రధానమై, మతంద్వారా నైతిక జీవితాన్ని గడపుతున్న భారతమాత పుత్రులు యెంత సుఖవంతంగా జీవితాన్ని గడుపుతున్నారో బోధపడుతుంది.

ఐరోపాఖండంలో వర్తకసంఘం నూతనశక్తిగా అభివృద్ధి చెందుతున్న సమయంలో ఆధునిక విజ్ఞానం అయిన సైన్సుగూడా అభివృద్ధిచెందసాగింది. యీసైన్సు సహాయంతో వర్తకసంఘం అంతకుముందువున్న జమీందారీవ్యవస్థకు పునాది అయిన మతంమీద తిరుగుబాటు చేసింది. దీంతో మత స్వీకారంతో స్థాపించబడ్డ జమీందారీవిధానం కూలిపోయింది.

వర్తకసంఘమైన బూర్జువా వర్గం అధికారాన్ని చేపట్టింది. జమీందారీ విధానంలో బానిసత్వంలో వున్నంతవరకూ విప్లవ పంథాతో తిరుగుబాటు లేవదీసిన యీవర్గం అధికారాన్ని చేపట్టగానే తిరిగి మతాన్ని నెలకొల్పి మతంపేర తమ అధికారాన్ని సుస్థిరం చేసుకోటానికి ప్రయత్నించింది.

యేదో ఒకవిధమైన అధికారం లేకపోతే సంఘాన్నంతా తమక్రింద అట్టిపెట్టుకోటానికి వీల్లేదు. ఆ అధికారం భూమిమీద సుస్థిరం చేయాలంటే దానికి వెనుక ఒక భగవత్స్వరూపాన్ని కల్పించాలి. కాబట్టి మతం, మూఢ విశ్వాసం తిరిగి నెలకొల్పబడ్డవి. భగవంతుడు తిరిగి ప్రవేశింపబడ్డాడు, కాని సైన్సుముందు ఇవి నిలవటంకష్టం అందుకని వీటికి నూతన స్వరూపం—భావవాదం యివ్వబడ్డది. అదివరకు సృష్టికర్త అని పిలువబడే భగవంతుడు ఒక అతీతమైన భావరూపంలో తిరిగి ప్రవేశించాడు.

క్రైస్తవ చర్చీను విమర్శిస్తూవచ్చిన వాల్టైరులాంటివారుకూడా తిరిగి యీనూతన మతాన్ని సమర్థించసాగారు. "భగవంతుడు లేకపోతే మనం ప్రత్యేకంగా వొక భగవంతుని సృష్టించవలసి వుంటుంది. బేల్ ను (18 శతాబ్దంలో నాస్తికవాదుల్లో ప్రముఖుడు) ఐదువందల రైతులను పాలించటానికి అధికారం యివ్వండి. అతడు వెంటనే మతంలో వున్న వుపయోగాన్ని తెలుసుకో గలుగుతాడు." మతం నిలబెట్టటానికి యింతకంటె బలవత్తరమైన వాదం కనబడదు. భగవంతుడు, మతం సంఘాన్ని బానిసత్వంలో అట్టిపెట్టటానికి వుపకరిస్తు[illegible]వని [illegible] చెప్ప నక్కర్లేదు.

బూర్జువావర్గం ద్వారా అభివృద్ధి చెందిన భౌతికవాదం తిరిగి బూర్జువావర్గం ద్వారానే నాశనం చేయబడుతుంది. యెందుకోసం భావవాదం సృష్టించబడ్డది యీ సిద్ధాంతానికి హెగిల్ స్వరూపాన్నిచ్చాడు. యీవాదం నిలవటానికి తిరిగి ద్వైత సిద్ధాంతాన్ని సృష్టించ వలసివచ్చింది. 'ఏకత్వ' సిద్ధాంతాన్ని అంగీకరిస్తే అదిభౌతిక వాదానికి త్రోవతీస్తుంది. లేక యీప్రపంచం శంకరాచార్యుని మాదిరిగా 'మాయ' అని వాదించవలసి వుంటుంది. కాని పదార్థం చేతనం నుంచి వుద్భవించదు. కనుకతిరిగి భగవంతుని సృష్టి అవసరం అవుతుంది. యీవిధంగా హెగిల్ సిద్ధాంతం తిరిగి మతాన్ని అధికారంలో పెట్టింది. తత్వశాస్త్రం భావవాదంగా మారింది.

చేతనం అస్తిత్వాన్ని కలిగి వుందని అంగీకరించినా ఈభౌతిక ప్రపంచాన్ని అధిగమించి వేరే యెక్కడో దాని అస్తిత్వం వుండదు. కాబట్టి భౌతిక ప్రపంచానికి లోబడే చేతనం వుంటుంది. ఆధునిక విజ్ఞానయుగంలో ఈప్రపంచం కేవలం మిధ్య అని వాదించటం తెలివితక్కువ. కాబట్టి భౌతిక వాదం మానవసంఘానికి విధిగా తత్వశాస్త్రం కావాలి.

19 వ శతాబ్దం మధ్యనుంచి యీ భౌతికవాదం తిరిగి శ్రామికవర్గ ఆదర్శంగా భావించబడింది. శ్రామికవర్గం అంతా బానిసత్వంతో క్రుంగి, కృశించిపోతూవుంది. కాబట్టి శ్రామికవర్గం స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలు పొందటమంటే దాంతోపాటు సంఘమంతా స్వాతంత్ర్యం పొందటం అవుతుంది. కనుక అధికారంలోవున్న పైవర్గం మతాన్ని ఆధారం చేసుకుంటే బానిసత్వంలో వున్న క్రిందివర్గం సైన్సు, భౌతికవాదాన్ని ఆధారం చేసుకోవాలి.

హెగిల్ భావవాదంనుంచి ఫ్యూయర్ బాక్ తత్వశాస్త్రాన్ని తప్పించి భావిప్రపంచానికి ఒకమార్గం చూపించాడు ఆమార్గం కారల్ మార్క్సు, ఫ్రెడ్ రిక్ ఏంగిల్సులచే చక్కచేయ బడ్డది. ఈమార్గంలో ప్రకృతి, చరిత్ర, సంఘం అన్నీ మానవునకు కళ్ళకు కట్టినట్లు కనబడుతున్నవి. తన చేతుల్లోనే తన భవిష్యత్తు వుందని అతడు తెలుసుకో గలిగాడు.

విడిపించినందునఁ జాణక్యుఁడు నామీఁదఁ గోపముగలిగి యున్నాఁడు. నేను నిచ్చటనే సేవ చేయుచుండెద' ననిన రాక్షసుఁడును సమ్మతించి వారిని విశ్రమింపం బంపెను.

పిమ్మట నమాత్యుఁడు విరాధగుప్తునిఁ 'బురవృత్తాంతము చెప్పు' మని యడుగ నతండును, 'జాణక్యుఁడు తానురాజ్య మిచ్చితినని గర్వించి రాజాజ్ఞలను భంగపఱిచినందునఁ జంద్రగుప్తునికి నతనిమీఁద నత్యంతకోపము గలిగియున్న' దనెను. రాక్షసుండు సంతోషించి, విరాధగుప్తుఁడా! నీ వీయహితుండిక వేషముతోనే పుష్పపురమునకుఁ బోయి యచ్చట యిష్టుఁడయ్యిన స్తనకలశుఁ డను వైతాళికునితో, 'నిప్పుడు చంద్రగుప్తునియాజ్ఞలను జాణక్యుఁ డాటంకపఱుచుటచేత వారిద్దఱికి వైరము కలిగియున్నది గదా! దానిని వృద్ధిఁబొందించుచు నప్పటప్పటివృత్తాంతమును గూఢముగాఁ గరభకునిచేత వ్రాసి పంపవలయును' నని చెప్పఁగా నతఁడును సమ్మతించి వెడలి పోయెను.

తరువాతఁ బుష్పపురమునుండి వణిగ్వేషమును ధరించి బ్రాహ్మణులు మూఁడాభరణములు తెచ్చి విక్రయించెదమని శకటదాసునకుఁ జూపఁగా, నతఁడు రాక్షసునితో 'అయ్యా! ఈవర్తకులు దివ్యాభరణముల మూఁటి నమ్ముటకుఁ దెచ్చి యున్నారు! వానిని మీరు చూచి పరిగ్రహింపుఁడు' అని చెప్పెను. రాక్షసుఁడు వానిని జూచి 'యీ మేలయినయాభరణములను దగినవెల యిచ్చి కొను' మని శకటదాసునితో జెప్పెను. అతఁడు మంచిదని కొనిపెట్టెను. చంద్రగుప్తచాణక్యులవిరోధమును నమ్మి రాక్షసుఁడు మిక్కిలి సంతోషముతో యుద్ధసన్నాహము చేయించుచు నావిరోధమును బరీక్షింపఁ

దగినచారులను బంచి రహస్యముగా విచారించుచుండెను. అక్కడఁ జాణక్యుఁడు రాక్షసునియత్నమును దనచారులవలనఁ దెలిసికొని విరోధించియున్నట్లు నటించుచుండెను.

అంత నొకనాఁడు చంద్రగుప్తుఁడు జనరంజనముగాఁ జంద్రికోత్సవమును జేయింపఁ బ్రాసాదమును శృంగారింప నాజ్ఞాపించెను. అది చాణక్యుఁడు నివారించెను. అంతట రాజు చాణక్యుని బిలిపించి యేల నివారించితి వని యడుగ, నాయన, 'నీవు నాశిష్యుఁడవే గనుక నన్ను నాక్షేపింపఁగూడ' దని ప్రత్యుత్తరము చెప్పెను. అందునకుఁ జంద్రగుప్తుఁడు 'నేను నీవు చెప్పినట్లు నడచుకొనుటకు రాజను గాని భృత్యుఁడను గాను' అని కోపముతో ధిక్కరించి చెప్పెను. ఇట్లిరువురు వాదించుచుండఁగా నాసమయమున స్తనకలశుం డనువైతాళికుఁడు రాజునొద్దకు వచ్చి వైరోద్దీపకము లైనవచనములతోడఁ గొన్ని శ్లోకములు చెప్పి రాజును బొగడెను. అప్పుడు రాజు వైతాళికునికి వేయిసువర్ణంబు లిమ్మని వైహీనరితో నాజ్ఞాపించినఁ జాణక్యుఁడు దానిని నివారించెను. అప్పుడు రాజు మిక్కిలి కోపించి 'కార్యము లన్నియు మీయాజ్ఞ వొప్పుననే జరగవలసినవా ?' అని యడిగెను. దానికిఁ జాణక్యుఁడు 'మంత్రి లేక స్వతంత్రముగా రాజకార్యములను రాజులు జరపుదురా?' అని మరల నడిగెను. దానికి రాజు 'నేను జరపఁగల' ననెను. చాణక్యుఁడు, 'అట్లయిన సంతోషమే. మేము స్వకార్యములను జూచుకొనుచున్నా' మని యధికారచిహ్నమైనయసిపుత్త్రికను గ్రింద వ్రేసెను. అప్పుడు రాజు, 'మంచిది. కౌముదీమహోత్సవమును నిషేధించుట కేమికారణ' మని యడిగెను. చాణక్యుఁడు 'మహోత్సవము చేయుట కేమికారణము ? నీవు చెప్పు'

మని యడిగెను. అందుమీఁద రాజు, 'నేను శత్రువులను జయించి సింహాసనాసీనుఁడనై జనులకు క్షేమము చేయఁబూని యున్నాను గాన నుత్సవము చాటఁబంచితి' ననెను చాణక్యుఁడు 'మనయొద్ద యశ్వాధ్యక్షగజాధ్యక్షులు లిరువురును మనచేతఁ ద్రోయఁబడిపోయి మలయకేతువునొద్ద నదే యధికారమున నమరియున్నారు. సేనాపతిలేమ్ముఁ డైనభాగురాయణుఁడు పర్వతేశ్వరునిఁ జంపితినని మలయకేతువుతోఁ జెప్పి యతని మిత్రుఁడై యున్నాఁడు. మలయకేతువు రాక్షసప్రేరితుఁడై మనపై దండెత్తి రాఁబోవుచున్నాఁడు. కాఁబట్టి యిది యుద్ధసన్నాహామునకు సమయమే కాని యుత్సవమునకు సమయము కాదని నిలిపివేయించితి' ననెను.

అది విని రాజు 'మలయకేతువు నేల నిగ్రహింపలే' దని యడుగ, 'అతని తండ్రిసాహాయ్యముచేత మనకు రాజ్యము లభించెను గనుక నతనిఁ జెఱయందుంచిన మనలను గృతఘ్నులందురని విడిచితిని. అతఁ డర్ధరాజ్య మడుగఁబోవుటయే యొకలాభ మని తలఁపఁదగును. నీకు రాజ్యము సిద్ధింపఁజేసితిని. ఇఁక నేది యెట్లున్నను సవరించుకోవచ్చు' ననెను. దానికి రాజు, 'నాకు రాజ్యమును నీ విచ్చుట యేమి? దైవికముగా వచ్చె' ననెను. దానికిఁ జాణక్యుఁ డత్యంతకోపావిష్టుఁడై, 'ఓరి దురాత్మా! నీకు రాజ్యము నే నీయక దైవికముగానా వచ్చినది? ఇఁక నేను గృతఘ్నుఁడవైననీమోము చూడను' అని దిగ్గున లేచి, 'ఓరిరాక్షసా! ఎంతచేసితివిరా! నీకే తగును' అనుచు, నింటికి వెళ్లెను. రాజును నతనిపోకను లక్ష్యపెట్టక యుండెను. అదిమొదలు చంద్రగుప్తుఁడు చాణక్యుని ననాద

రించి తానే స్వతంత్రించి రాజకార్యములను జూచుకొను నని జన ప్రథపుట్టెను.

ఈ సంగతి నిజముగా నెంచి చారుఁడు శీఘ్రముగాఁ జని తనప్రభు వైన రాక్షసునికిఁ దెలియఁజేసెను. అక్కడఁ బాటలీపుత్త్రమం దుండి పోయి రాజద్వేష మనువ్యాజము చేత మలయకేతువు నాశ్రయించి కొలువుచేయుచున్న రోహితాక్షుఁడు మొదలగువారు యుద్ధప్రయత్నము చేయునప్పుడు మలయకేతువును జూచి 'మేము రాక్షసునికి లోఁబడియుండి యతని యాజ్ఞచొప్పున నడచుకొనలే' మని చెప్పిరి. అందునకు మలయకేతువు భాగురాయణుఁ జూచి, 'వీ రేల యిట్లు చెప్పుచున్నా" రని యడుగ, నతఁడు 'చాణక్యుఁడు రాక్షసునికి శత్త్రువై నందునఁ జంద్రగుప్తుఁడు చాణక్యునితో విరోధించి యతని నమాత్యపదమునుండి తొలఁగించి తత్పదమందు రాక్షసుని నియమించినయెడ నతఁడు పూర్వద్వేషమును దల్చఁచి తమకుఁ గీడు చేయునేమో యనుకొని యీలాగు చెప్పియుండవచ్చు' ననెను. దానిని విని మలయకేతువు, 'రాక్షసుఁడు యోగ్యుఁడు. అయినం జూతము. నేడు మొదలు కుసుమపురమునకుఁ బోవువా రనుమతిపత్త్రిక లేక పోఁగూడ' దని చాటింపించి 'వారు వచ్చి యడిగిన నీముద్రతోఁ బయనపుఁజీటి యిచ్చుచుండు' మని యాజ్ఞాపించెను. అప్పుడు రాక్షసుఁడు జీవసిద్ధి యను క్షపణకునిం బిలిచి యుద్ధయాత్రకు సుముహూర్తము విచారింపు మని, యతఁ డాలోచించి ముహూర్తమును నిశ్చయించి చెప్పఁగా భదంతుని నీముహూర్తము యుక్తమైనదా యని యితర జ్యోతిషికుల నడిగిర మ్మనెను. దానిని విని జీవసిద్ధి 'మీరు స్వపక్షమందు గౌరవమును విడిచి పరపక్షమును ప్రమాణముగా

నెంచుచున్నారు; కావున నిఁక నేను మీయొద్ద నుండ' నని యాగ్రహముతో లేచిపోయెను.

అప్పటిలో సిద్ధార్థకుఁడు రాక్షసముద్రాంకితమైనపత్త్రమును నాభరణమును దీసికొని పుష్పపురమునకుఁ బోవుచు, క్షపణకునిఁ జూచి నమస్కరించెను. అప్పుడు క్షపణకుఁడు సిద్ధార్థకుని 'బ్రయాణప్రయత్నము కలవానివలె నున్నావు. ముందు పుష్పపురమునకు సకలజనులును నాటంకములేక పోవుచు వచ్చుచుండిరి. ఇప్పుడు భాగురాయణునియొద్ద దారిచీటిని బొందినయెడఁ బోఁదగును. లేనిపక్షమందుఁ బోఁగూడదు. ఉండుము' అనెను. దానికి సిద్ధార్థకుఁడు 'అమాత్యరాక్షసునియొద్ద నుండువాఁడను గాన నన్ను దారియందడ్డగించువాఁ డెవ్వఁ' డనెను. క్షపణకుఁడు 'రాక్షసునిమనుష్యుఁడైనను జీటిలేక పోఁగూడ' దనెను. ఇద్దఱు నిట్లు మాటలాడుచుఁ బోవునప్పుడు జీవసిద్ధి ముందు మిగిలి భాగురాయణుఁ డుండుతావు చేరి చీటి యిమ్మని యడిగెను అప్పుడు భాగురాయణుఁడు 'రాక్షసప్రయోజనము నుద్దేశించి పోవుచున్నావా?' అనఁగా నతఁడు, 'నేను రాక్షసుని నెఱుఁగను; పిశాచము నెఱుఁగను' అనెను. భాగురాయణుఁడు 'స్నేహితునియందేల యింత కోపము? రాక్షసుఁ డేమియపరాధము చేసె'. నని యడిగెను. క్షపణకుఁడు, 'రాక్షసుఁడు నాకేమియు నపరాధము చేయలేదు గాని నేను మందభాగ్యుఁడనై చేసినపనులను గుఱించి లజ్జించుచున్నా' ననెను. అందునకు భాగురాయణుఁడు సంతోషముతో 'క్షపణకా! ఆసంగతి యే' మని యడిగెను. క్షపణకుఁడు 'నేను జెప్పను' అనెను. భాగురాయణుఁడు 'నేనును జీటీ యీయ' ననెను. అందుమీఁద, నతఁడు 'ఆహా! ఇది యేమిసంకటము, దీనిని జెప్పక దాప సమ

యము కాదు. విధిలేక చెప్పవలసియే యున్నది' అని నిశ్చయించి 'రాక్షసనియోగముచేత విషకన్యను సృజియించి పర్వతేశ్వరునిఁ జంపించినపాపము నన్ను బాధించెడి' నని జంకుతోఁ జెప్పెను. అప్పుడు భాగురాయణుఁడు, 'ఇ దేమిచోద్యము! పూర్వ మర్ధ రాజ్య మిచ్చునట్లు ప్రతిజ్ఞ జేసి యియ్యక చాణక్యుఁడే యితనిఁ జంపినట్లు వినియుంటిమి గదా!' అనఁగా క్షపణకుఁడు చెవులు మూసికొని, 'పాపము! అన్యాయము చాణక్యుఁడు విషకన్య యొక్క పేరుగూడ నెఱుఁగఁ' డనెను. అనంతరము భాగురాయణుఁడు క్షపణకునికిఁ జీటియిచ్చి, 'ఈసంగతి కుమారునకు విని పింపవలయును. రమ్ము. అనంతరము పోదువు' అనఁగా, నంతకు మునుపే వీరికిఁ దెలియకుండ మఱుఁగుగా వచ్చి వినుచుండిన మలయకేతు వెదుట వచ్చి 'మిత్రుఁడా! అంతయు వింటిని. అతనిని బోనిమ్ము' అని దుఃఖముతోఁ జెప్పి, 'రాక్షసా! నీ పేరు నీకుఁ దగియున్నది. లేకుండిన సకలవిధములను నిన్ను నమ్మి యున్న మాతండ్రిఁ జంపింతువా?' యనెను. భాగురాయణుఁడు చాణక్యుని నియోగముచొప్పున రాక్షసుఁడు ప్రాణాపాయము లేక మలయకేతువును విడిచిపోఁదగినయుపాయము చేయు వాఁడై, 'కుమారా! విన్నవించెదను. కోపమున కిది సమయము కాదు. త్వరపడి యపరాధుల శిక్షింపఁజనదు. పూర్వము సర్వార్థసిద్ధిని రాజుఁ జేయ నిశ్చయించినరాక్షసునకుఁ జంద్ర గుప్తునికంటె బలవంతుఁ డగుపర్వతేశ్వరుఁడే గొప్పశత్రు వాయెను. అతనివిషయమై రాక్షసుఁ డిట్టికార్యమును జరపి యుండిన నదియును న్యాయముగానే యెన్నఁదగియున్నది. కాన నీవిషయమున రాక్షసుని నిందింపవలదు. నందరాజ్య ప్రాప్తివఱకును గ్రహించినట్లే నటింపవలయును. నిగ్రహ

నుగ్రహములు దేవరవారిచిత్తాయత్తములు' అనఁగా మలయకేతువు 'నీవు చెప్పెడిది సరే! రాక్షసుని వధించినయెడఁ బ్రకృతులకు వ్యసనము గలుగుటయే కాక మనకు జయమును సందేహింపఁదగినదే' యనెను. ఇద్దఱు నిట్లు మాటలాడుచుండఁగా దీర్ఘచక్షుం డనుభటుఁడు వచ్చి, 'ఈమనుష్యుఁడు చీటిలేకయే పత్త్రికను దీసికొని పట్టణమునుండి వెడలిపోవుచుండఁగా మేము పట్టుకొని తమయెదుటికిఁ గొనివచ్చితి' మని సిద్ధార్థకుని గట్టి తెచ్చి యొప్పగించెను. అప్పుడు సిద్ధార్థకుఁడు మ్రొక్కి నిలుచుండెను. భాగురాయణుఁడు వానిఁ జూచి, 'ఇతఁ డాగంతుకుఁడా? ఎవనికైన సేవకుఁడా?' అని యడుగఁగా సిద్ధార్థకుఁడు విని 'నే నమాత్య రాక్షససేవకుఁడను' అనెను. భాగురాయణుఁడు 'చీటిలేక యెట్లు పోవుచున్నా' వని యడిగెను. సిద్ధార్థకుఁడు 'కార్యగౌరవముచే వేగముగాఁ బోవుచున్నా' ననెను. భాగురాయణుఁడు 'అది యెట్టికార్యగౌరవము? రాజాజ్ఞ నుల్లంఘించుచున్నా' వనెను. అప్పుడు మలయకేతువు' భాగురాయణులతో, 'పత్త్రిక నిటు తె' మ్మనెను. భాగురాయణుఁడు సిద్ధార్థకునిచేతిపత్త్రికను దీసికొని ముద్రను జూచి 'కుమారా! ఇది రాక్షసనామముద్రాంకిత' మని చెప్పెను. అప్పుడు మలయకేతువు 'ఆముద్రను భేదింపక మెల్లన విచ్చి చూపు' మనఁగా భాగురాయణుఁ డట్లుచేసెను. మలయకేతువు దానిఁ జూచి చదువఁగా దానియందు వ్రాయఁబడియున్నవచనము:—'ఒకానొకచోటనుండి యొకానొకండు తనమిత్త్రుఁడయినయొకానొకనికి వ్రాయునది యేమి యనిన, మేముండుచోట నందఱకు క్షేమము. మనశత్త్రువును నిరాకరించి సత్యసంధుఁడు చెప్పినచొప్పున సత్యమును నడపెను. ఇప్పుడును

మొదటసంధిలోఁ జేరిన మనమిత్రులకుఁ బ్రతిజ్ఞ చేసినప్రకారము జరపి సత్యసంధునకుఁ బ్రీతిఁ బుట్టింపవలెను. వీరును నీప్రకార మనుగ్రహింపఁబడి స్వాశ్రయమునైన వినాశము నొందించి యుపకారిని నాశ్రయింతురు. ఇది మీరు మఱచి యుందురని జ్ఞప్తిచేయుచున్నాను. వీరిలోఁ గొందఱు శత్రువు యొక్క కోశదండములను గోరుచున్నవారు. మఱికొందఱు దేశముఁ గోరువారు. తమరు పంపినయాభరణములు మూఁడును జేరెను. నేనును బత్రికతోఁగూడఁ గానుక నంపితిని. కాన మీరు దానిఁ బరిగ్రహించునది; కడమసంగతులు మాయిష్టుఁడగు సిద్ధార్థకుఁడు చెప్పఁగాఁ దెలియవచ్చును' అని వ్రాసియుండెను. మలయకేతు వాశ్చర్యపడి 'భాగురాయణా! ఈపత్రికసమాచారము వింటివిగదా! ఇది యెవఁడు వ్రాసినది!' అని యడిగిన, భాగురాయణుఁడు సిద్ధార్థకునిఁ జూచి, 'ఇదియెవని కేవఁడు వ్రాసిన' దని యడుగ, వాఁడు నాకుఁ దెలియదనెను. భాగురాయణుఁడు, 'ఓరిధూర్తుడా! పత్రికను గొనిపోవుచు నాకుఁ దెలియదని బొంకెదవు; అది యంతయు నట్లుండనిమ్ము. సిద్ధార్థకుఁడు చెప్పఁగాఁ దెలియును అని వ్రాసియున్నదే. నీ కెట్లు దెలియ' దనిన, సిద్ధార్థకుఁడు భయపడుచు 'మీరే తెలిసికొనుఁడు. నేనేమియెఱుఁగ' నని చెప్పెను. అప్పుడు భాగురాయణుఁడు కోపముతో, 'వీఁ డెన్నిమాఱు లడిగినను దెలియ దనుచున్నాఁడు. భాసురకా! వీనిని బయటికిఁ బిలుచుకొనిపోయి లెస్సగాఁ గొట్టుము. అప్పటికి నిజము బయటవచ్చును' అనెను. వాఁడును నట్లు చేయఁగా నతనిచంకనుండి రాక్షసముద్రాంకిత మగునొకపెట్టె క్రిందఁబడెను. భాసురకుఁడు దానిఁ జేతఁ దీసికొని లోపలికి వచ్చి భాగురాయణునిచేత నీయఁగా నాతఁడును,

'ఓకుమారా! ఈపెట్టియు రాక్షసనామాంకితము' అనిచూపెను. అప్పుడు మలయకేతువు, పత్త్రికతో బహుమతిగాఁ బంపినపేటిక యనుకొని భాగురాయణునితో, ముద్ర చెడకుండఁ బేటికనుదీసి చూపు మనఁగా, భాగురాయణుఁడు తెఱచి చూపెను. మలయకేతువు దానిఁ జూచి, 'ఓయీ! యీ యాభరణము నా దేహమునుండి తీసి రాక్షసుని కీయఁబడినది. దీనిఁజూడ నీపత్త్రిక రాక్షసుఁడు చంద్రగుప్తునకు వ్రాసినదనియు, నీయాభరణ మతనికిఁ గానుకగాఁ బంపినదనియు స్పష్టముగాఁ దెలియవచ్చె' నని చెప్పెను. భాగురాయణుఁడు 'ఇంతమట్టుకు బయటవచ్చెను గదా! ఇంత నితనిఁ బ్రహరించిన సంతయు వెల్లడియగు' ననెను. సిద్ధార్థకుఁడు నన్నుఁ గొట్టకుఁడు. నేనంతయుఁ గుమారునియొద్ద విన్నవించెద' నని లోపలికి వచ్చి, మలయకేతువు కాళ్లకు మ్రొక్కి 'అభయ మిచ్చి నన్ను గరుణింపుము.' అనఁగా, 'అట్లే కానీ. యథార్థము చెప్పుము' అనెను.

పిమ్మట సిద్ధార్థకుఁడు, 'కుమారా! అమాత్యరాక్షసుఁడు నాచేతఁ బత్త్రిక వ్రాసియిచ్చి చంద్రగుప్తునియొద్దకుఁ బంపెను. అక్కడఁ జెప్పుచున్న దేమనిన: మునకు ముఖ్యస్నేహితులయిదు గురు: కులూతాధిపుఁ డయినచిత్రవర్మయు, మలయదేశపురాజయిన సింహనాథుఁడును, గాశ్మీరదేశాధిపతి పుష్కరాక్షుఁడును, సింధురాజగు సింధుసేనుఁడును, పారసీకరాజు మేఘాఖ్యుఁడును; అంపు ముందుచెప్పిన మువ్వురు మలయకేతువు దేశములను నితరులు హస్తిబలమును, భండారమును గోరుచున్నవారు; అందువలనఁ జాణక్యుని నిరాకరించి నాకు సంతోషమునుబుట్టించి నట్లు వీరలకును మొదటఁ జేసిన ప్రతిజ్ఞప్రకారము ప్రయోజనమును 'గల్గుగఁజేయునది ఇది సమాచార' మని చెప్పెను.

అప్పుడు మలయకేతువు తనమనస్సున 'ఆహా! మనకు నిష్ఠు లయినచిత్రవర్మాదులును, మనకు ద్రోహము తలఁచిరిగదా! రాక్షసుఁడు కేవలము మిత్త్రుఁ డని యతనియందు విశేషప్రీతి యుంచి సకలకార్యముల నతనిపరము చేసితిని' అని రాక్షసునిఁ బిలిపించెను. అతఁడును బుష్పపురమునుండి వచ్చినచారుని వలనఁ జంద్రగుప్తచాణక్యులకు విరోధముకలిగినట్లువిన్నవాఁడు గాన మిక్కిలి యుత్సాహముతో శకటదాసు తీసియుంచిన యాభరణములను ధరించుకొని రాజునొద్దకు వచ్చెను. రా జా యాభరణములను జూచి, యవి తనతండ్రివయినందున వచ్చిన కోపము నణఁచుకొని, 'యుద్ధప్రయత్నము లెట్లున్న' వని యడిగెను. రాక్షసుఁడు 'కుమారా! చాణక్యుఁడు మంత్రిత్వమును మానుకొనె నఁట.' అదియు మన కనుకూలమే. సామంతరాజు లందఱకును యుద్ధసన్నద్ధులయి వెడలున ట్లాజ్ఞాపించితి' నని చెప్పెను. మలయకేతువు 'ఆర్య! పుష్పపురి కెవ రేనియుఁ బోవుచు వచ్చుచున్నారా?' యని యడిగెను. అందులకు రాక్షసుఁ డిప్పుడు కుసుమపురమునకుఁ బోవువాఁడు వచ్చువాఁ డెవ్వఁడును లేఁడు. కొన్నిదినములలో మనమే పోఁగల' మని యుత్తరము చెప్పెను అందుమీఁద మలయకేతువు 'పత్త్రిక యిచ్చి పురుషుని నేల పంపితి' వని యడిగెను. దానికి రాక్షసుఁడు సిద్ధార్థకునిఁ బిలిచి, 'ఏమిది?' యని యడిగిన, సిద్ధార్థకుఁడు సిగ్గుపడి తలవంచుకొని కన్నీటితో, 'ఆర్య! నన్ను మన్నింపుము. నన్నుఁ గొట్టించినందున నేను రహస్యమును దాఁపక చెప్పితి'నని, 'రహస్య మేమిటిది?' యని రాక్షసుఁడడుగ, సిద్ధార్థకుఁడు నాకుం దెలియ దనెను. అప్పుడు మలయకేతువు భాగురాయణునితో,

'వీఁడు తన యజమానునియెదుట భయపడినందుననో సిగ్గు చేతనో చెప్పలేక యున్నాఁడు నీవే చెప్పు' మనెను.

పిమ్మట భాగురాయణుఁడు రాక్షసునితో, 'అమాత్యా! సిద్ధార్థకుఁడు, రాక్షసుఁడు తనచేతఁ జంద్రగుప్తున కొకలేఖయిచ్చి కొన్నిసంగతులు గూడఁ జెప్పుమని తన్నుఁ బంపినట్లు చెప్పుచున్నాఁ' డనెను. అదివిని రాక్షసుఁడు, 'సిద్ధార్థకా! సత్యమా యిది?' యని యడిగిన, వాఁడు, 'నన్నుఁ గొట్టిన రహస్యమును దెలిపితి' నని లజ్జపడుచుఁ జెప్పెను. రాక్షసుఁడు భ్రమపడి, 'కుమారా! ఇదియేమో మోసముగా నున్న' దని, మలయకేతువు, 'ఈముద్ర యెవని'దని యడిగిన, 'ధూర్తులు కపటముద్ర గల్పింతు' రని చెప్పెను. అప్పుడు భాగురాయణుఁడు సిద్ధార్థకుని 'నీపత్త్రిక నెవఁడు వ్రాసె' నని యడుగఁగా, వాఁడు, 'శకటదాసు వ్రాసె' నని చెప్పెను. అది విని రాక్షసుఁడు, 'శకటదాసుఁడు వ్రాసినదని సత్యమైనయెడ, ఆతప్పు నాదే' యనెను.

అంతట మలయకేతువు శకటదాసుని బిలువు మనిన, భాగురాయణుఁడు, 'కుమారా! శకటదాసు, రాక్షసునెదుట నొకప్పుడును వాస్తవమును జెప్పఁడు; వానిచేవ్రాలు దెప్పించి యావర్ణములు చూచిన నంతయు విశద మగు' ననెను. రాజు 'అది యుక్తమే. ముద్రను గూడఁ దెప్పింపు' మనఁగా నతఁ డట్లు చేసెను. అప్పుడు మలయకేతు వారెంటిని జూచి, 'ఆర్యుఁడా! ఈయక్షరములను ముద్రనుఁజూడు' మనఁగా రాక్షసుఁడు, 'ఇఁక నే ననార్యుఁడను, నాయెడ దైవమునుం బ్రతికూలించినప్పుడు నే నేమి చెప్పుటకును నాకు నోరురా' దనెను. ఆమాటకు మలయకేతు వత్యంతకోపావిష్టుఁడై, 'అవును! విషకన్యను బ్రయోగించి నాతండ్రిని జంపిన నిన్ను మంత్రిగా

నుంచుకొనుట దైవము ప్రతికూలింపనియెడ నాకు సంభవించునా?' అని సేనాపతిని బిలిచి, తనభూమి నపేక్షించినకౌలూతాదుల ముప్వురను బల్లము త్రవ్వి పూడ్పింపు మనియు, గజముల నపేక్షించిన సింధుపారసీకాధిపతులను గజపదహాతులం గావింపు మనియు నాజ్ఞాపించి, వాఁడాపని నెఱవేర్చి వచ్చి చెప్పిన విని, రాక్షసునిఁ 'జూచి, మహార్యచాణక్యులు నీవును నొకటిగా నెత్తివచ్చినను మలయకేతువు మిమ్మునందఱ నిర్మూలింప శక్తుఁడు' అని చెప్పెను. అప్పుడు భాగురాయణుఁడు, 'స్వామీ! కాలవిలంబము చేయక శత్రువులమీఁదకి బోవలయు' నని రహస్యముగా, 'ఇప్పు డేమియుం జేయవల' దని బోధించి పిలుచుకొని పోయెను.

తర్వాత రాక్షసుఁడు తనమనస్సున దుఃఖించి, 'హా! యేమి యాశ్చర్యము! వినాయకునిఁ జేయఁబోయినఁ గోఁతి యాయె ననువిధమున మనము శత్రునాశార్థము చేసిన కార్యములు సుహృద్వినాశమందుఁ బర్యవసించెను. తపస్వులు స్నేహితులు నగుచిత్రవర్మాదులు మడిసిరి. ఏమి చేయుదును? తపోవనమునకుఁ బోవుద మనినఁ దపముచేత వైరము గలమనస్సు శమింపదు; మనప్రభువులు పోయినదారిని బోవుద మనిన నది స్త్రీధర్మముకాని మనకుఁ దగినది కాదు. ఖడ్గము నెత్తుకొని శత్రువులపైఁ బడినఁ, జందనదాసుని విడిపించుటకు వీలు లేక పోవును' అని చింతించుచుఁ బుష్పపురమునకు వెడలిపోయెను. జీవసిద్ధియు, సిద్ధార్థకుఁడును జాణక్యునియొద్దకుఁ బోయి యాసంగతిఁ జెప్పఁగా విని యతఁడు సంతోషించి 'అతఁ డెక్కడికిఁ బోవుచున్నాఁడో చూచి తెలియఁ జేయు' మని యొకమనుష్యునిఁ

బనుపఁగా వాఁడు చూచి 'పుష్పపురసమీపమం దొకవనములోఁ బ్రవేశించె' నని చెప్పెను.

అప్పుడు మలయకేతువు సేనాసమేతముగాఁ గుసుమపురముమీఁదికిఁ బోయి ముట్టడింపఁగా, మంత్రి యగుచాణక్యుఁడు మహాసైన్యముతో శత్రుబలముమీఁదఁబడినిజబలముల చేత దాని నాక్రమించి రథాశ్వగజములనన్నిటిని దనవశము చేసికొని త్వరితముగా జయఘోషముతోఁ బురము ప్రవేశించెను. అనంతరము రాజసహాయుఁడైనందునఁ బార్శ్వవర్తులయినభద్రభటాదు లతనిఁ గట్టివేసిరి.

అనంతరము చాణక్యుఁడు సిద్ధార్థక సమిద్ధార్థకులకుఁ జందనదాసు నురిదీయుటకుఁ జండాలవేషమును ధరించికొనిపొం డని యాజ్ఞాపించి రాక్షసుఁడు ప్రవేశించిన యుద్యానవనమునకుఁ దనస్నేహితుఁడైనమఱియొకపురుషుని గొన్ని రహస్యవచనములను జెప్పిపంపిన, వాఁడును మిత్రవ్యసన మను వ్యాజముచేత దుఃఖించుచు నక్కడ నురిపోసికొనుచుండెను. అప్పుడు రాక్షసుఁడు వానిని జూచి 'భద్రా! ఏల యురిపోసికొనియెద' వని సమీపమునకుఁ బోయి యడుగఁగా, నతఁడు 'నామిత్రవ్యసనముచేత నేను నురిపోసికొనియెద' ననిన, రాక్షసుఁ డేమిమిత్రవ్యసన మని యడిగెను. దానికి వాఁడు, 'నాప్రాణసఖుఁడైన విష్ణుదాసుఁడు తనప్రాణపద మయినచందనదాసుని నురిదీయుటకుఁ జండాలురు కట్టుకొనిపోవుచుండఁగాఁ జూచి యతని వధకు ముందే యగ్నిప్రవేశము చేయఁ బట్టణము విడిచెను. నే నాసుహృద్వ్యసనముచేతఁ బ్రాణమును విడిచెద' ననెను. దానిని విని రాక్షసుఁడు 'చందనదాసుమరణమునకు హేతు వే' మని యడిగెను. అందునకు వాఁడు, 'రాక్షసునికుటుంబమును దనయింటం

బెట్టుకొని రక్షించె నని క్రోధముచేతఁ బాపాత్ముఁ డైనచాణక్యుఁడు వాని నురిదీయున ట్లాజ్ఞ చేసెను.' అన విని, 'ఆహా! చందనదాసుయొక్క వినాశము విష్ణుదాసున కగ్నిప్రవేశ హేతువాయెను ! స్నేహ మిట్లుగదా యుండవలె' నని చందనదాసు నుద్దేశించి, 'సాధు ! వయస్య ! చందనదాస ! సాధు !

* శిబే రివ సముద్భూతం శరణాగతరక్షయా,
సంచీయతే త్వయా సాధో యశో హి సుహృదా వినా.'

అని ప్రశంసించి 'భద్ర ! త్వరగాఁ బోయి విష్ణుదాసు నగ్నిప్రవేశము నాటంకపఱుపుము; నేను వచ్చి చందనదాసుని విడిపించెద' ననఁగా, వాఁడు, 'నీ వెట్లు విడిపింపఁగలవు?' అని యడిగెను. 'ఇదిగో ! కత్తి చూడుము; పో' మ్మనిన, ఆపురుషుఁడు, 'స్వామీ ! కత్తియుండినను వానిని విడిపించుట దుర్లభము. ముందు శకటదాసుని సిద్ధార్థకుఁడు విడిపించినందునఁ జాణక్యుఁడు కోపించి యాఘాతులను శిక్షించి యదిమొదలు కొని తప్పుచేసినవారిని జాగ్రత్తతో వధింప నాజ్ఞాపించి యున్నాఁడు; కాఁబట్టి యాయుధపాణిగాఁ బోయినయెడ దూరమునుండి వారు చూచిరేని నప్పుడే వధింతురు.' అనిన రాక్షసుఁడు: 'నిరాయుధుఁడనై నేనువచ్చి విడిపించెదను; నీవు కాలహరణము చేయకుము. త్వరగాఁ బోయి విష్ణుదాసునకుఁ జెప్పు' మనఁగా వాఁడును బయలువెడలెను. అప్పుడు రాక్షసుఁడు తన చేతికత్తిని విడిచి పయనమాయెను.

అప్పుడు వధ్యవేషము ధరింపఁజేసి విచ్చుకత్తులతోఁడి భటసంఘముతోఁ జందనదాసుని వధస్థానమునకుఁ జాణక్యుని

---

*శరణాగతరక్షణంబున శిబిచక్రవర్తికిఁగలిగిన కీర్తివంటికీర్తిని స్నేహితుని విడిచియే నీవు సంపాదించుకొనుచున్నావు.

యాజ్ఞచేత నరుణోదయమునఁ జండాలవేషమును ధరించిన సిద్ధార్థకసమిద్ధార్థకులు తీసికొనిపోవుచుండిరి. రాక్షసుఁడును నచ్చటికిఁ బోయి, చందనదాసుభార్యయుఁ బుత్త్రుఁడును అయ్యో! మీవంటిసుగుణాత్ముల కిట్టిదుర్మరణమును బొంద వలసివచ్చెనుగదా' అని చాల దుఃఖించుచుండుటనుజూచి పాపా త్ముఁడనైననావలనఁ గదా వీరి కిట్టియాపద సంభవించెనని దుఃఖిం చుచు వారియొద్దకుఁ బోయి, 'అమ్మా! వ్యసనపడకుము. నీ పురుషుని ప్రాణముఁ దప్పించుటకు వచ్చితిని' అని పలికి కుమా రునిఁ జూచి 'నాయనా! ఏడువకుము. నీతండ్రి నీదగ్గఱకుఁ ద్వరగా వచ్చి నిన్నాదరించును' అని చెప్పి వధస్థానమునకుఁ జని చండాలురు, చందనదాసునిఁ గట్లతో శూలారోపణము చేయఁబోవుచుండ వారితో, 'చందనదాసుని కట్లు వదలించి నన్నుఁ గట్టుఁ' డని చెప్పెను. ఆమాట చందన దాసు విని, 'అయ్యో! అమాత్య! రాక్షసా! నానిమిత్తమున నీవు ప్రాణత్యాగము చేయుటకా నే నిన్నిదినములు నీతో స్నేహము చేసితి' ననెను. రాక్షసుఁడు 'సుకృతములోఁ గొంచె మైన నే ననుభవించి సార్థక్యముఁ బొందవలదా? నన్ను దూఱ కుము. ఊర కుండు' మని, యాచండాలురఁ జూచి 'దుర్జనులకు సహాయభూత మగుకలియందును దనప్రాణము నిచ్చి యొరు లను రక్షించి కీర్తిఁ బొందఁగలచందనదాసుఁడు పూజ్యుఁడైనను నెవ్వనికై శత్రుత్వము వడసి వధ్యుఁ డాయెనో వాఁడనే నేను' అని చెప్పినఁ జండాలురలో నొకఁడు త్వరగాఁ బరుగెత్తిపోయి, చాణక్యునికి నడచినసమాచార మంతయు వినిపించెను.

దీనిని వినఁగానే చాణక్యుఁడు మిక్కిలి సంతోషించి తత్క్షణమే చంద్రగుప్తునినగరికి వెళ్లి యతనితో, 'వత్స! మన

మిన్ని దినము లేకార్యము నుద్దేశించి యిన్నితంత్రములు పన్ని తిమో యాకార్యము చేకూఱెను. నేను గృతార్థుండనైతి నని, యింక జాగుసేయక యమాత్యరాక్షసుని రాజసమ్ముఖమునకుం దోడ్కొనిరం డని భటుల కాజ్ఞాపించెను. అప్పుడు భటులు రాక్షసునియొద్దకుం బోయి, 'స్వామీ! శ్రీమదఖండభూమండల సామ్రాజ్యలక్ష్మీధురంధరుండును, సకల దిఙ్మండలాగతరాజ మండలకిరీటమాణిక్యప్రభామండిత సుందరపదారవిందుండును నగు చంద్రగుప్తమహారాజు తమ్ముం దోడ్కొనిర'మ్మని యాజ్ఞా పించె నని విన్నవించిరి. అది విని రాక్షసుఁడు, 'ఆ! శత్రువైన చంద్రగుప్తు నివ్విధంబున స్తోత్రము చేయఁగా వినవలసి వచ్చెను గదా విధికృత్య' మని యెంచి వారివెంటం బోయెను. అంతటఁ జాణక్యుఁ డెదురుగా వచ్చి 'ఓయమాత్యా! రాక్షసా! నేను విష్ణుగుప్తుఁడను. వందన మొనర్చెద' నని నమస్కరించెను. అప్పుడు రాక్షసుఁడు నన్నమాత్యనామముతోఁ బిలుచుట లజ్జను గలుగఁజేయునని తలఁచి, 'విష్ణుగుప్తా! నేను జండాల కరస్పర్శంబున దూషితుఁడనై యున్నవాఁడను గాన, నన్నంటకు' మని చెప్పెను. అందునకుఁ జాణక్యుఁడు, 'రాక్షసా! వీరు చండాలురు కారు. వీఁడు సిద్ధార్థకుఁ డను రాజపురుషుఁడు. నీ వెఱింగినవాఁడే. ఈ రెండవవాఁ డితనివిస్నేహితుం డగుసమిద్ధా ర్థకుఁడు. వీరలచేత శకటదాసునకుఁ దెలియకుండ నతఁడు వ్రాసినట్టు దొంగతనముగా జాబు వ్రాయించితి' ననిన, రాక్ష సుఁడు, 'ఆహా! శకటదాసు నాకు ద్రోహముచేసె నని తలఁచి తిని. అతఁడు పరిశుద్ధుఁడేకదా! ఇప్పుడు నామనస్సు నెమ్మది పడె' ననెను. చాణక్యుఁడు 'బహుభాషణము లేల? భద్రభటా దులును, జాబును, సిద్ధార్థకుఁడును, ఆభరణత్రయమును,

ఉద్యానవనమున నురివేసికొనఁ బూనినవాఁడును, ఇట్టి వన్నియు నిన్నిచోట్లకి రప్పించుటకుఁగాను *జంద్రగుప్తుఁడు చేసినతంత్రములే కాని వేలుకా' వనెను.

ఇట్లు చెప్పుచుండఁగా 'ఆయుధములును, సేనయు, లేకయే బలవంతు లయినశత్రువులను యుక్తిచేత జయించిన నాగురువే కదా బుద్ధిమంతుఁ' డని యెంచుకొనుచుఁ జంద్రగుప్తుఁడు వచ్చెను. చాణక్యుఁ డతనిం జూచి 'అమాత్య! ఇదే చంద్రగుప్తుఁడు వచ్చె' ననెను. అంతటఁ జంద్రగుప్తుఁడు వచ్చి చాణక్యునిపాదములకుఁ బ్రణామంబుఁ జేసెను. చాణక్యుఁడు 'రాజా! నీకు సర్వైశ్వర్యములు కలుగుఁగాక' యని యాశీర్వదించి, 'అమాత్యరాక్షసుఁడు నీయొద్ద నెప్పుడు చేరెనో యప్పుడే నీవు సామ్రాజ్యధురంధరుండ వయితివి. ఇఁక నీ కేమికొఱఁత, యనెను. అప్పుడు రాక్షసుఁడు, 'ఆ! చాణక్యుఁడు మొదటఁ జూచినంతనే చుట్టఱికమును గలుగఁజేసె' నని యాఁతని బుద్ధిచాతుర్యమును దనమనస్సున మెచ్చుకొనుచుండఁగాఁ జాణక్యుఁడు చంద్రగుప్తునిఁ జూచి, 'మనరాక్షసామాత్యుఁడు వచ్చెను. నమస్కరింపు' మనఁ జంద్రగుప్తుఁ డమాత్యరాక్షసునకు నమస్కరించెను. అప్పుడు రాక్షసుఁడు, 'రాజా! జయింపు' మని యాశీర్వదింపఁగా, రాజు, 'నీవును జాణక్యుఁడును, సంధ్యాదిగుణములవిచారమందు గురువు లైయుండఁగా నేను జయించుటకు సందియం బేమి' యనెను. రాక్షసుఁ డతని వినయమునకు మెచ్చుకొనుచు, 'ఇది యేలాగగు'నని చింతించుచుండఁగాఁ జాణక్యుఁడు 'అమాత్య! చందనదాసుజీవితమును గోరుచున్నావా?' అని యడిగెను. 'దానికి సందియం బేమి'

*నేను అని చెప్పుకొనుటకు లజించి చంద్రగుప్తుఁ డనెను.

యని రాక్షసుఁడు చెప్పెను. చాణక్యుఁడు, 'రాజు నీమంత్రిత్వ మును గోరుచున్నాఁడు. నీవు మంత్రిత్వము నంగీకరించిన యెడఁ జందనదాసుజీవితమునకు హానిలే' దనెను. అప్పుడు రాక్షసుఁడు కొంతసే పాలోచించి మంత్రిత్వము నంగీకరించెను.

ఇట్లుండఁగా రాజపురుషులు వచ్చి మ్రొక్కి 'స్వామీ! భద్రభటభాగురాయణాదులు మలయకేతువును గట్టి తెచ్చి,' రని విన్నవింపఁగాఁ జాణక్యుఁడు 'వారితో, 'ఇదే మామంత్రులు రాక్షసులవా రున్నారు. వారికిఁ దెలిపి వారియుత్తరువు ప్రకారము నడచుకొం' డనెను.

రాక్షసుఁడు చాణక్యునిచమత్కారమునకు సంతసించి చంద్రగుప్తునిం జూచి, 'మలయకేతువు ప్రాపున నేను బహు దినము లుంటిని. మీకును దెలిసియే యున్నది గాన నతఁడు తప్పుచేసినను నతని కభయ మిచ్చి రక్షింపవలయు' నని చెప్పఁగాఁ జంద్రగుప్తుఁడు చాణక్యునిమోముఁ జూచినంతట నతఁడు, 'ఇది న్యాయమే' యని భటులను బిలిచి మలయ కేతువును జెఱ విడిపించి యతనిదేశమునకుఁ బోయి యతని పిత్ర్యమైనరాజ్యమును బాలించునట్లు చెప్పి 'కూడఁ బోయి సింహాసనమం దునిచిరండు. మఱియును విజయపాలుఁడు, దుర్గపాలుఁడు మొదలయినవారి నిష్టప్రకారముగ వెడల నిండు. చందనదాసుని వానిసొత్తు లన్నిటిని స్వాధీనపఱిచి పంపుడు' అని యాజ్ఞాపించెను. భటులును నట్లే యని వెడలిరి.

అనంతరము చాణక్యుఁడు, రాజుతోను రాక్షసునితోను, "ఓరాజమంత్రులారా! ఇంక నే నేమిచేయవలసియున్న' దని యడుగఁగా, రాజు 'రాక్షసమంత్రితో స్నేహమును గలుగఁజేసి మమ్ము సింహాసనము నెక్కించితిరి. శత్రువు

లయిన నందులందఱు నశించిరి. ఇంతకంటె నాకుఁ గావలయు నది యేమి? నే నీభూమిని జిరకాలము పాలించునట్లు దీవింప వలయు' ననెను. అంతటఁ జాణక్యుఁడు, 'పూర్వము వరాహ రూపముఁదాల్చిన విష్ణుమూర్తియొక్క దంతము నగ్రమందుండి ప్రళయకాలమందు జలమగ్నమై పిమ్మట యవనరాజులచేఁ బీడితమై మహాబాధనొంది యిప్పుడు రాజరూపధారి యయిన యొవనిభుజయుగము నాశ్రయించి యీభూమి సుఖంబు నొందెనో యట్టి చంద్రగుప్తమహారాజు శాశ్వతంబుగ నీపుడమినిరక్షించుఁగాత' యని దీవించెను. చంద్రగుప్తుఁడు చాణక్యు ననుమతిచే రాక్షసమంత్రియొక్క యిష్టముచొప్పునఁ జందన దాసునిఁ బిలిచి శ్రేష్ఠము లైనబిరుదులతో సన్మానించి పంపెను. పుష్పపురమందు రాక్షసప్రియులైనవారి నెల్లరను జాణక్యుఁడు రాజుచేత మిక్కిలి సన్మానింపఁజేసెను. తర్వాత రాజమంత్రుల కొండొరులగౌరవసమ్మానములచేత నానాఁటికిఁ బ్రీతి హెచ్చెను. చాణక్యుఁడును స్వప్రతిజ్ఞాపూర్తియయినందున శిఖనుబంధించి యాయాకాలమందు రాజునకు వలసినహితము చేయుచుండఁగా బుద్ధిమంతుఁడైనచంద్రగుప్తుఁడును సర్వగుణాధికుఁడైనరాక్షస మంత్రిసాహాయ్యమున భూమిని సకలజనానురంజనముగాఁ బాలించుచు రాజ్యసుఖము ననుభవించుచుండెను.

# ఉపోద్ఘాతము

ఈనాటకము 'కేశి' అను రాక్షసుడు ఊర్వశిని పట్టుకొని పోఁగా పురూరవశ్చక్రవర్తి తనవిక్రమముచేత అనఁగా పరాక్రమముచేత ఆమెను విడిపించుకొనివచ్చినకథను దెలుపునది గనుక దీనికి 'విక్రమోర్వశీయము' అని పేరువచ్చినది. దీనిని రచించిన కవి కాళిదాసుఁడు.

దీనికథానాయకుఁ డగుపురూరవసుఁడు చంద్రునికొడుకైన బుధునికి ఇళ యనునామెయందుఁ బుట్టినకొడుకు. ఈయన మహాపరాక్రమశాలి; కాఁబట్టి దేవేంద్రుఁడు తనకు రాక్షసులతో కలహము తటస్థించినప్పుడంతయు నితనితోడ్పాటును గోరుచుండును.

ఇందు గొప్పవారు తమకష్టమును యోచింపక తమ్మునాశ్రయించినవారిని రక్షింతురనియు, తమకెంతసంకటము వచ్చినను న్యాయమార్గము తప్పి నడవరనియు, కృతజ్ఞులైనవారు ఉపకారముచేసినవారికి ఏవస్తువునైన నిచ్చుటకు సమ్మతింతురనియు, గుణవంతులైన లలనలు భర్తయిష్టమును మీఱరనియు ఇట్టి నీతులు విశదములగుచున్నవి.

# ఈకథయందు వచ్చువారు.

---

## పురుషులు.

పురూరవసుఁడు—కథానాయకుఁడైన రాజు.
కేశి—ఊర్వశిని పట్టుకొనిపోయిన రాక్షసుఁడు.
చిత్రరథుఁడు—ఒకగంధర్వాధ్యక్షుఁడు.
మాణవకుఁడు—విదూషకుఁడు, అనఁగా రాజుదగ్గఱ వేడుకగా మాటలాడుచుండువాఁడు.
చ్యవనుఁడు—ఒకఋషి, ఈయనయే రాజుకొడుకునకు సకల విద్యలు నేర్పినవాఁడు.
ఆఁయుస్సు—పురూరవసునకు ఊర్వశియందుఁబుట్టినకొడుకు.
నారదుఁడు—ఒక దేవఋషి.
ఇంద్రుఁడు—దేవతలకధిపతి.
భరతముని—నాట్యాచార్యుఁడు.

## స్త్రీలు.

ఊర్వశి—ఒకయప్సరస, కథానాయిక.
చిత్రలేఖ—ఊర్వశి చెలియగునప్సరస.
సహజన్య, మేనక, రంభ—వీరు నప్సరసలే.
కాశిక—రాజుపట్టపుదేవి, కాశిరాజుకూఁతురు.
నిపుణిక—కాశికపరిచారిక.
సత్యవతి—ఒక తాపసస్త్రీ, ఈమె ఊర్వశికొడుకగు నాయువును పెంచినది.

---

ఈచెప్పఁబడినవారు ప్రధానులు. ద్వారపాలకుఁడు మొదలగువారు మఱియుఁ గొందఱు కలరు.

# విక్రమోర్వశీయము.

గంగాయమునానదులు సంగమ మగుచోటికి సమీపమున ప్రతిష్ఠాన మని యొకపట్టణము కలదు. దానిని పురూరవుండను రాజు ఏలుచుండెను. అతఁడు మహాపరాక్రమశాలి. ఇంద్రుఁడును తనకు రాక్షసులతోడ జగడంబు లగునపుడు ఇతనిసాహాయ్యకంబున వారిని గెలుచుచుండును.

ఇట్లుండ స్వర్గమందుండి యప్సరోరమణీమణియగు ఊర్వశియును ఆపెచెలియగు చిత్రలేఖయు మఱియు రంభ మొదలగు వారును కుబేరునిపట్టణమునకుఁ బోయి వచ్చుచుండునపుడు హిరణ్యపురవాసి యయిన కేశి యనురాక్షసుఁడు దారిలో నడ్డగించుకొని ఊర్వశీచిత్రలేఖలను పట్టుకొని యీశాన్యమూలగా పోయెను. అంత నతనిచేతఁ జిక్కక తప్పిన రంభాదులు, దేవతలయందు ప్రేమయు నాకాశమార్గమున సంచారక్షమతయుఁ గలవాఁ డెవఁడేని మమ్ముఁ గాపాడవలయు నని మొఱపెట్టిరి.

పురూరవుఁడు ప్రాతఃకాలమందు సంధ్యావందనాదులు తీర్చుకొని మరలి * యాస్థానమునకు వచ్చుచు నాయచ్చరల మొఱ విని 'మీ కేమి యాపద వచ్చె' నని విచారింపఁగా, వారు తమవృత్తాంతమునంతను ఆయనతోఁ జెప్పిరి. దానిని విని యాయన, అతఁడు పోయినదిక్కు నడిగి తెలిసికొని, 'ఇఁక మీరు భయపడఁ బనిలేదు, ఇదిగో మీచెలి వచ్చి చేరిన దనుకొండి' అని వారికి ధైర్యము చెప్పి తనసారథితో సోమదత్త మనుతనరథమును ఆరాక్షసుఁడు పోయినదిక్కునకు తోలుమని బయలుదేరిపోయెను.

---

* సభామండపము.

రంభ మొదలగునప్సరసలు హేమకూటపర్వతముమీఁద నెక్కి-రాజెప్పు డారాక్షసునిజయించి తమచెలినిఁదోడ్కొనివచ్చునో, ఆపెముఖమును తిరిగి యెప్పుడు కన్నులఁ జూతుమో యను కొనుచు రాజురాక నెదురుచూచుచుండిరి.

రాజు పోయి యారాక్షసునిఁ గనుఁగొని యడ్డగింపఁగానే యాయిరువురికిఁ బ్రబలమైనకలహము కలిగెను. అప్పు డారాజు, మన మీతనితో జగడమాడుచు జాగుచేసిన యీదుర్మార్గుఁడు ఆ లలనల నేమిచేయునో యని యోచించి వాయవ్యాస్త్రమును ప్రయోగింప, అది యారాక్షసుని నతనిసేనలంగూడ నెగురఁ గొట్టుకొనిపోయి సముద్రములో పడవైచెను.

అంతనారాజు, ఊర్వశీచిత్రలేఖలనిద్దఱను తన తేరిమీఁద నెక్కించుకొని హేమకూటమునకు వచ్చుచు, చిత్రలేఖమీఁద నానుకొని కన్నులు మూసికొనియున్న యూర్వశినిఁ జూచి, 'రమ ణీమణీ! నీవేల యింకను భయపడియెదవు? రాక్షసకులాంతకుం డుగా దేవేంద్రుఁ డుండ నిన్నుఁ బట్టుకొనిపోయినరాక్షసుండు ప్రాణములతో నిలువఁగలఁడా? కన్ను తెఱచి చూడుము.' అని యాపెకు భయముతీర్చుమాటలు చెప్పి, చిత్రలేఖతో,' నీచెలి మిగుల దిగులుపడినది, రొమ్ము తటతట కొట్టుకొనుచు దేహమం తయు వణఁకు కలిగియున్నది చూడు' అనెను. అదివిని చిత్రలేఖ ఊర్వశితో,'నీవేమి దేవలోకమున దేవతలలో మెలఁగినదానవు కావా? రాక్షసుఁడు పట్టుకొనిపోయినమాత్రాన నింతభయపడ వలెనా? అతఁడు గాలికి కొట్టుకొనిపోయి యెంతనేపాయెను? ఇప్పటికిని కన్నులు తెఱవలేకయున్నావేమి,' అనగా, ఊర్వశి తిన్నతిన్నఁగా కన్నులు తెఱచి తలయెత్తి చూచెను. అప్పుడు రాజు ఆమెను చూచి, 'ఈపెభయము ఇప్పుడిప్పుడు కొంచెము తీఱు

చున్నది, భయముచేత తలయెత్తి చూచుచున్నయీయాపె చంద్రోదయమై చీఁకట్లు విచ్చిపోవురాత్రివలెను, పొగ యడఁగిపోయి దగదగ వెలుఁగునగ్నిజ్వాలవలెను, గట్టువిఱుగఁబడి కలగిపోయి తిరిగి తేఁటినగంగవలెను కానఁబడుచున్నది, చూడుము.' అని చిత్రలేఖతోఁ జెప్ప, ఆపె యూర్వశితో, 'మనలను బట్టినపీడ యంతయు నెప్పుడో విడిచిపోయినది, నీ వెఁక లెమ్ము' అనెను. అంత ఊర్వశి, 'మనల నారాక్షసుఁడు పట్టుకొనిపోయి యుండెనే, ఎవరు విడిపించుకొనివచ్చిరి? ఇంద్రునకీపమాచారము తెలిసి యాయన యేమైన వచ్చి విడిపించెనా?' అని చిత్రలేఖ నడుగ, ఆపె, 'ఇంద్రుఁడు కాఁడు, ఆయనయంతటి వాఁడైన యీమహానుభావుఁడు మనయుపకారిని పోఱఁదోలి మనల విడిపించుకొనివచ్చెను'అని చెప్పెను. ఆమాటవినియామె రాజుచాయచూచి ఆయనసౌందర్యమునకు మెచ్చి, రాక్షసుఁడు మనలను పట్టుకొనిపోవుటయు మనకు మేలే, లేనియెడ మన మీయాయనను చూడఁబోవున దెక్కడిది అనుకొని యాయన మీఁద మిక్కిలి యనురక్తురాలాయెను. అప్పుడు చక్కగా జడుపుతీఱి తొలుకరి మెఱపువలె మెఱయుచున్న యాయూర్వశినింగని యారాజును, ఈపె ఆ * నారాయణఋషివలనఁ బుట్టినప్పుడు ఈపెను జూచి యప్సరసలు సిగ్గుపడుట కాశ్చర్య మేమి, నాకుఁ జూఁడ నా నారాయణముని యీపెను సృజియించిన మ్మాటగూడ నమ్మఁదగినదిగా నుండలేదు. వేదముల

* నారాయణమూర్తి గంధమాదనపర్వతముమీఁద తపస్సుచేయుచుండఁగా అప్సరసలు అక్కడపోయి యాయనను పరిహాసముచేయసాగిరి. అప్పుడాయన వారు సిగ్గుపడి పఱుగెత్తునట్టు తనతొడనుండి యీమెను కల్పించెను. అందుచేతనే యీమెకు ఊర్వశి అని పేరు (ఊరుఁ=తొడ).

సావృత్తిచేయుటకును తపస్సుచేయుటకును ఆయన కీ డింకొకరు లే రనవచ్చునుగాని యిట్టియందగత్తెను సృజించుట కాయనచేత నెట్లౌను. మన్మథుఁడో, చంద్రుఁడో, వసంతఋతువో, సృష్ట్యధికారమును వహించి యీపెను సృజించియుండవలయును అని యెంచుకొనుచుండెను.

ఇట్లు వీరు వచ్చుచుండునపుడు ఊర్వశి చిత్రలేఖనుజూచి, 'ఇప్పుడు మనచెలు లేమైయున్నారో' అనఁగా రాజు, 'దుఃఖసముద్రమున మునిఁగియున్నారు. అదేమి యరుదా ? ఎప్పుడో ఒకసారి ఆకస్మికముగా నిన్నుఁ జూచినవాఁ డైనను ని న్నెడఁబాసి తాళఁజాలఁడే, నిరంతరము కూడ నుండుసఖు లెట్లు సహింతురు. అదిగో చూడు, నీసహచరులు హేమకూటపర్వతముమీఁద నుండి గ్రహణముపట్టి విడిచినచంద్రునిఁ బోలియున్న నీముఖము నెంతమక్కువతో చూచుచున్నారో' అని యిట్లు వేడుకగా మాటలాడుచు వచ్చి యాకొండమీఁదఁ జేరిరి.

ఈలోపల హేమకూటపర్వతముమీఁదఁ జేరి యీరాజు పూనినపనిని సాధించుకొనివచ్చునో రాఁడో యని చింతించుచున్న యప్సరసలలో సహజన్యయనునాపె యీరాజు తేరు రాకను జూచి తక్కినవారితో, 'అదిగో చూడుఁడు, జింకగుఱుతువేసిన ధ్వజముగల పురూరవునిరథము వచ్చుచున్నది. ఆయన తాను పూనినపనిని సాధింపక మరలెడువాఁడు కాఁడు, ఊర్వశిని పిలుచుకొనియే వచ్చుచుండును.' అని చెప్పఁగా వారును మిగుల కౌతూహలముతో తేరినే చూచుచుండిరి.

అప్పుడు పురూరవుఁడు అక్కడికి వచ్చిచేరి రథముమీఁద నుండి యానెలఁతల ముందు దించి వెంటనే తానును దిగెను. అంత ఊర్వశి తనచెలులం జూచి, 'నేను పడ్డపాట్ల నేమని చెప్పు

దును; మరలమిమ్మును కన్నులఁజూతునని తలచియుందునా; ఈమహాపురుషుఁడుగదా నేను రాక్షసునిదగ్గఱనుండి విడుదలగ్రైనచ్చునట్లును మిమ్ము నందఱను జూచునట్లునుం జేసెను. ఈమహోపకారిలేకపోయిన ఆపాపాత్మునిచేతఁ జిక్కుకొన్న నే నేమియవస్థపడవలసియుందునో' అని తనదుఃఖమునంతనుం జెప్పుకొనఁగా, వారును దానికి తగినట్లు ఆమెకు సంతోషకరములైనమాటలు చెప్పి, 'మన కింత మేలుచేసిన యీమహారాజుగారికి దీనికి ప్రత్యుపకారము మన మేమిచేయఁగలము'అనిరి. ఆమాటవిని యాభూపాలుండు,'ఇప్పుడు నేను చేసిన దేమియు లేదు; అంతయు మనకు ప్రభువగు నింద్రునిమహిమవలన జరిగిపోయినది.' అని యుత్తరము చెప్పెను. ఈరీతి నందఱు నాకొండమీఁద సంతోషముతో మాటలాడుకొనుచుండిరి.

ఇంతలో నారదమహాముని వలన ఇంద్రుఁడు తనకు సకలవిధముల సంతోషకరురాలుగానుండు నూర్వశి కేశియను రాక్షసుని చేతఁ జిక్కి, వెక్కిడుములఁబడుచున్న దనుసమాచారమును విని, ఆచింత చేత నేమియుఁదోఁచక చిత్రరథుఁడను గంధర్వునిం బిలిచి, 'మనయూర్వశి*యలకాపురమునుండి వచ్చుచుండఁగా కేశియను రాక్షసుఁడు పట్టుకొనిపోయినాఁడట. ఆపె తగనిపిఱికిగుండె, దయలేని యారక్కసునిచేతఁ జిక్కి యే మయియుండునో తెలియలేదు. కాఁబట్టి నీవు వేగ నీవశమున నుండుగంధర్వుల దండునుం గొనిపోయి యాతనికావరం బణఁచి యాపెను దోడితెమ్ము' అని యుత్తరవుచేసెను. ఆప్రకారమే అతఁడు తనదండునంతనుం గూడఁ దీసికొని యూర్వశిపోబడిని వెదకుచు పోవు

* కుబేరుని పట్టణము.

నపుడు దారిలో*చారణులు, 'పురూరవశ్చక్రవర్తి కేశినిజయించి యూర్వశినిం దోడ్కొనివచ్చి యాపె చెలులగు నప్సరలతోం గూడ హేమకూటపర్వతమున నున్నాఁడని చెప్పిరి. ఆసమాచారమును విని యతఁ డాకొండమీఁదికి వచ్చెను.

అప్పు డాపురూరవశ్చక్రవర్తి యతని రాకనుజూచి యతనికిఁ దగినమర్యాద లన్నియు జరగింపఁగా, ఆదేవరమణులు ఇక్కడిసమాచారమును యావత్తు నతని కెఱింగించిరి. దానిని విని యతఁడు తాను ఊర్వశిని వెదకుచువచ్చుట, చారణులవలన నామెవృత్తాంతము నెఱుఁగుట మొదలగుసమాచారములనెల్ల వారికిఁజెప్పి పురూరవునిం గని, 'పూర్వ మీయూర్వశిని నారాయణముని సృజించి యింద్రున కిచ్చెను. ఇప్పుడామె యరాతుల చేతఁ జిక్కఁగాఁ నీవు విడిపించుకొనివచ్చి యిచ్చితివి; ఇంత యుపకారివైన నిన్నుఁజూడ నింద్రునకు కుతూహలం బతివేలం బయియుండఁగలదు, కావున నీవిప్డీయామెనుగూడఁదోడ్కొని వచ్చి యింద్రునిదగ్గఱ నొప్పగించి యాయన నానందపఱిచి స్వస్థానమునకుఁ బోవుట మేలు' అని చెప్పెను. వాని కా చక్రవర్తి' 'నేను చేసినదే మిప్పుడు, ఆయసురుని నేను గెలుచుటయు నింద్రునిమహిమవలననే కాదా; సింహము గర్జింపఁగా దానిప్రతిధ్వని విని యొకయేనుఁగు ఉలికిపడి చచ్చిన నది ప్రతిధ్వనిశక్తియా?' అని యుత్తరముచెప్పఁగా నాచిత్రరథుఁడు ప్రతాపముకలిమికిగర్వపడమి యాభరణముగానున్నదనిమిక్కిలి మెచ్చుకొనెను. అప్పు డారాజు తనకు త్వరగా తనపట్టణమునకు పోవలసినందున తాను దేవలోకమునకు రాను వల్లగాదనియు, ఊర్వశిని బిలుచుకొనిపోయి యింద్రునియొద్దఁ జేర్పుమనియు

* దేవతలలోఁ గొంచెముతక్కువవైన యొకజాతివారు.

నా చిత్రరథునితోఁ జెప్ప, అతఁ డట్లే యా యచ్చరలనెల్ల దోడ్కొనిపోయి దేవలోకము చేరెను.

ఇట్లు వీరు బయలుదేరిపోవునపుడు ఊర్వశి తనకుమహోప కారియైన పురూరవశ్చక్రవర్తిని సెలవడుగఁగోరి తానుగా అతనితో మాటలాడుటకు సిగ్గుపడి తనయభిప్రాయమును తన చెలియగు చిత్రలేఖతోఁ జెప్పి యడిగింప, ఆయన, 'మంచిది పోయిరావచ్చును, నామీఁదతలంపుమాత్ర ముండవలయును;' అని చెప్పఁగా ఆయనను విడిచిపోను మనస్సురాక తనచీర తీఁగ మీఁద జిక్కుకొన్నదని నెపముపెట్టి చిత్రరేకను దానిని వీడఁ దీయుమని యిట్లు కొంతసేపు జాగుచేసి ఆయనను తిరిగి తిరిగి చూచుచు విడిచిపోవఁజాలకపోవుచున్నదనియు ఎట్లోపోయి తనతావుచేరెను.అక్కడ దేవేంద్రుఁడు ఈసమాచారమంతయు వినిపురూరవశ్చక్రవర్తినిపలుతెఱఁగులపొగడెను. పురూరవసుఁ డును వారు ఆకొండమీఁదనుండి యావల దాఁటిపోగానే మనము తిరిగి యూర్వశి నెప్పుడు చూడఁబోయెద మని మిక్కిలి మక్కువనొంది ఆమెపోయినత్రోవనే చూచుచుండి ఆమె కను చూపుమేర మీఱిపోయినపిమ్మట మనస్సున వేఱొకచింతలేక యా పూఁబోఁడినే తలఁచుకొనుచు ఆమె విలాసములనే యెంచుచు పోయి ప్రతిష్ఠాననగరము చేరెను.

ఇట్లు పోయి పట్టణముచేరినదిమొదలు ఆయనకు నాహా రము రుచింపక నిద్రరాక యూర్వశిమీఁదిచింతయే పెద్దదై రాజ్యవ్యవహారములొకటియుఁదోఁపకయున్నందున ఆయన తన స్నేహితునితో తనవిరహబాధనంతనుం జెప్పుకొనెను. అతఁడును అది రహస్యసమాచారము గనుక ఎక్కడను బయలుపఱుపక యుండఁగా రాజుగారిపట్టపుదేవి నాఁడుదయకాలమున సంధ్యా

వందనాదికృత్యములు తీర్చుకొనివచ్చినది మొదలుకొని రాజేమో
ఱొకవిధముగా నుండుటచేత దానిమర్మమును దెలియవలయు
ననుకొని తనపనికత్తెయగు నిపుణికను రాజునకు వేడుకచెలికాఁ
డగు మాణవకునిదగ్గఱకుఁ బోయి రాజుగారివృత్తాంతమును
విచారించుకొనిరమ్మని పంపెను. ఆపెయును రాణియుత్తరువు
ప్రకారము వచ్చి రాజుసింహాసనముదగ్గఱ చిత్తరువునవ్రాసిన
బొమ్మవలె కదలక కూర్చుండియున్న యా*విదూషకునిం జూచి,
మన మితనినోటినుండి యీమాట నెట్లు బయటఁదీయవచ్చునని
యును, అయినను చింతలేదు, గడికమీఁదఁబడిన మంచువలె
నితనిదగ్గఱ మర్మము నిలువదు చెప్పివేయును అనియు నాలో
చించుచు దగ్గఱచేరి మ్రొక్కెను. అప్పు డాతఁ డీపెను జూచి,
ఓహోహో! ఈపె యెక్కడవచ్చినది, మన మీపెదగ్గఱ నోరు
జారక అతిజాగ్రత్తగా నుండవలయు ననుకొనుచు ఆపెను ఇంత
దూరము ఏమిపనిగా వచ్చితి వని యడిగెను. దాని కాపె రాణి
గారు తమదగ్గఱకు పంపఁగా వచ్చితి ననిచెప్పగా, అతఁడు, రాణిగా
రేమియుత్తరువు చేసి రని యడిగెను. అంత నానిపుణిక, 'నీవు నా
మీఁద మిక్కిలిప్రేమగలవాఁడ వయితివే, నేను దుఃఖింపఁజూచి
యుపేక్షింపవచ్చునా యని చెప్పిరమ్మన్నారు' అని చెప్పఁగా,
విదూషకుఁడు, 'ఏమిరాజేమైన ప్రతికూలముగా ప్రవర్తించెనా?'
అని యడిగెను. అందున కాపె, 'అవును, ఎవతెను మనస్సునఁ
జింతించుచు ఆయన తపించిపోవుచున్నాఁడో ఆపెపేరు చెప్పి
రాణిగారిని పిలిచెను' అని చెప్పఁగా, అతఁడు ఆయనయే యీ
గుట్టుబయటవేసికొనెనే యిఁక మన కేల నోరుకట్టిపెట్టుకొవల
సినసంకట మని తలఁచి, 'ఊర్వశియని పిలిచెనా? ఆమెను చూచి

---

* హాస్యగాఁడు.

నది మొదలు వెఱ్ఱిపట్టి దేవిగారికి దుఃఖము కలుగఁ జేసినదిమాత్రమే కాదు, నాప్రాణములను తీయుచున్నాఁడు' అని చెప్పెను. అతనినోటినుండి ఆమాట వినఁగానే నిపుణిక, తిన్నఁగా మోసముచేసి సంగతి తెలిసికొంటిమిగదా యని సంతోషించుచు, 'సరే, నేనుపోయి రాణిగారి కేమిసమాచారముచెప్పుదును' అనియడిగి దాని కతఁడు, 'నేను రాజుగారి కీవెఱ్ఱి కొంచెము విడిచినపిమ్మట వచ్చి దేవిగారిని చూచెదనని చెప్పుము.' అనఁగా, ఆమె యంతట రాణిదగ్గఱకు పోయి జరగినసమాచార మంతయుఁ జెప్పెను. అప్పుడు రాణి నిపుణికకు, 'ఇఁక అప్పుడప్పుడు జరగెడుసమాచారములను నీవు చక్కఁగా విచారించి నాకుఁ జెప్పుచు రావలయు' నని యుత్తరువు చేసెను.

అక్కడిసమాచార మట్లుండ, ఇక్కడ రాజు విరహవ్యథనోర్వఁజాలక తనచెలికానితో, 'అబ్బా! నా కొకటియు తోఁచలేదే, ఏమిచేయవచ్చును? ఎక్కడికిపోయిన నీబాధ కొంతయణఁగును' అనియడుగఁగా, దానికతఁడు పరిహాసముగా 'మనమిప్పుడు వంటయింటికి పోయిన అక్కడ పాత్రలలో నన్నిటను రుచ్యములయినభక్ష్యములు నించియుందురు, వానిం దిని తనియవచ్చును' అనెను. దానికి పురూరవుఁడు, 'నీవు తిండిపోతవుగనుక నీకు వంటయింటిమీఁదకలవరము,అక్కడికిపోఁగానే నీకు తనివికలుగవచ్చును; ఎన్నఁటికిని దుర్లభమైనవస్తువున కాశపడియున్న నా దుఃఖమును వంటయింటిలోనిభక్ష్యములెట్లు నఁదీర్పఁగలవా?' అనఁగా, విదూషకుఁడు, 'నీవేల యిట్లు మలమలమాఁడెదవు? ఆయూర్వశియును నీయందమును చూచినదే కదా! ఆమె నిన్ను వెదకుకొని రాకపోదు. కొంచె మోర్చుకొమ్ము' అని చెప్పెను. దానికి రాజు, 'నీవు నా కిచ్చకముగా మాటలాడుచున్నావు, ఆమె

యందమును చూచియుండిన నిట్లుచెప్పవు. నీకొక్కమాట చెప్పెదను విను. భూషణము లాపెయొడలఁబెట్టిన వానికాపెరూపము భూషణముగానుండును. ఉపమానములుగాఁ జెప్పెడువస్తువుల కాపెయవయవము లుపమానములుగానుండును. ఇంతకుమీఁద వర్ణింప నాకు శక్తిలేదు; కాఁబట్టి మన మిప్పుడు ఎవరికిని కానఁబడక యెక్కడనైన దాఁగి యుండకపోయిన మనగుట్టుదాఁగదు, *ప్రమదవనమునకు పోవుదమురా; అదే ఏకాంతముగా నుండఁదగినతావు' అనెను. అంత నిద్దఱును ప్రమదవనముపోయి చేరిరి.

అది వసంతకాలము గనుక, ఆతోఁట యంతయును చక్కగా చిగిరించిపూచి గమగమవాసన వచ్చుచుండెను. ఆవాసనతోఁగూడ చల్లని దక్షిణపుగాలి తిన్నగా వీవను, తుమ్మెదలు పువ్వులలోఁ జేరి తేనెం గ్రోలి ఝుంకారములుచేయను, కోవెలలు మావులయిగుళ్లు కొఱికి తిని క్రొవ్వివీఱి 'కూ'యని కూయను, వీనిచేత పురూరవునికి వ్యథ ద్విగుణితంబయి అతఁడు తనస్నేహితునితో, 'మిత్రుఁడా! నేనిక్కడవచ్చి హాయిపడవలె ననుకొన్నది యేటి నెదురీఁది దాఁటఁగోరిన ట్లయినదే. ప్రియురాలితోఁగూడనుండిన నప్పు డిక్కడివన్నియు నాకు సుఖకరములుగా నుండునుగాని యిప్పుడు సహ్యములుకాకయున్నవి, నే నిక్కడ నిలువఁజాలను.' అనఁగా దాని కతఁడు 'నీ వేల తపించెదవు; ఈవసంతకాలమున నామెకును తమతలంపుకలుగఁగా నే యామె యక్కడ నిలువఁగలదా? అవశ్య మిక్కడికి వచ్చును. భయపడవలదు; ఇదిగో మన లతామండపము, చూడుము, తుమ్మెదల రాపిడిచేత పువ్వులు తొడిమలువీడి క్రిందరాలి పూలపాన్పు పఱచినట్లున్నది; ఇక్కడ కూర్చుండి ప్రొద్దుపుత్తమురా' అనెను.

* ఇంటితోఁ జేరినదిగా నుండుతోఁట.

అంత రాజు చెలికానితోఁగూడ నాతీఁగలచవికలో పోయి కూర్చుండ, అప్పు డవ్విదూషకుఁడు నలుప్రక్కలం జూచి, 'ఇదే మనకు సుఖకరమైనతావు, చుట్టును తీఁగలు పూచి యెంతసొగసుగానున్నవో చూచితివా? వీనినన్నిటిని చూచుచుండిన నీతాపము కొంత చల్లాఱును, ఇక్కడనుండి లేవవలదు.' అనఁగా పురూరవశ్చక్రవర్తి, 'నేనేమి చేయుదునయ్యా! నీకంటికి ఇవన్ని చల్లఁగాఁ గనఁబడుచున్నవి, నాకంటి కగ్నిజ్వాలలుగా నున్నవే; నాకోరిక నెఱవేఱు నుపాయ మేదైన నొకటి యోచింపుము' అనెను. దాని కామాణవకుఁడు, 'మునుపు ఇంద్రుఁ డహల్యను మోహించినపుడు అతనిచేత నశ్వినీదేవతలు చిక్కినట్లు ఇప్పుడు నేను నీచేతఁ జిక్కుకొంటిని; వారొకవెజ్జివాండ్రు, నేనొకవెజ్జివాఁడను'అని పరిహాసము చేయఁగా రాజు *"మిత్రమాపత్సుజానీయాత్" అనున్యాయము ననుసరించి యిటువంటిసమయముల లోనేకదా స్నేహితుఁడు కావలయును" అనెను. దానిమీఁద నతఁడు, 'అట్లైన కొంతసేపు నన్ను మాటలాడింపక యూరకొనియుండుము, నే నాలోచించి చెప్పెదను' అని యోచించుచుండెను.

అప్పుడాపురూరవున కేదో యొకమంచిశకునము కాఁగా ఆయన అపూర్ణచంద్రముఖి తనకు లభించుటయరుదే, శకునము మంచిదిగా నగుటకు కారణమేమి, అయిన నేమో చూతము. అనుకొని ఆ పెరాఁదగినదిక్కు నేచూచుచుండఁగా విదూషకుఁడు, 'మహారాజా! తమరు ఇప్పుడు చేయఁదగినయుపాయము నాకొకటితోఁచుచున్నది, ఆ మెరూపును చిత్తరువున వ్రాసి చూచు

* ఆపదలయందు స్నేహితుని నెఱుఁగవలయును.

కొనుచుండవచ్చును; లేదా నిద్రపోయిన ఆమెవచ్చినట్లును ఆమెతో మాటలాడినట్లును ఇట్లంతయు కలగనవచ్చును' అని చెప్పెను. అది విని రాజు, 'చెలికాఁడా! మంచియాలోచన చెప్పితివి, నా దేహమును మనస్సును ఉడికిపోవుచున్న వే, నాకు నిద్రగూడ వచ్చునా? చిత్తరువైన నా చేత వ్రాసి ముగింపవచ్చునా? నేను వ్రాయనారంభింపఁగానే కన్నులనీళ్లు గ్రమ్మునే, ఏమి చేయుదును.' అనఁగా విదూషకుఁడు, 'నాకుఁ దెలిసినయుపాయమును చెప్పివేసితిని, ఇంతకంటె వేరేయేమియు నాకుఁ దెలియదు' అనెను. అతఁడును చెయివిడువఁగానే రాజు మఱియు దిగులుపడి, తన వ్యసనమును ఆయూర్వశి ఎఱుఁగదేమో, ఎఱిఁగియే లక్ష్యపెట్టకయున్నదో, ఏమి చేయవచ్చును. ఏదివచ్చినను అనుభవించి తీఱవలసినదే అని తనలో తాను పలవించుచుండెను.

వీరిసమాచార మిట్లుండ, మునుపు హేమకూటపర్వతమున పురూరవుని విడిచిపోయినది మొదలుకొని యాయూర్వశికి దేవలోకమున నొకక్షణమైన నిలువ సహింపక ప్రతిష్ఠాననగరమునకు వచ్చుటకు చిత్రలేఖనుంగూడఁ బిలుచుకొని బయలుదేరెను. అప్పుడాచిత్రలేఖ యామెతో, 'నాప్రాణప్రియా! ఎక్కడికి వయిన మేమియుఁ జెప్పక బయలుదేరితివే, నీవు పోవుతావు నాతోఁ జెప్పఁగూడదా?' అని యడుగఁగా, 'ముందు మనము హేమకూటమునుండి వచ్చునప్పుడు నాకొక రొంక తీఁగకుఁ జిక్కుకొని నేను తిన్నఁగావచ్చుటను జూచి నీవు నన్ను పరిహాసముచేసితివే అది మఱచిపోతివా?' అనెను. దానికి చిత్రలేఖ 'సరే, ఆరాజుగారిదగ్గఱకు పోవుటకా బయలుదేరితివి' అని యడిగి, దాని కామె, 'అవును, మనపనికి మనమే సిగ్గువిడిచి బయలుదేరవలసియున్నది.' అని చెప్పఁగా, 'మంచిది,

ముం దెవరినైన *దౌత్యమునకు పంపితివా?' అని యడిగెను. ఆమె నామనస్సునే పంపియున్నా నని యుత్తరము చెప్పెను. అంత చిత్రలేఖ, 'మంచిపనిచేసితివి, అయినను నిన్నట్లు చేయుమన్నవా రెవరు?' అని యడిగి, దాని కామె, 'మన్మథుఁడు' అని యుత్తరము చెప్పఁగా విని, 'సరి, అట్లైన నీకను నేను నోరు తెఱవవలసినది లేదు.' అనెను. అప్పుడాయూర్వశి చిత్రలేఖతో, 'మనము ఒంటిగా పోవుచున్నామే, మునుపటివలె దుష్టులైన రాక్షసు లెవరైన వచ్చి మనలను పట్టుకొనిపోదురేమో, ఎవరికిని కానఁబడక పోవుమార్గ మొకటి చూడుము.' అనఁగా చిత్రలేఖ, 'ఓసి పిఱికీ! భయపడకుము, మనకు బృహస్పతి యుపదేశించిన † విద్యను మఱచిపోతివా? అది యుండఁగా మన కెక్కడఁ బోయిన నేమిభయము?' అనెను. దానిని విని ఊర్వశి, 'అవునవును, ఇప్పుడు నా కదియంతయు చక్కఁగా జ్ఞప్తికివచ్చినది' అనెను. ఇట్లిద్దఱు మాటలాడుకొనుచు ఆకాశమార్గమున వచ్చి ప్రతిష్ఠాననగరము ప్రవేశించిరి.

అపుడు ఊర్వశి, చెలీ! ఈపట్టణమును జూచితివా? ‡ ప్రయాగములో తన యందమును తాను చూచుకొనుచున్నట్లున్నది, ఆ రాజునగరు ఈపట్టణమున కంతయు నాభరణముగా నున్నది.' అని చెప్పి యామెకు చూపి, అంత, 'ఇప్పుడు

---

* ఒకతావునుండి మఱియొకతావునకు సమాచారమును తీసికొని పోయి చెప్పుట.

† ఇది అపరాజిత అనునది. దీనిని తెలిసినవారు ఒకరిచేతఁ జిక్కరు. (అపరాజిత=ఓడిపోనిది.)

‡ గంగాయమునాసంగమము.

వీనియందమంతయుఁ జూచి కాఁదగిన దేమున్నది, మన మింత ప్రయత్నపడి పోఁగానే ఆయన మనలనుకన్నెత్తియైనఁజూచునో చూడఁడో, ఆయనయభిప్రాయ మెట్లున్నదో దానినిగదా ముందు తెలిసికోవలయును, మంచిది దేనికైన *నందనవనమునకు సమానమైన యీవనమున దిగి యిక్కడిసమాచారములను నెఱుంగుదము.' అని చెప్పి తనచెలితోఁగూడ ప్రమదవనమున దిగెను. చిత్రలేఖ అక్కడ మహారాజుయొక్క సౌందర్యము మాసియుండుటను జూచి, 'నా నెచ్చెలీ! మహారాజును జూచితివా? అప్పు డుదయించినచంద్రుని మబ్బు కమ్ముకొన్నట్లు కానఁబడుచున్నాఁడు.' అనఁగా ఊర్వశి, 'అవును, ముందుచూచినప్పటికి ఇప్పటికి రూపము మిక్కిలి మాఱియున్నది; అయినను † తిరస్కరిణీవిద్యచేత తము మెవరికిని గానఁబడక యాయనకు దగ్గఱగా పోయియుండి యేమిచెప్పుచున్నాఁడో విందము' అనెను. దానికి చిత్రలేఖ, 'అట్లే కానిమ్ము.' అనఁగా ఇద్దఱును వచ్చి ఆయనప్రక్కను నిలిచిరి.

ఇట్లక్కడ నిలిచినతోడనే చిత్రలేఖ ఆయన తనదుఃఖము నంతను విదూషకునితోఁ జెప్పుకొనుటను విని యూర్వశితో, 'ఏమమ్మా! అప్పటినుండి యల్లాడిపోతివే, ఆయనయును నీవు రాలేదనియే తపించిపోవుచున్నాఁడు, చూచితివా!' అనఁగా, 'అవును; నేనుచేసినదే తప్పు; అయినను ఇప్పటికిని ఆయన యెదుటపోయి నిలుతమా యనిన మనస్సునకు తెంపుకలుగ లేదే, కాఁబట్టి వ్రాతమూలముగానైన ఆయనకు నాయభిప్రాయమును

---

* ఇంద్రుని వనము.

† తా మెవరికంటికిని కానఁబడకయుండునట్లు చేయఁగల యొక మంత్రము.

దెలిపి ప్రత్యుత్తరము రప్పించుకొనియెదను' అనెను. దానికి చిత్రలేఖ అట్లే చేయుమని సమ్మతించెను. అంత నాయూర్వశి యొకమ్రానిపట్ట తీసికొని దానిమీఁద తనగోళ్లతో, 'మీరు చెప్పెడిదంతయు సరే, నేను దురదృష్టురాలను, నాకుమాత్రము తమమీఁద ననురాగము లేదా? ఒక్కవిషయముమాత్రము చెప్పెదను, దానివలన నాస్థితి తమకుఁ దెలియవచ్చును; నందన వనమందలి పారిజాతపుఁబువ్వులను బఱచుకొని పండుకొని యుందును, ఇట్లుండఁగా చల్లని మలయమారుతము మీఁద నోకెనా నిప్పులుచల్లిన ట్లుండును.' అనునభిప్రాయముగల రెండు శ్లోకములను వ్రాసి ఆయనయెదుట వేసెను. దాని చూచి మాణ వకుఁడు, 'ఓహోహో, ఇదేమి ఆశ్చర్యముగానున్నది! ఏదో పాముకుబుసమువలె నీదగ్గఱకు కొట్టుకొనివచ్చుచున్నది.' అని భ్రమపడి చెప్పఁగా రాజు చిఱునవ్వునవ్వి, 'ఇది పాముకుబుసము కాదబ్బా మ్రానిపట్ట, ఎవరో దానియందేమో వ్రాసివేసిన ట్లున్నది' అనెను. దానికి విదూషకుఁడు, 'నీవ్యసనమును విని యూయూర్వశి యేమైనను వ్రాసియుండునేమో యెత్తి చూడుము.' అనఁగా, రాజు, 'ఆశకు మందల యెక్కడిది.' అని చెప్పుచు ఆపట్టను ఎత్తి చదివిచూచుకొని సంతోషపడి విదూ షకునితో, 'నీవుచెప్పినది సరిగానేయున్నది' అని చెప్పెను. విదూషకుఁడు, అట్లయిన దానిని కొంచెము గట్టిగా చదువుము నేనును వినియెదను.' అని యడుగఁగా ఆయన యట్లే చదివి విని పించెను. దానిని విని మాణవకుఁడు, 'దీనిచేత తమకిప్పుడు కొంచె మూఱటకలిగియుండవచ్చునుగదా!' అనఁగా, పురూరవుఁడు, 'ఊఱటయనియా చెప్పెదవు, ఆపె తనకు నాయందనురాగము పూర్ణముగా నున్నట్టు వ్రాసియున్నది; దీనిని చూడఁగానే నా

కాపెనే చూచినంతసంతోషముగా నున్నది. నావ్రేళ్లు చెమర్చు చున్నవి; దానిచేత అక్షరములు మాసిపోవును; కాబట్టి దీనిని నీవు తీసిపెట్టుము' అని యాపట్టును అతనిచేత నిచ్చెను. అతఁడును దానిని చేతఁ దీసికొని, 'నీకంతయాశ పుట్టించినదానామె యేమి ఇంకను వచ్చి హెచ్చరించుకొనక యూరకున్నది' అనెను.

ఊర్వశి యామాట వినుచునే, 'చెలీ! నేను తటాలున ఆయనయెదుటికి వచ్చుటకు నాకు సంకోచముగా నున్నది. నేను నామనస్సును దృఢపఱచుకొని వచ్చునంతలో నీవు ముందు పోయి ఆయనతో నాకనుకూలమయినమాటలను మాటలాడు చుండుము.' అనఁగా దాని కాచిత్రలేఖ అట్లే కానిమ్మని యొప్పుకొని రాజునెదుట వచ్చి నిలిచి మర్యాదప్రకారము హెచ్చరించు కొనెను. అప్పుడు రాజు ఆమెను క్షేమమడిగి, 'గంగను విడిచి వచ్చినయమునవలె ఊర్వశిని విడిచి నీవుమాత్రము వచ్చినది నా కంతసంతోషకరముగా నుండలేదు.' అనఁగా అది విని చిత్రలేఖ 'మబ్బులేచిగదా మెఱపు మెఱయును.' అని మఱియును, "మహారాజా! 'మునుపు రాక్షసునివలన తన్ను రక్షించినట్లు ఇప్పుడు మన్మథునివలనను రక్షింపవలయును.' అని యూర్వశి ప్రణమిల్లి ప్రార్థించుచున్నది" అని చెప్పెను. దానికి రాజు,'నీవు ఆసుందరీమణిమాత్రము తపించుచున్నట్లు చెప్పుచున్నావే, ఆమె కుఁగా నేనుపడుచున్న బాధ నీకంటికగపడలేదా!' అనఁగా చిత్రలేఖ తోడనే, 'ఊర్వశీ! ఇంకను నీకు రాను మనస్సురాలేదా!' అని పిలిచెను. దానిని విని యూర్వశి ఎదుటవచ్చి నిలిచి చిత్రలేఖతో, 'ఎంతగట్టిదానవే, నేను పరాకుగా నుండునపుడు నాతో చెప్పక నన్నొంటిగా విడిచిపెట్టి వచ్చితివి.' అని తానేమియు నెఱుఁగనిదానివలె నటింపఁగా, చిత్రలేఖ 'ఎవరి నెవరు

ఒంటిగా విడిచిపెట్టిపోవయినను ఇఁక నొకక్షణములో తేట పడఁగలదు, ఆమాట లుండనిమ్ము, రాజుగారికి మ్రొక్కుము' అనెను. అట్లే ఊర్వశియును ఆయనకు మ్రొక్కి యెదుట నిలి చెను. అప్పు డాయన ఊర్వశిని జూచి, 'దేవేంద్రునికిఁ జేయు మర్యాదను నాకుఁ జేసితివే, ఇంతకంటె నీక నేమి నాకుఁగావలసి నది, ఈలోకమున ఇంతమర్యాద ఎవరికిఁ గలదు.' అని యిట్లు వేడుకగా మాటలాడుచుండునపుడు దేవలోకమునుండి దేవ దూతయొకఁడు వచ్చి, 'ఓచిత్రలేఖా! ఊర్వశిని సిద్ధముగానుండు మను; భరతముని మీకు నేర్పినయాటను మీరాడఁగాఁ జూడ వలయునని ఇంద్రుఁడు మొదలగుదేవతలందఱు కోరికకలిగియు న్నారు' అని చెప్పెను. అది విని యందఱును, అయ్యో! దరి ద్రుఁడు తలగడుగఁబోఁగా వడగండ్లవాన వెంటనే వచ్చెనన్నట్లు ఆమాటకును ఇదేనా సమయము; అని వ్యసనపడిరి. చిత్రలేఖ ఊర్వశితో, 'ఏమమ్మా! దూత చెప్పినమాట వింటివిగదా? మహారాజుగారిదగ్గఱ సెలవుతీసికొమ్ము.' అనఁగా ఊర్వశి, 'నే నేమిచేయుదును. నాకు ఆయనను సెలవడుగను నోరాడలేదే' అనెను. అప్పుడు చిత్రలేఖ పురూరవశ్చక్రవర్తితో, పరాధీనలైన వారు తమస్వామియుత్తరువుప్రకారముగదా నడవవలయును; ఇప్పుడు దేవేంద్రుఁ డీమెను రమ్మని చెప్పిపంపెనే, దానిని తమతో సాక్షాత్తుగా మనవిచేసి సెలవడుగుట కీమె జంకుచున్నది; తమ రీమెకు సెలవు దయచేయువలయును.' అనఁగా రాజు,'నేను మీ యేలికయుత్తరువున కభ్యంతరముచెప్పుదునా? సుఖముగా పోయిరావచ్చును; అయినను నేను జెప్పవలసిన దొకటియున్నది, అదేమనిన నన్ను మఱవవలదు' అనెను. ఊర్వశి మరల నెడఁ

వ్రాసిపోవలసినదిగానే యేర్పడెనే యని యతివ్యసనముతో తన చెలియైన చిత్రలేఖతోఁగూడ పోయి దేవలోకము చేరెను.

అప్పుడు ఆమెవిరహామునోర్వఁజాలక పురూరవుఁడు నిట్టూర్పులువిడుచుచు, ఇంతకాలమున కామెమనస్సు కరఁగి యాపె వచ్చినను దైవమున కింకను మనస్సురాన ట్లున్నది, కాఁబట్టి ఆపెను నాకు దక్కనీయ లేదు; నాదురదృష్టము నేమనవచ్చును అని పలవించుచుండ, విదూషకుఁడు, ఊర్వశి వ్రాసిన పత్రికను చూపుద మనుకొని యెత్తఁబోవుచు రాజుతో నేమో చెప్పఁబోగా, ముందు ఆయూర్వశివిలాసములను జూచుచు ఏమఱి దానిని పోఁగొట్టివేసెను గనుక, అది కనఁబడకపోయినందున, ఓహో ఒకవేళ ఈయన యడిగిన నేమియుత్తరము చెప్పుదును అని దిగులుపడి యూరకుండెను. ఆసమయమున రాజు, 'ఏమో చెప్పవచ్చితివే; ఏమిటిది' అని యడుగ, 'ఆమెకు నీయందే మనస్సు దృఢముగా తగిలియున్నది; వ్యసనపడవలదు' అని చెప్పవచ్చితి ననెను. దానికి రాజు,'సరే, నాకును అట్లేతోఁచుచున్నది; ఆపె పోవునప్పుడు నన్ను విడిచిపోను కాళ్లాడకయే పోయినది; అయినను స్వాధీనురాలు కాదే; అవి యన్నియు నిష్ఫ డనుకొని కార్యమేమి? ఆపెవ్రాసివేసిన పత్రికను తెమ్ము, దానినిచూచుచు నైనను ప్రొద్దుపుచ్చెదను.' అని యడుగ, ముందే దిగులుపడి పడకుచున్న మాణవకుఁడు 'అయ్యో! ఊర్వశితోఁగూడనే అదియును పోయినదే' అనెను. అప్పుడు రాజు, 'నీవు చేసెడుపనులన్నియు నిట్లే,కొంచెమైనను జాగ్రత్తలేదు.' అని యతనిమీఁద కోపించుకొని యతనినిం దానిని వెదకుమని చెప్పి తానును వెదకుచుండెను.

ఇక్కడికథ యిట్లుండ, అక్కడ రాణిగారు పిమ్మట జరిగెడు వృత్తాంతములనన్నిటిని విచారించి తనకుఁజెప్పుమని నిపుణికతోఁ జెప్పియున్నందున ఆమె రాణిదగ్గఱకు పోయి 'ఇప్పుడు రాజుగారు ప్రమదవనమున విచారపడుచున్నారు.' అని చెప్పఁగా రాణి, మంచిది అట్లయినను మనముపోయి చూతమురమ్మని యానిపుణికనుంగూడఁ బిలుచుకొని యాతోఁటకు వచ్చిచేరి అక్కడ లతామండపమున వారు కూర్చుండియుండుటను జూచి, 'నిపుణికా! నీవు చెప్పినది వాస్తవమే; ఇక్కడ మాణవకుఁడును రాజును కూర్చుండియున్నారు; మన మీచెట్టుమఱుఁగున దాఁగియుండిన వారు మాటలాడుకొనుమాట లన్నియు వినవచ్చును; అప్పుడు ఇంకను దీనిమర్మమంతయుఁ దెలియును' అని చెప్పఁగా నిద్దఱు నట్లే వా రుండెడులతామండపముసమీపమున నొకచెట్టు మఱుఁగున దాఁగియుండిరి. అప్పుడు విదూషకుఁడు పోఁగొట్టిన యాపట్టి గాలికి కొట్టుకొనివచ్చి రాణి కాలిదగ్గఱ పడెను. దానిని జూచి నిపుణిక, 'ఇదేమి! చింపిపేలికయాచూడుము.' అనిచెప్ప, రాణి దానిని నిదానించి చూచి, 'ఇది పేలికకాదు, వ్రాసెడి పట్ట, గాలికి కదలునపుడు దానియందు వ్రాసియున్న యక్షరములు తెలియవచ్చుచున్నవి.' అని చెప్పి, నిపుణిక దానిని చేత ఎత్తి 'దీనిని చదివెదరా?' అని యడుగ, 'నీవే చదివిచూడుము, చెఱు పేమియు లేకుండిన, ఆవల నాకు వినిపింతువు' అనెను. అట్లే నిపుణిక దానిని చదివిచూచి, 'మనరాజుగారికి ఆయూర్వశి వ్రాసినదిగా ఉన్నది.' అని చెప్పఁగా రాణి, 'అట్లయిన నేదీ చదువు చూతము.' అని మిక్కిలి యాతురముతో నడిగి, ఆమె అందు వ్రాసియున్న పద్యములను రెంటినిజ దువ విని, 'ఆ! సరి,

ఇప్పుడు రాజుగారి మనస్సులోనున్న భావము స్పష్టమైపోయినది' అనెను

ఇక్కడ రాజును మాణవకుఁడును ఆపట్టను అంతటను వెదకిచూచియును అది దొరకనందున మాణవకుఁడు రాజు తలంపు నెట్లయిన వేఱువిషయమునకు మార్పవలయు ననుకొని, 'నామిత్రుఁడా! ఇదిగో ఈతోఁటప్రక్కనునీవు వేడుకగా తిరుగు కొండ కనఁబడుచున్నది, అక్కడికి పోవుదమా?' అని యడుగ, దానిని వినకయే రాజు దక్షిణపుగాలిని చూచి, నేనాపట్టును పెట్టుకొనినయైనను కాలము గడపుదును, దాని నెత్తుకొనిపోయి నీవేమి చేసెదవు, వ్యర్థముగా ఏల దొంగిలింపవలె, నీవుఁను ముందు *అంజనాదేవిమీఁద మోహము కలిగియున్నప్పుడు ఈదుఃఖము ను అనుభవించినవాఁడవే కదా! దీనిబాధ నీకు తెలియును నే'అని నిందించుచు, దగ్గఱ నొక మూసిన నెమలియీఁక పడియుండగా దాని నాపట్టయనుకొని యెత్తఁబోయెను. వీని నన్నిటిని చూచి రాణి అతికోపముతో కన్నులు ఎఱ్ఱఁబాఱఁగా ఎదుటవచ్చి నిలిచి, 'ఏల యూరక దుఃఖపడియెదరు ? ఇదిగో ఆయూర్వశి వ్రాసినపట్ట' అని చేతనందీయఁబోయెను అదిచూచి రాజు నివ్వెఱపడి,'ఏమి దేవీ! క్షేమమా?' అని యామెను విచారించి, విదూషకుని ప్రక్కతిరిగి, 'ఏమయ్యా! ఇప్పుడేమి యోచన చెప్పెదవు?' అని సైఁగగా నడుగ, అతఁడు, 'సొత్తుతోఁగూడఁ జిక్కినదొంగకు తిరిగి నోరెక్కడిది'అనెను. అతఁ డట్లు చెయివిడువఁగానే రాజు మఱియు దిగులుపడి రాణిప్రక్కతిరిగి, 'నాప్రియతములారా! నేను దీనిని వెదకలేదే.' అనఁగా ఆమె, 'దీనిలో

* వాయువు అంజనాదేవిని మోహించి యామెను బొందఁగా హనుమంతుఁడు పుట్టెను. ఈకథ రామాయణమందు వచ్చును.

తప్పేమి? మీకమనీయతను మీ రేలదాఁచుకోవలె' అనెను. దానిని విని విదూషకుఁడు 'అమ్మా! ఇది చూచినది మొదలు కొని ఆయనకు ఏమో వెఱ్ఱిపట్టినట్లున్నది, పిత్తశమనముగా భోజనము పెట్టింపుము' అనఁగా రాజు, 'నీవూరక నామీఁద లేనిపోనివి కల్పించి చెప్పగానే ఆపె నమ్మునో, ఆపెకు నీగుణము తెలియదా యేమి?' అనెను. దానిమీఁద రాణి రాజుతో, 'తమయందు తప్పేమున్నది? ఏమియు లేదు; నన్నుచూడ నిష్ట ములేని తమయెదుటవచ్చి నిలువఁబడియున్న నాయందే తప్పు.' అని నిష్ఠురములాడి నిపుణికనుకూడఁ బిలుచుకొని జరాలున పోసాగెను. అది చూచి రాజు వెంటనే పోయి అడ్డముతగిలి, 'నే నేమియు నట్టితప్పు చేయలేదు. అట్లుకాక ఒకవేళ నేనుచేసినది తప్పుగా నీకు తోఁచియుండినను క్షమింపవలయును.' అని మ్రొ క్కఁగా ఆమె దానిని లక్ష్యపెట్టక పోయి తనతావుచేరెను.

అంత విదూషకుఁడు ఏమియుఁ దోచక యూరక యక్కడ నిలువఁబడియున్న రాజునుజూచి,'ఏల యిక్కడ నూరక నిలిచెదవు? రా, ఆమె వానకాలపునదివలె కలఁకదేఱకయేపోయి యిల్లుచేరెను.'అని చెప్పఁగా విని రాజు తిరిగిచూచి,'మిత్రుఁడా! ఇప్పు డాపెచేసినదా తప్పు? మనకు అంతరమైనప్రేమ యుండి మనము ప్రార్థించియుండినంగదా ఆపెమనస్సునందును కోప మాఱును' అనెను. దానికి మాణవకుఁడు, 'నీ కిదియనుకూలమే, కంటినొప్పివానికి దీపము కూడదుగదా!' అనఁగా, పురూర వుఁడు, 'అట్లుకాదు, ఎట్లుండినను ఆపెమనస్సు చిన్నపుచ్చఁగూ డదు, మనకు ఊర్వశిమీఁద ప్రేమయుండఁగానే యీపెను విడిచిపెట్టవచ్చునా?అయినను నేను మ్రొక్కినం గూడ లక్ష్యము చేయకపోయినది గనుక నామీఁద తప్పులేదని ధైర్యముగా

నుండెదను.' అనిచెప్పి మరల నూర్వశిని తలఁచుకొని విచార పడుచుండెను.

ఇక్కడనుండి ఈయన మ్రొక్కినను లక్ష్యపెట్టకపోయి యంతఃపురము చేరినరాణి పశ్చాత్తాపమునుబొంది, 'ఆఁడుదాని బుద్ధి అపరబుద్ధి, అన్నదానికి సరిగా అప్పుడు మానమునే గొప్పగాఁ దలచితిమేని పిమ్మట కలుగఁగలబాధను యోచింపక పోతిమి అనుకొనుచు, ఇఁకను మనముగా ఏముఖము పెట్టుకొని యాయనయెదుటికి పోవచ్చును. పోతిమిపో ఆయన కన్నెత్తి చూచునో చూడఁడో మంచిది కానిమ్ము, *ప్రియానుప్రసాదమనునోము నోతము. అని నిశ్చయింకొని దానిని పట్టెను. పట్టి దానిపూజమొదలయినవి చంద్రుఁడు రోహిణీనక్షత్రముతోఁ జేరియుండునపుడు చేయదగినవగుటచేత మేడమీఁద తనప్రియుని దగ్గఱనుంచుకొనియే వానినెల్ల జరగింపఁదలఁచి అంతఃపురద్వారపాలకుని రాజుగారి కావయినమును తెలియఁజేసి రమ్మని పంపెను. అప్పుడు రాజు సాయంకాలము చేయవలసిన నిత్యకర్మములనన్నిటినిం దీర్చుకొని, 'పగటిపూఁట ఎట్లో పనుల పరాకున ప్రొద్దుపుచ్చితిమి, ఆయెను అస్తమించెనే, ఇఁక రాత్రి ప్రొద్దు గడియ యొకయుగముగా పెరుగునే, దీని నెట్లు గడపఁబోయెదము.' అని చింతించుచు తనచెలికానితోఁగూడ వచ్చుచుండ, ఈయంతఃపురద్వారపాలకుఁడు పోయి, 'రాణిగారొక నోము పట్టియున్నారఁట' దానినిమిత్తము తమరు కొంచెము సేపు మేడమీఁద దయచేసియుండవలయునని మనవిచేయుమనిరి' అని చెప్పెను. దానికి రాజు, 'ఆపెయిష్టప్రకారము నడచుటకు

*ప్రియుఁడు కోపించుకొనియుండిన అకోపముతీఱుటకుఁగా నోఁచెడి నోము.

సిద్ధముగా నున్నానని చెప్పుము.' అని యతనిని పంపి, విదూషకుని, 'ఇదేమి వాస్తవముగానుండునా? లేక యేదైన మాటు పాటుగానుండునా?' అని యడుగ, అతఁడు, 'వ్రత మను నెపము పెట్టి ముందు తాను మిమ్ము నలక్ష్యము చేసిపోయినతప్పును దిద్దుకోఁదలచియుండు నని నాకుఁ దోఁచెడిని' అనిచెప్పెను. అది విని రాజు, 'అవును, నీకు తోఁచినది సరే, స్త్రీలు తమ కెంత సంకటముగా నున్నను పరువునే గొప్పగాఁ జూతురే కాని ఒకరికి లొంగరు' అనెను. ఇట్లు మాటలాడుకొనుచు నిద్దఱు చుట్టుదివటీలతో పోయి మేడమీఁదఁ జేరిరి. మఱిక్షణమునకంతయు చంద్రోదయము కాఁగా రాజు దివటీలుపట్టువారిని చూచి, 'వెన్నెల వచ్చినపిమ్మట దివటీలేల? మీరందఱును పోవచ్చును.' అనివారిని పంపివేసి, విదూషకునితో, 'ప్రొద్దయినదే, ఇఁక క్షణమున కంతయు రాణి వచ్చిచేరును, ఇప్పుడు ఒంటరిగానున్నప్పుడే కొంచెము సేపైన ఊర్వశిమాటలు మాటలాడుకొందము.' అని చెప్పఁగా, అతఁడు 'ఏమి! అప్పుడు పోయినామె యింకను రాలేదు; అయినను, నీమీఁద నామెకు మిక్కిలి మక్కువయున్నది గనుక ఇఁక కొంచెముసేపటి కైనను వచ్చునే కాని రాకపోదు; కొంచెముసేపు ఓర్చుకొనియుండుము' అని చెప్పెను. దానికి రాజు, 'నీ కేమబ్బా! చెప్పెదవు, నాదుఃఖము నాకుఁగదా తెలియును, నాయిష్టము నెఱవేఱుసమయము నకు ఏదో యొక పనికిమాలినవిఘ్నము వచ్చుచున్నదే.' అని యిటు పలవించుచుండెను.

ఇదంతయు నిట్లుండ, నాట్యమాడుటకుఁగా దేవలోకమునకుఁ బోయిన యూర్వశి, సరస్వతీదేవి రచించిన లక్ష్మీస్వయంవరమునునాటకమున లక్ష్మీవేషము వేసికొని అందఱును ఈపె

లక్ష్మియే అని యెంచునట్లు అంతఅందముగా నభినయించుచుండు నపుడు, వారుణీవేషము వేసికొని అభినయించుచువచ్చిన మేనక యూమెను పిలిచి, 'అమ్మా! ఇక్కడ శ్రీమహావిష్ణువు మొదలగు దేవతలందఱును వచ్చియున్నారు; వీ రందఱును మూఁడులోక ములను తమయిష్టప్రకారము నడపశక్తికలవారు, నీకిష్టమువచ్చిన వానిని భర్తగా వరించుకొమ్ము.' అని చెప్పఁగా, ఊర్వశికి పురూరవునిమీఁద నే మనస్సుతగిలియున్నందున, ఆటసందర్భము నకు తగినట్లు పురుషోత్తముఁడైనమహావిష్ణువును వరించెదనుఅని చెప్పక, 'పురూరవశ్చక్రవర్తిని వరించెదను' అనిచెప్పెను. దానిని విని వారికి నాట్యమునేర్పినభరతముని, నీవెవనినో మనస్సునఁ దలఁచుకొని నేను నేర్పినవిద్యను చెఱిపివేసితివి గనుక ఇఁక నీకు దేవలోకమున వాసమును దివ్యజ్ఞానమును లేకపోవుఁగాక' అని శపించెను. అందుచేత సిగ్గుపడి తలవంచుకొనియున్న యూర్వశిని జూచి దేవేంద్రుఁడు 'ఆపురూరవశ్చక్రవర్తి మనకు లెక్కలేని యుపకారములు చేసియున్నాఁడు; కాఁబట్టి యాయనను సంతోషపఱుపవలసినది మన కవశ్యమే; నీవు నీయిష్టప్రకారము ఆయనదగ్గఱపోయియుండి నీయందు ఆయన కొకకుమారుఁడు కలిగినపిమ్మట తిరిగివచ్చి యిక్కడ చేరవలసినది' అని యనుగ్ర హించెను. అంత ఊర్వశి, ఈముని మనకు కీడుచేయఁ దలఁచినను అది మేలుగా నేర్పడినది. అని సంతోషించి, తనచెలియైన చిత్ర లేఖతోఁగూడ అక్కడనుండిబయలుదేరి ప్రతిష్ఠాననగరమువచ్చి, చేరి, రాజు ఎక్కడ ఏమిచేయుచున్నాఁడో తెలియవలయునని యోచించుచు రాజుమేడమీఁదికి వచ్చి ఆయన అక్కడ తన స్నేహితునితోఁగూడ విలాసముగా నుండఁగని, వారికి కనఁబడక యొకప్రక్క దాఁగియుండెను.

అప్పుడు పురూరవుఁడు విదూషకునితో, 'ఏమిచేయుదు నబ్బా! ఈరాత్రి యెట్లు అప్పటప్పటికి పెరుగుచున్నదో నా తాపము నట్లే పెరుగుచున్నదే' అనఁగా అతఁడు, 'చల్లఁగా వెన్నెలకాయుచున్నదే, ఇప్పు డేమితాపము' అనెను. దానికి రాజు, 'నాతాప మీవెన్నెలచేతఁ దీఱెడిదికాదురా అబ్బా! ఆ యూర్వశిముఖచంద్రునివెన్నెలనుఁ జూచి తీఱవలసినది' అనెను. ఇట్లు వీరు మాటలాడుకొనుమాటలను విని యూర్వశి రాజున కెదుట రాఁదలఁచియుండ, రాణివచ్చి యక్కడచేరెను. ఆమెను చూచి యూర్వశియును చిత్రలేఖయును, ఇదేమిది! ఏదిపట్టినను విఘ్నముగానే వచ్చుచున్నదని చింతించుచు నిలువఁబడిరి. పురూరవుఁడు, ఓ! దేవివచ్చిచేరునే, ఇఁక నోరు తెఱవరాదు. అనుకొని తనచెలికాని నణఁచిపెట్టి తానును మాటలాడక అప్రక్కనే చూచుచుండెను. అప్పుడు రాణి తనపనికత్తెలచేత వ్రతమునకు కావలసిన పూజాద్రవ్యములన్నియు నెత్తించుకొనివచ్చి రాజు దగ్గఱచేరి ఆయనకుమ్రొక్కి, నాప్రాణేశ్వరుఁడా! ఈవ్రతము తమ యెదుటనే నెఱవేర్పవలసినదిగాయున్నది. కాఁబట్టి నాకుఁగా కొంచెమునేపు తమరు ప్రయాసపడవలయును.' అని ప్రార్థించి, దాని కాయన 'నీకుఁగా నేనుపడునది ప్రయాసమా? అదెప్పుడు కలుగఁబోవునని కాచుకొనియున్నానే; మంచిది, అది యుండ నిమ్ము, ఈనోముపేరేమి?' అని యడుగ, తాను దానిని చెప్ప సిగ్గుపడి నిపుణికచాయ చూచెను. ఆమె, 'దీనిపేరు ప్రియానుప్రసాదము' అనిచెప్పెను. అదివిని రాజు, 'సుందరీమణీ! ఏల దిరిసెపుఁబూవువలె మృదువయినదేహమును నోములచేత వాడ్చెదవు? నీవెవనియనుగ్రహమును కోరుచున్నావో అతఁడు నీవు కన్నెత్తిచూతువా యని నీకు దాసుఁడై పడియున్నాఁడే' అనెను.

ఆయన అట్లు చెప్పఁగానే రాణి ఇది తననోముఫల మనితలఁచి సంతోషించి చిఱునవ్వునవ్వుచు తాను చేయవలసినకార్యముల నన్నిటిని సరిగా తీర్చుకొని పిమ్మట రాజును చూచి'తమరు మఱి యొకస్త్రీని కోరఁగూడ దని నేను చెప్పను; పక్షపాతములేక నా యందును అంతయనురాగ ముంపవలయు నని ప్రార్థించెదను.' అనఁగా, విదూషకుఁడు తనమనస్సున,'చేయితప్పి చేప పరుగెత్తి పోఁగా చెంబడివాఁడు తనకుధర్మము కొంచెముండుఁగాకయను కొన్నట్లు ఈమెయు తానుపట్టినది సాగ దని తెలిసికొని రాజు గారికుత్తరువిచ్చివేసినది.'అని యెంచుకొనుచు ఆమెతో, 'ఆయన నీయుత్తరువుచొప్పున నడవవలసినవాఁడేకదా!'అనెను. అప్పుడు పురూరవుఁడును భార్యతో,'నే నెవతెమీఁదనో మనస్సు పెట్టి యున్నట్లు నీవు తలఁపవలసినది లేదు; నీవు నన్ను మఱియొక తెకు దానముగా నిచ్చివేసినను వేయవచ్చును; నేనుగా మఱియొక తెను కోరుటకు నాకు స్వాతంత్ర్య మెక్కడిది?' అనఁగా, రాణి,'అదెట్లయిన నుండుఁగాక, నేను తలఁచినప్రకారము వ్రతమును నియమ లోపమేమియు లేక చేయుచున్నాను.' అని యాయనతో జెప్పి తనపరిచారికలను, 'ఇకను మనముపోదము రండి.' అని పిలుచు కొని ప్రయాణమగుచుండెను. అప్పుడు రాజు, నీవు నన్ను సంతోషపఱుచుటకొరకము నోముపట్టినదాన వైనయెడ, నీవు బయలుదేరిపోవుచున్నావే, నాకుసంతోష మెట్లుకలుగును?' అని యడుగ, రాణి, 'నాకు వ్రతనియమ మింకను గొంచె మున్నది, కాఁబట్టి పోయివచ్చెదను.' అనిచెప్పి తానును తనపనికత్తెలును పోయి తావు చేరెను.

ఇంత సేపు వీరు మాటలాడుచున్నదానిని విని యూర్వశి యోర్వలేక, ఈయనకు పెండ్లముమీఁద నింతయనురాగముం

దుటనెఱింగియు నామనస్సుమాత్ర మితనిమీఁది ప్రేమనువిడువఁ జాలకయున్నది' అనఁగా ఆపెచెలి, నీవిఁక నాశవదలుకొని వెనుకకు తిరిగిపోఁబోయెదవా?' అనెను. ఆసమయమున రాజు తన స్నేహితునితో, 'దేవి మనలను విడిచి సేనాదూరము పోయినది గదా' అనఁగా అతఁడు 'ఇఁక నీపని కొట్టినపిండి, ఏమి చేసినను అదేమని యడుగువారు లేరు. రాణిగారు, ఇఁక మనచేతఁగాదని రోగిని వైద్యుఁడు చెయివిడిచినట్లు తమ్మును తమయిష్టప్రకారము విడిచిపోయిరి' అని చెప్పెను. పురూరవశ్చక్రవర్తి,' అట్లయిన నిప్పుడాయూర్వశివచ్చిన మన కేమియాటంకము లేదు.' అని చెప్పఁగా, ఊర్వశి యామాటవిని మిక్కిలిసంతోషించి,ఇఁక నాయిష్టము నెఱవేఱినది అనియెంచుకొనెను. అంత రాజు, 'ఆపె నాయెదుటరానుగూడ నక్కఱలేదు, ఆపెకాలియందెలచప్పుడు నా చెవికి వినవచ్చునట్లు నడవనైననడవనీ, నాకు వెనుకప్రక్కగా వచ్చి యాపె హస్తకమలములతో నాకన్నుల మూయనైన మూయనీ, అటుగాకపోయిన ఆపె నాదగ్గఱరాను జంకియుండఁగా ఆపెచెలియైనను ఆపెనుపట్టుకొనివచ్చి నాదగ్గఱ విడువనీ ఇందేదైన నొకవిధము జరగినఁ జాలును.' అని చెప్పఁగా విని ఊర్వశి, ఇదే మనము పోవలసినసమయము అనుకొని ఆయనకుఁ గనబడక వెనుకప్రక్కగావచ్చి ఆయనకన్నులుమూసెను.అప్పుడు విదూషకుఁడు రాజుతో, 'ఇదేమి! నీకన్నులెవరో మూసినారే' అని పరిహాసముచేయఁగా, ఆయన యామెను తడవిచూచి, ఆయూర్వశియే యనెను. దానిమీఁద విదూషకుఁడు 'ఊర్వశి యని నీవెట్లు తెలిసికొంటివి?' అని యడుగ,' రాజు, ఆపెచేతులు నామీఁద తగులఁగానే నాతాప మంతయు తీఱి దేహము చల్లఁబడెనే,ఇంకొకరైన నట్లగునా? చంద్రోదయము కాక కలువ వి

సించునా?' అని చెప్పి యామెచెయి పట్టుకొనియే లేచెను. అంత ఊర్వశి యెదుటవచ్చి నిలిచి మ్రొక్కెను.

పిమ్మట చిత్రలేఖయును వచ్చి రాజునకు మ్రొక్కి ఆయన క్షేమమును విచారించుచు నిలువఁబడఁగా, ఊర్వశి రాజుతోఁ జెప్పసిగ్గుపడి చిత్రలేఖతో,'ఇప్పుడు పట్టపుదేవియుత్తరువిచ్చినది గనుక వచ్చిచేరితిని, ఇదివఱకు నేనురాక జాగుచేసినది తప్పుగా తలఁపవలదు' అని చెప్పెను. దానికి రాజు, 'ఇప్పుడుసరి రాణి యుత్తరువీయఁగా వచ్చితివే, ముందువచ్చి నామనస్సునుదొంగలించుకొనిపోయితివే, అప్పుడు నీ కుత్తరువిచ్చినవా రెవరు?'అని వేడుకగా నడుగ, చిత్రలేఖ,'అయ్యా! ఇఁక నేమియు నుత్తరము చెప్ప నీపెకు నోరులేదు. నేను ఈయెండకాలమున నిత్యము సూర్యుని నారాధింపవలయును; కాఁబట్టి నాకుసెలవిచ్చిన నేను పోయివచ్చెదను; మఱియు తమరు ఈమె ఒకనాటికిని దేవలోకమును తలఁచుకోకయుండునట్లు ఈమెను పెట్టుకొనియుండవలయును' అని చెప్పెను. దానికి రాజు, 'స్వర్గమందలిసుఖ మిట్టిదని మనస్సుచేత తలఁచుటకుఁగూడ శక్యముకాదే, దానిని తలఁచుకోకయుండునట్లు చేయ నెవనితరము? కడమవారికంటె నీపెను ఎక్కువగా పెట్టుకొనియుండెదను.' అనఁగా విని చిత్రలేఖ ఊర్వశితో, 'ఇఁక భయపడకుండ ఇక్కడ ఈయన ఇష్టప్రకారము నడుచుకొనుచుండుము, నేను పోయివచ్చెదను.' అని చెప్పి, ఆపెను విడిచిపోను కాళ్లాడక తిన్నతిన్నఁగా పోయి తనతావు చేరెను. అప్పుడుపురూరవుఁడు ఊర్వశితో,'నా ప్రియతమా! ఇదివఱకు బగబగమనుచున్నవన్నియు నిప్పుడు జిల్లుమని యున్నవి.' అనిచెప్పి, దాని కామె,'ఇంతసేపు తమ కంతతాపముకలుగుటకు నేనేకదా హేతువను, దానికిగా తమరు క్షమింపవలయును.' అని

ప్రియోక్తులు పలుక, 'అట్లుకాదు, ఎండలో ఎండినవానికేఁగదా నీడసుఖము తెలియును, అయిన నిప్పుడు నాకోరికయొకటి, నీవు రాకముందు రాత్రి యొకయుగముగానుండెను, ఇఁకమీఁదను అట్లేయుండిన నేనదృష్టవంతుఁడనే.' అని యామెను కూడ పిలుచుకొని యంతఃపురము పోయిచేరెను. విదూషకుఁడును తనస్నేహితునికోరిక నెఱవేఱినందునకు మిక్కిలి సంతోషించెను.

పిమ్మట కొన్నాళ్లకు ఊర్వశి తనప్రియుఁడును తానును రమణీయములైనయడవులలోను కొండలలోను వేడుకగానుండ వలయునని యాశపడి తనకోరికను ప్రియున కెఱింగింప, ఆయన యును దానికి సమ్మతించి రాజ్యవిచారణను మంత్రులకు ఒప్ప గించి, ఆమెనుకూడ పిలుచుకొనిపోయి కైలాసపర్వతము ప్రక్క నున్న గంధమాదన మనుపర్వతముమీఁద విహరించు చుండెను. అప్పుడు ఊర్వశి, దురదృష్టదినము లగుటచేత, అక్కడ ప్రవహించుచున్న గంగానదియిసుకదిన్నెలలో ఆట లాడుచున్న విద్యాధరకన్యకమీఁద తనప్రియునకు మనస్సు కలిగినట్లు ఎంచి కోపగించుకొని, ఆయన యెంతఅడుగుకొనినను కోపముతీఱక భరతమునిశాపముచేత జ్ఞానముచెడిపోయి ప్రక్క నున్నకుమారవనము ప్రవేశింపఁగా, పూర్వము సుబ్రహ్మణ్య స్వామి ఆవనమున తపస్సుచేయఁబోవుచు దాని కెవరేని విఘ్న ముచేయకుండుటకుఁగా ఆవనములోపల ఏలలన ప్రవేశించునో ఆమె ఒకతీఁగయైపోవునుగాక యని శపించి యావనమునకు కుమారవనమని పేరుపెట్టియుండెను గనుక, ఆశాపబలముచేత బండిగురిగింజతీఁగగా మాఱిపోయినది.

అంత పురూరవశ్చక్రవర్తి ఆమెపోయినపోబడి తెలియక మిక్కిలి వ్యసనమునుబొంది వెఱ్ఱిపట్టినవానివలె ఆయడవియందు

సంచరించుమృగములను. పక్షులను తనప్రియురాలిసమాచా
రము నడుగుచు అవి వానియంతట పోఁగా తన్ను లక్ష్యపెట్టక
పోవుచున్నవని యవివేకపుమాటలుచెప్పుచు నల్లాడుచుండెను.
అటువంటిసమయమున వానకాలమువచ్చి నల్లగా మబ్బులులేచి
యాకాశమంతయుఁ గమ్ముకొని మెఱుములు తళతళ మెఱయు
సాగెను. అవన్ని సాధారణజనులకుఁగూడ మనస్సులు చలింపఁ
జేసెడివి; ఆయడవినడుమ ప్రియురాలిని పోఁగొట్టుకొని దపించు
చున్న యారాజుయొక్క అప్పటిదుఃఖ మేమని చెప్పవచ్చును.
ఆయన అట్లే ఆయడవియంతయు హంసకూఁతలు వినఁగానే
తనప్రియురాలి కాలియందెలచప్పు డని యాప్రక్కతిరిగిచూచు
చును పచ్చికమీఁదఁ బడియున్న యింద్రగోపపుఁబురుగులను
చూడఁగానే లత్తుకతోఁగూడిన తనప్రియురాలి పచ్చవన్నె
పయంటచెఱఁ గని వంగి యెత్తుకోఁబోవుచును ఇట్లుపలు తెఱఁగుల
తెలివిమాలినపనులకు లోనై తిరుగుచుండి మరలఆపె అగపడక
పోయినత్రోవననే పోయిచూత మనుకొని యక్కడికి వచ్చెను.
అక్కడికిరాఁగా ఆయనకు అక్కడ ఒక పెద్దఱాతిప్రక్కను తళ
తళ మెఱయుచు నొకరత్నము కనఁబడెను. ఆయన దానినిఁజూచి,
'మన మిప్పుడు దీని నెత్తుకొని యేమిచేయవచ్చును. ఊర్వశి
యుండినంగదా దీనికి ఫలముకలదు,ఆపెను పోఁగొట్టుకొంటిమే,
ఇప్పుడు దీని నెత్తుకొని యేల కన్నీళ్లచేత మాపవలె.' అను
కొనుచు దాని నెత్తుకోకయుండఁగా,'నాయనా! దీని నెత్తుకొమ్ము
దీనికి సంగమనీయ మని పేరు, ఇది పార్వతీదేవి కాలిలత్తుకనుండి
పుట్టినది, దీనిమహిమ యేమనఁగా ఇష్టమైనవస్తు వేదైన కనఁ
బడకపోయియుండిన తత్క్షణము కనఁబడును.' అని యాకాశ
మున నొకమాట వినవచ్చెను. దానిని విని ఆయన మనయం

దీశ్వరునికేమో దయవచ్చియుండవలె ననుకొని యామణిని చేత నెత్తుకొని దాని ప్రకాశమును చూచుచుండఁగా ఎదుట పువ్వొక్కటైన లేక నిండ చిగిరించియున్న బండిగురిగింజతీఁగ యొకటి ఆయనకుఁ గనఁబడెను. అంత ఆయన, ఏమి యీతీఁగను జూడఁగానే మనస్సునకేమో ఊర్వశినిఁజూచినట్లు సంతోషము కలుగుచున్నది అనుకొని దానిదగ్గఱకుపోయి కన్నులు రెండును గట్టిగా మూసికొని దానిని కౌఁగిలించుకొని ఊర్వశిగానే భావించెను. అంత నాతీఁగ తిరిగి యూర్వశిగా మాఱినది.

అప్పుడు ఆయన, ఇదేమి కంటికి తీఁగగాఁ గనఁబడినది చేతి కూర్వశివలె నున్నది, ఒకవేళ ఊర్వశిగానే యుండునా, మన మిదివఱకెన్నిమాఱులో యిట్లేమఱచిపోయియున్నాము, ఇప్పుడు కన్ను తెఱచిచూచిన నిది యూర్వశిగా నుండునో ఉండదో అనుకొనుచునే తిన్నతిన్నఁగా కన్నులు తెఱచిచూచెను. ఇట్లాయన కన్నులు తెఱచి తన్ను చూడఁగానే ఊర్వశి దుఃఖమును ఆఁపఁజాలక కన్నుల నీళ్లువిడుచుకొనెను. అదిచూచి యారాజు, 'ప్రాణప్రియా! ఇదివఱకు నిన్నుఁబాసి నే ననుభవించినదుఃఖము చెప్పితీఱదు, ఇప్పుడు నిన్నుఁ జూడఁగా ప్రాణముపోయినవాఁడు తిరిగి బ్రదికిన ట్లైతిని.' అనఁగా, ఆమె, 'అవును తమరుపడిన బాధలనన్నిటిని నేను జ్ఞానదృష్టిచేత ప్రత్యక్షముగాచూచుచునే యుంటిని'అనెను. అది విని యాయన, 'జ్ఞానదృష్టి అనఁగా నెటువంటిది? దానితో చూచుట అనఁగా నెటువంటిది? ఆవివరమంతయు నాకుఁ జెప్పుము.' అని యామె నడుగ, ఆమె, మాకు దివ్యజ్ఞానముకలదు, మానాట్యగురువుశాపముచేత నీవనమందు ప్రవేశించునపుడుమాత్రమాజ్ఞానము తప్పిపోయి ప్రవేశించితిని; సుబ్రహ్మణ్యస్వామి దీనిలోపల ఎవరును స్త్రీలు రాఁగూడ దని

యాజ్ఞ చేసియున్నందున ఈవనములోపల ప్రవేశించినమాత్రము ననే నేను బండిగురిగింజతీఁగనై పోతిని; అయినను ఆయన సంగమనీయ మనుమణి దొరికినపక్షమున నీశాపము తీఱు నని చెప్పియుండెను; నేను తీఁగగా మాఱిపోయినను నాకు దివ్యదృష్టి యున్నందున ఈవిషయములన్నియు తెలియవచ్చుచుండినవి. మంచిది, ఇఁక నీసమాచారములను పోనిమ్ము మనము పట్టణము విడిచివచ్చి బహుదినము లాయెను; జనులందఱు మిక్కిలి వ్యసనపడుచుందురు. కాబట్టి పోవుదము రండి' అని పిలిచెను. ఆయనయును దాని కొప్పుకొఁగా ఇద్దఱును ఆ మెఘుహము చేత మేఘువాహనము నెక్కుకొనిపోయి ప్రతిష్ఠానపట్టణము చేరిరి.

పిమ్మట పురూరవశ్చక్రవర్తి ఊర్వశితోఁగూడ నే సంతోషముతో రాజ్యపరిపాలనము చేయుచు రాఁగా, కొన్నాళ్ళకు ఆమెకు గర్భముకలిగెను. అప్పుడామె, మును దింద్రుఁడు తనకు చేసియున్నయుత్తరువును దలఁచుకొని, తనకు బుట్టినబిడ్డనీరాజు చూచినతోడనే తా నీయనను, విడిచిపోవలయు నేయని యోచించి, కొడుకు పుట్టినతోడనే ఆకొడుకును రాజునకు తెలియనీయకుండ చ్యవనమునియాశ్రమమున కెత్తుకొనిపోయి అక్కడనున్న సత్యవతి యను తాపసస్త్రీవశమున ఒప్పగించి, ఆశిశువునకు జరిగింపవలసిన జాతకర్మ నామకరణాదిసంస్కారములన్నియు జరపించి సకలవిద్యలను నేర్పింపు మని యామెతోఁ జెప్పి తిరిగి వచ్చి ప్రతిష్ఠానపురముచేరెను. ఆతాపసియును ఆబిడ్డను దినదినమునకు దేహము పెరిగి అప్పటప్పటికి వన్నెయెక్కునట్లు మిక్కిలి గారాబముతో పెంచి చ్యవనమునిచేత జరగవలసినకార్యము లన్నియు జరపింప, ఆచిన్నవాఁడు సకలశాస్త్రములయందును

ధనుర్విద్యయందును మిగుల నిపుణుఁడై అక్కడిఋషికుమారులతోఁగూడ వేడుకగా నుండెను.

ఇట్లుండ, ఒకనాఁడు పుణ్యదినమైనందున పురూరవశ్చక్రవర్తి తనభార్యలతోఁగూడ ప్రయాగలో స్నానము చేసివచ్చి శృంగారించుకొనుచుండఁగా, ఊర్వశికి తలలోఁ బెట్టుటకుఁగా ఆసంగమనీయమణిని ఒకపరిచారిక బంగారుతట్టలో పెట్టుకొని వచ్చుచుండఁగా ఒకగ్రద్ధ చూచి మాంసమనుకొని యెత్తుకొని పోయెను. ఇట్లెత్తుకొనిపోవునపుడు ఆగ్రద్ధ చ్యవనముని యాశ్రమమునకు సమీపమున పోవుచుండఁగా అక్కడ ఋషికుమారులతోఁగూడ నున్న యీరాజకుమారుఁడు దానింగని 'అర్ధనారాచము' అను బాణముతోఁ గొట్టెను. అదిపోయి తగులఁగానే ఆగ్రద్ధ ఆమణిని నోటఁగఱచుకొని అక్కడ క్రిందపడెను. ఇక్కడ పురూరవశ్చక్రవర్తి ఆమణిని గ్రద్ధయెత్తుకొనిపోయినసమాచారమునువిని అలంకారము చేసికొనుచున్న వాఁడు సగముపట్టుననే లేచి, 'ఎక్కడ ఆగ్రద్ధ?' అని అడుగుచు బయటవచ్చి ఆకాశమున పరువెత్తుచున్న ఆగ్రద్ధనుచూచి విల్లుతెమ్మని తీఱ విల్లు తెచ్చునంతలో అది బహుదూరము మిగిలిపోయినందున, తన దగ్గఱనున్న కంచుకితో, ఆపక్షి యెక్కడపోయినను తిరిగివచ్చి గూఁడు చేరును, కాఁబట్టి పట్టణముతలారితో దానిగూఁడెక్కడనో కనిపెట్టియుండి అదివచ్చి గూఁటిలో వ్రాలఁగానే మణి నెత్తుకొనిరావలయునంటినని చెప్పుము' అనియాజ్ఞాపించెను. తోడనే అతఁడు పోయి యాసమాచారమును చెప్పఁగా, పట్టణముతలారి నలుదిక్కులను మనుష్యులను తఱిమి వెదకించెను. ఇట్లు పోయి వెదకువారిలో నొకనికి ఈమణిని నోటఁగఱచుకొని చచ్చిపడియున్న గ్రద్ధయును దానిని తగిలినబాణమును కనఁబడఁగా వాఁ

డాబాణమును రత్నమునుం జేతనెత్తుకొనిపోయి తలారివశ మునవిచ్చెను. అతఁడు దానిని కంచుకిచేత నిచ్చి రాజుదగ్గఱకుఁ బంపఁగా, ఆకంచుకి పోయి యీ వయినమంతయు మనవిచేసిన తోడనే రాజు మణిని చక్కఁగాకడిగి పెట్టెలో పెట్టుమని పరిచారి కకు ఆజ్ఞాపించి కంచుకినిఁజూచి,'ఈబాణమును వేసినవాఁడెవఁడో నీకుఁ దెలియునా?' అని యడిగెను. దానికాకంచుకి, 'ఈబాణము మీఁద నేమో వ్రాసియున్నది, నా కాయక్షరములు తెలియ లేదు; తమరు చదువుకొన్నఁ దెలియును.' అని చెప్పి ఆబాణ మును చేత నిచ్చి తనపనికి పోయెను. రాజును దానియం దున్న యక్షరములను చదువుకోఁగా 'పురూరవశ్చక్రవర్తికి ఊర్వశి యందుఁ బుట్టిన ఆయు వనువానిబాణ మిది, పగతుర ప్రాణముల నపహరించెడిది' అనియుండెను. అంత రాజు తనకు కొడుకెప్పుడు కలిగె నని యోచించుచుండఁగా, ఆయనప్రక్కనున్న మాణవ కుఁడు,'ఏమి దానినిఁజూచి యోచనచేయుచున్నావు?' అని యడి గెను. అప్పుడు రాజు దాని నతనికి చదివి వినిపింపఁగా, అతఁడు, 'ఏదెట్లైనకానిమ్మయ్యా! పరమేశ్వరునియనుగ్రహమువలన నీకొక కుమారుఁ దేర్పడెనుగదా! అంతేచాలును' అనెను. దానికి రాజు, ఇదేమి వింతగా నున్నది, నైమిశారణ్యమున జరగినయజ్ఞమునఁ దప్ప కడమప్పుడు నేనూర్వశి నెడఁబాసియెఱుఁగనే కుమారుఁ డెప్పుడుకలిగెను, ఒకటిమాత్రము కలదు, కొన్నిదినము లేమో గర్భవతివలె కానఁబడుచుండెను, ఒకవేళ అట్లేయుండనిమ్ము, ఈ విషయమును మనకు తెలియనీయక దాఁపనేల, దానివయినము మనకు స్పష్టముగా తెలియలేదే అని ఆలోచించుచుండెను. .

ఇక్కడిసమాచార మిట్లుండ, అక్కడ చ్యవనముని యీ రాచకుమారుఁడు బాణముతో గ్రద్దను గొట్టినసమాచారము

విని, 'ఇతఁడు ఋష్యాశ్రమములకు విరుద్ధములైనకార్యములు చేయ నారంభించినాఁడు; కాఁబట్టి యిఁకమీఁద నిక్కడనుండఁ దగఁడు, నీవితనిఁబిలుచుకొనిపోయి తల్లిదండ్రులదగ్గఱవిడిచిరా' అని సత్యవతి కాజ్ఞాపింపఁగా, ఆమె విల్లును చేతఁబట్టుకొనియున్న యీచిన్నవానిని పిలుచుకొని రాజుదగ్గఱకు వచ్చెను. రాఁగానే రాజు ఆమెకు భక్తితో తగినమర్యాదలు జరపి, 'ఇప్పుడు మీరు వచ్చినపనియేమి?' అని యడుగఁగా, ఆమె, 'ఏహేతువుచేతనో ఊర్వశి యీచిన్నవానిని బిడ్డగా నున్నప్పుడే నాదగ్గఱ తెచ్చి విడిచి, ఇతనికి జరగింపవలసినకార్యములన్నియు జరగించి చక్కఁగా పోషింపుమని చెప్పెను. నేనును ఆమెమాటప్రకారము ఇది వఱకును కాపాడితిని. ఇప్పుడీతఁడు ఆకాశమున నొకపక్షి తనం తట పరుగెత్తుటం జూచి దాని నొకబాణముతోఁ గొట్టెను; ఆ వృత్తాంతము చ్యవనమహర్షికి తెలిసి ఆయన యీచిన్నవానిని పిలుచుకొనిపోయి తల్లిదండ్రులదగ్గఱ చేర్చి రా, అని చెప్పి నందున నేనితనిం దోడ్కొనివచ్చితిని; ఊర్వశిని చూడఁగలయును' అని చెప్పెను. ఆయన దానికి మంచి దక్లేకాని మ్మని ఊర్వశిని రమ్మని చెప్పిపంపఁగా ఆమెవచ్చి రాజసింహాసనము పాదపీఠమున కూర్చుండియున్న తనకుమారునిం జూచి; ఓహోహో! నేను దాఁచియున్నసమాచారమును సత్యవతి బయలుపఱచెను గదా! యని దిగులుపడి పుత్రునిఁ జూచినసంతోషమున మరల దాని మఱచిపోయి రాజుప్రక్కనువచ్చి కూర్చుండెను. అప్పుడా తాపసి ఊర్వశినిఁ జూచి, 'ఈచిన్నవాఁడు అన్నివిద్యలయందును పండితుఁ డాయెను. ప్రభుత్వము చేయఁదగినవయస్సును వచ్చినది. కాఁబట్టి తమదగ్గఱ తెచ్చివిడిచితిని. ఇఁకను నేనిక్కడ కాలహరణము చేయుచుండిన నాయాశ్రమకార్యములకు లోపము కలుగును;

శీఘ్రముగా పోవలయును.' అని చెప్పి సెలవుతీసికొని పోవుటకు బయలుదేరెను. అప్పుడాచిన్నవాఁడు ఆమెదగ్గఱి మాలిమిచేత తాను నామెవెంట నాశ్రమమునకు పోవుటకు బయలుదేరఁగా ఆమె అతనిని సమాధానపఱిచి రాజుదగ్గఱ విడిచిపెట్టి తాను పోయి తనయాశ్రమము చేరెను.

అప్పుడా రాజు ఆకొడుకునుజూచి మిక్కిలిసంతోషముతో 'దేవేంద్రునికి జయంతుఁడనుకొడుకువలె నాకీకొడుకు కలిగెను' అనిచెప్పెను. అప్పుడు ఊర్వశికి ఆదేవేంద్రునిపేరు విన్నతోడనే తనపూర్వపువృత్తాంతము స్మృతికిరాఁగా, ఆమె ఇఁక నీరాజును బాయవలయునే యనుకొని కన్నుల నీళ్లువిడుచుకొనెను. అది చూచి పురూరవసుఁడు, ఇదేమని మనస్సున కలవరపడి ఊర్వశినిఁ జూచి, 'నా ప్రియతమా! మనవంశమునకు వేఱు మొదలుగా ఒకచిన్నవాఁడేర్పడెనుగదా యని నేను సంతోషపడుచుండ నీవు వ్యసనపడుటకేమి కారణము?' అని యడుగఁగా ఊర్వశి, 'మొదట నేనొకసారి తమ రుద్యానవనమునసుండఁగా వచ్చియుండి నాట్యమాడుటకయి తిరిగి దేవలోకమునకు పోతినే, అప్పుడు నేనక్కడ తమమీఁదనే మనస్సుగానున్నందున నాట్యమాడునపుడు వేరే యేదో చెప్పవలసినదానికిఁగా తమపేరు చెప్పితిని. దానిని విని నానాట్యగురువైన భరతముని, 'ఇఁక నెన్నఁడును నీకు దేవలోకమున వాసము లేకపోవుఁగాక' అని శపింపఁగా, ఇంద్రుఁడు నాతో, 'నీవు నీయిష్టప్రకారమే మనయిష్టుఁడైన పురూరవశ్చక్రవర్తిదగ్గఱ పోయియుండి ఒకకొడుకునుఁ గని ఆకొడుకును ఆయనకు ఒప్పగించి పిమ్మట నాదగ్గఱ వచ్చిచేరుము' అని యుత్తరువుచేసెను. ఇప్పుడు అది తలంపునకువచ్చి దేవరవారిని బాసి పోవలయునే అని వ్యసనపడితిని. ఇది నావ్యసనకారణము' అని

చెప్పెను. దానిని విని యారాజు నిట్టూర్పువిడిచి, అయ్యో! ఎండలో ఎండుచున్న మ్రాను వానకురిసి చల్లఁబడియుండఁగా దానిమీఁద పిడుగుపడ్డట్టు,ఇన్నాళ్లకు కొడుకు నొకనిని కన్నులఁ-జూచితిమిగదా యనుసెమ్మది లేక యేమివచ్చెను అని వ్యసన పడఁగా, అప్పుడు ఊర్వశి, 'మన కొకకొడుకుకలిగెను, ఇఁక మన మిక్కడ నేల యుండవలె, మనతావునకు పోవుదము. అని నేను తలఁచినట్టు తోఁచునేమో'అనెను దానికి రాజు, 'ఏమీ, ఇన్నిదినములు నీతోఁగూడ నుండి నీమనస్సును నే నెఱుఁగక యా యున్నాను అట్లు తలఁచుటకు; నీవు మీయింద్రునియుత్తరువుప్రకారము నడచుకోవలసినదానవేకదా, నేనును నీకొడుకునకు పట్టాభిషేకము చేయించి అడవికి పోయిచేరి తపస్సు చేసి. కొనుచుండెదను.' అని చెప్పి,పట్టాభిషేకమునకు కావలసినప్రయత్నము జరగించునట్లు మంత్రుల కుత్తరువుచేసెను. అప్పుడా రాజకుమారుఁడు తండ్రినిఁజూచి,'మహాబలపరాక్రములు గలవారు నిర్వహింపవలసినరాజ్యభారమును నామీఁదఁ బెట్టుట మంచిక్రొవ్విన యెద్దున కెత్తవలసినబరువును లేఁతదూడ మీఁద నెత్తిన ట్లుండునే, మీ రిట్లు యోచించుచున్నా రేమి?' అనఁగా రాజు, 'నాయనా! అట్లుకాదు, ఇవన్ని జాతినంటి వచ్చునవనులేకాని వయస్సునంటి వచ్చినవి కావు. సింహము పిల్లగానుండినను ఏనుఁగుమీఁది కెగురుచుండును ; పాము పిల్లగానున్నందున విషము తక్కువగా ఉండదు చూడుము'అని సమాధానము చెప్పెను.

అప్పుడు దేవేంద్రున కీసమాచారము తెలిసి, ఆయన నారదమునిని, 'తమరుపోయి పురూరవశ్చక్రవర్తిని వనమునకు పోకుండ నిలుపవలయును.' అని చెప్పిపంపఁగా, ఆయన యా

భూమీంద్రునిదగ్గఱకు వచ్చి, ఆయన చేసినపూజను పరిగ్రహించి పీఠమునఁ గూర్చున్నపిమ్మట ఆనంపతులు నమస్కారము చేయఁగా, 'మీరు ఒండొరుల నెడఁబాయక యుండురుగాక' అని యాశీర్వదించెను. దానిని విని వారు సంతోషించి తాము పీఠములమీఁద కూర్చుండిరి. అంత నారదమహాముని పురూరవసునిం జూచి, 'మీరు అడవికి పోవునట్లు నిశ్చయించినసమాచారమును దేవేంద్రుఁడు విని, తమవలన తన కప్పుడప్పుడు అనేకసాహాయ్యకములు కావలసియుండుటవలన తమరు ఎప్పుడును ఊర్వశితోఁగూడనే యుండవచ్చును. అడవికి పోఁబనిలేదు అని చెప్పిరమ్మని నన్ను పంపెను.' అని చెప్పఁగా, దానిని విని పురూరవశ్చక్రవర్తి, 'నేను వారు ఎట్లుఆజ్ఞాపించుచున్నారోఅట్లు నడచుకొనుటకు సిద్ధముగా కనిపెట్టుకొనియున్నాను' అని చెప్పెను. ఆమాట విన్నతోడనే రంభాదులగు దేవరమణులందఱును దేవేంద్రునియాజ్ఞప్రకార మీరాజుకొడుకునకు యువరాజపట్టాభిషేకము చేయుటకుఁగా కావలసినపుణ్యతీర్థములు మొదలయినవాని నెత్తుకొనిరాఁగా, నారదుఁడు మొదలగు వారందఱును అతని కభిషేకమును జరగించి సంతోషముతో తమతమనెలవులు పోయిచేరిరి.

పురూరవశ్చక్రవర్తియును యువరాజైన తనకొడుకునే సకలవ్యవహారములను విచారించుకొమ్మని తాను ఊర్వశితోఁగూడనే బహుదినములు సుఖముగా నుండెను. ఆయువరాజు పాలించుచుండఁగా వారిరాజ్యమున అనావృష్టి మొదలయిన బాధలేవియుఁ జొచ్చినవికావు, సకలజనులును విద్యాధనముల రెంటినిం బొంది యానందించుచుండిరి.

Vavilla Press, Madras P. I, Card Q. H. No. Ms. 22, 6—8—1947

